భగవాన్ వేదవ్యాస మహర్షి రచించిన

# శ్రీ మార్కండేయ పురాణం






జిల్లెళ్ళమూడి అమ్మ

**మాతృశ్రీ అనసూయాదేవి ఆశీస్సులతో...**

**వచనం : డాక్టర్ జయంతి చక్రవర్తి**

ఎం.ఏ., ఎం.ఫిల్., పిహెచ్.డి.,

ప్రచురణ



**శ్రీ బాలాజీ పబ్లికేషన్స్**

28-25-32/1, అరండల్‌పేట, ఏలూరురోడ్, విజయవాడ-2

సెల్ : 9441176276 / 9966675815

# శ్రీ మార్కండేయ పురాణం


| | | |
|---|---|---|
| వచనం | : | డాక్టర్ **జయంతి చక్రవర్తి**<br>విజయవాడ. 9390526272 |
| ప్రథమ ముద్రణ | : | 2014 |
| ముఖచిత్రం | : | రమణ |
| డి.టి.పి. &<br>పేజి లే-అవుట్ | : | విద్యార్థి క్రియేషన్స్<br>విజయవాడ |
| ముద్రణ | : | శ్రీ స్వామి ఆఫ్‌సెట్ ప్రింటర్స్<br>విజయవాడ-3 |
| ప్రచురణ | : | **శ్రీ బాలాజీ పబ్లికేషన్స్**<br>నసురుల్లాఖాన్ వీధి<br>అరండల్‌పేట, విజయవాడ |
| వెల | : | ₹. 60 /- |




ఆర్షవిజ్ఞాన భాండాగారాలైన అష్టాదశ పురాణాలని ఆంధ్రజాతికి అందించిన శ్రీ వేంకటేశ్వర ఆర్షభారతి ట్రస్ట్ వారికి, ఆ పురాణాలను అనువదించిన మహారచయితలకి సహస్రాధిక ప్రణామాలు సమర్పిస్తున్నాం.

# భగవాన్ వేదవ్యాస మహర్షి

**వ్యాసగుహ, సరస్వతీ తీరం, బదరీనాథ్**



*అచతుర్వదనో బ్రహ్మా ద్విబాహురపరో హరిః ।*
*అఫాలలోచనః శంభుర్భగవాన్ బాదరాయణః ॥*

## కృతజ్ఞతలు

అష్టాదశ పురాణాలని సామాన్య జనానికి అందించాలని సంకల్పించిన శ్రీ బాలాజీ పబ్లికేషన్స్ అధినేత **శ్రీ పుట్టగుంట వీరయ్యచౌదరి (బోస్) గారికి** ముందుగా ప్రత్యేక కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను.

ఈ గ్రంథాలకి తమ అమూల్యమైన ఆశీస్సులందించిన శ్రీ పీఠాధిపతులు పరమపూజ్య **శ్రీశ్రీశ్రీ పరిపూర్ణానంద సరస్వతీ స్వామివారికి**, అస్మద్గురువర్యులు ఆర్షవిద్యాసాగర **బ్రహ్మశ్రీ మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తి గారికి** సహస్రాధిక వందనాలు సమర్పిస్తున్నాను.

ప్రోత్సహించిన మిత్రులు రోహిత్ ప్రింటర్స్ అధినేత శ్రీ పుప్పాల అప్పారావు గారికి, డా॥ కానుకొల్లు బాలకృష్ణ, వలివేటి శివరామకృష్ణమూర్తి, వేదాంతం సార్వభౌమ, ఉన్నవ గణేష్‌లకి..... అలాగే ఈ గ్రంథాన్ని డి.టి.పి. చేసిన శ్రీమతి వినీల గారికి పేజి మేకింగ్ చేసిన విద్యార్థి క్రియేషన్స్ వారికి ప్రత్యేక అభినందనలు...





Sreepeetam
# 1-9-278/10/1, Lalitha Nagar, Vidyanagar, Hyderabad - 500 044.
Ph: 27076655, M: 098490 33991

# ఆశీస్సులు

డా॥ జయంతి చక్రవర్తి గారు అనేక ఆధ్యాత్మిక రచనల ద్వారా తెలుగు పాఠకులకు సుపరిచితులు. విజయవాడ కనకదుర్గ దేవస్థానం పక్షాన వెలువడుతున్న 'కనకదుర్గ ప్రభ' పత్రికకు ప్రారంభ సంపాదకులుగా ఆయన పేరు తెచ్చుకున్నారు. 'దశ మహావిద్యలు' పుస్తక రచన తరువాత డా॥చక్రవర్తి గారు అష్టాదశ పురాణాలను తెలుగు పాఠక ప్రపంచంలోకి లోతుగా తీసుకువెళ్లాలని సంకల్పించారు. ఒక్కొక్క పురాణ సారాంశాన్ని ఒక్కొక్క చిన్న పుస్తకంగా విడుదల చేయాలన్న ఆ రచయిత సంకల్పం ప్రశంసనీయం.

ఈ చిన్నిపొత్తాలు పాఠకులందరికీ ప్రయోజనకరంగా, సదుపాయకరంగా ఉంటాయి. వీటి ఉపయోగాన్ని పాఠకులందరూ అందిపుచ్చుకోవాలని మనసారా ఆకాంక్షిస్తున్నాను.



స్వామి పరిపూర్ణానంద

**జయ వత్సరం, శ్రావణ పూర్ణిమ**

**(10.8.2014)**

"ఆర్షవిద్యాసాగర",  "మధురభారతి"
మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తి



దూరవాణి : 81061 96418

301, శ్రీ సాయి ఎన్‌క్లేవ్, అడవి శేషగిరిరావు వీధి, లక్ష్మీనగర్
సత్యనారాయణపురం, విజయవాడ-520011



తేది : 19-8-2014

# ఇది సృష్టి కథ

"అన్నీ వేదాల్లోనే ఉన్నాయిష" అనే వెక్కిరింపు లోకంలో బాగా ప్రచారంలో ఉంది. వెక్కిరించడానికి అన్నమాటే అయినా, ఇది నిజమని మాత్రం చెప్పక తప్పదు. వేదం సృష్టితత్త్వాన్ని, సృష్టికి మానవుడికి ఉన్న సంబంధాన్ని, మానవుడికి సృష్టికర్తతో గల అనుబంధాన్ని వ్యక్తం చేసింది. వేదం ఏ ఒక్కరో రచించిన గ్రంథం కాదు. సృష్టితత్త్వాన్ని, పరమాత్మ తత్త్వాన్ని తెలుసుకోవాలని ఆరాటపడిన మహర్షి సముదాయానికి అంతర్నేత్రానికి గోచరించిన ఒక దర్శనం. హృదయస్థానంలో వినిపించిన ఒక నాదం (శ్రుతి).వేదం 'అపౌరుషేయం' అని కూడా పెద్దలు గుర్తించారు. 'అపౌరుషేయం' అంటే మానవుమాత్రుడి రచన కాదు అని అర్థం.

అనాదిగా అలా దిగి వచ్చిన వేదం వ్యాసమహర్షి కాలానికి చిక్కువడిన దారాల రాశిగా ఉంటే, ఆ చిక్కును విడదీసి, వేదవిభాగ నిర్ణయంచేసి, వేదం మనకు అక్కరకు వచ్చేలా చేశాడు ఆ మహర్షి. ఆనాటి నుండి అతడికి 'వేదవ్యాసుడు' అనే పేరు వచ్చింది. సకల వేదాల సారాన్ని 555 సూత్రాలుగా "బ్రహ్మసూత్రాలు" రచించాడు. అయినా, ఆ మహర్షికి తృప్తి కలుగలేదు. వేదమనే విత్తనంలో నుంచి విశాలమైన పురాణ మహావృక్షాలను అంకురింపచేశాడు. అందుకే పురాణాలకు

"వేదోపబృంహణాలు" అని పేరు. "ఉపబృంహణం" అంటే విత్తనాలు నుంచి మొలక రావడం. విత్తనంలో ఏమి ఉన్నదో మొలకలో, మొక్కలో, చెట్టులో అదే ఉంటుంది.

వేదవాఙ్మయంలో దాగిన సృష్టితత్త్వాన్ని కథారూపంగా వివరించడానికి అష్టాదశ పురాణాలను రచించాడు వ్యాసమహర్షి. మానవాభ్యుదయం కోసం వెలువడిన ఈ పురాణ వాఙ్మయసారాన్ని సంక్షిప్తంగా సంకలనం చేసి అందిస్తే, ఈనాటి సమాజానికి శ్రేయస్సు కలుగుతుందని సంకల్పించాడు మా శిష్యమిత్రుడు డా॥ జయంతి చక్రవర్తి. తన ఓర్పు నేర్పులతో అష్టాదశ పురాణాల ఆంతర్యాన్ని వాడుకభాషలో నేటి జన సామాన్యానికి అందుబాటులోకి తెచ్చే పవిత్రమైన బాధ్యతను నెరవేర్చాడు.

మంచి సాహిత్యాన్ని మన సమాజానికి అందించే మహత్తర లక్ష్యంతో శ్రీ బాలాజీ పబ్లికేషన్స్ వారు ఈ అష్టాదశ పురాణాలని ప్రచురించటానికి ముందుకు వచ్చారు. వీరిద్వారా ఇంకా ఎన్నో చక్కని గ్రంథాలు వెలుగు చూస్తున్నాయి.

పురాణ వాఙ్మయంలోని పుణ్యకథా విశేషాలను ఈనాటి సమాజానికి పంచే కృషిలో పాలు పంచుకుంటున్న మా చక్రవర్తి, సంప్రదాయ సాహిత్యాన్ని ప్రచురించే సత్కార్యాన్ని మహాయజ్ఞంగా స్వీకరించిన ప్రచురణకర్త శ్రీ బాలాజీ పబ్లికేషన్స్ వారు ఎంతైనా అభినందనీయులు.

వీరిద్దరికీ అంతర్యామి అనంత శుభాలనూ ప్రసాదించాలని ఆశీర్వదిస్తూ, ఈ గ్రంథాలు ప్రజలకు చేరువ కాగలవని ఆకాంక్షిస్తున్నాను.

- మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తి



# పురాణ పురుషుడు శ్రీమన్నారాయణుడు



# విషయసూచిక





# ఉపోద్ఘాతము

అం.ఆ

**వక్రతుండ మహాకాయ కోటిసూర్య సమప్రభ ।**
**నిర్విఘ్నం కురుమేదేవ సర్వకార్యేషు సర్వదా ॥**

**వ్యాసం వశిష్ఠనప్తారం శక్తేః పౌత్ర మకల్మషమ్ ।**
**పరాశరాత్మజం వందే శుకతాతం తపోనిధిమ్ ॥**

## అష్టాదశ పురాణాలు

మన భారతవాఙ్మయంలో వేదాల తరువాత అంతటి ప్రాశస్త్యాన్ని పొందిన గ్రంథాలు పురాణాలు. వేదాల్లో చెప్పిన ధర్మాల్ని కథలరూపంలో, ఆఖ్యానాల రూపంలో సామాన్యులకు సైతం అర్థమయ్యేలా తెలియచెప్పేవే పురాణాలు. అందుకే పురాణాల్ని పంచమవేదంగా కీర్తించారు. అసలు పురాణం అంటే? పురా అపినవం-పురాతనమైనప్పటికీ నూతనంగా వుండేది అని అర్థం. అలాగే 'పురా ఆనతి' అంటే ప్రాచీనకాలంలో జరిగింది అని, వాయుపురాణం పురాణశబ్దాన్ని నిర్వచిస్తే, 'పురాఏతత్ అభూత్' పూర్వం ఇలా జరిగింది అని బ్రహ్మాండ పురాణం పురాణశబ్దానికి అర్థాన్ని చెబుతుంది. వీటన్నిటినీ క్రోడీకరించి చూస్తే పురాణం అంటే పూర్వకాలంలో జరిగిన ఎన్నో విషయాల్ని వివరించి చెప్పేది అని తెలుస్తోంది.

పురాణాలు ఎన్ని-

పురాణాలు మహాపురాణాలు, ఉపపురాణాలని రెండు విధాలుగా వున్నాయి. మహాపురాణాలు 18, అలాగే ఉపపురాణాలు 18.

**బ్రహ్మం పాద్మం వైష్ణవం చ వాయవీయం తథైవచ ।**
**భాగవతం నారదదీయం మార్కండేయంచ కీర్తితమ్ ॥**

**ఆగ్నేయంచ భవిష్యంచ బ్రహ్మవైవర్త లింగకే ।**
**వారాహంచ తథా స్కాందం వామనం కూర్మ సంజ్ఞకమ్ ।**
**మాత్స్యం చ గారుడం తద్వద్బ్రహ్మాండాఖ్యమితి త్రిషట్ ॥**

1.బ్రహ్మపురాణం 2.పద్మపురాణం 3.విష్ణుపురాణం 4.వాయు పురాణం 5.భాగవత పురాణం 6.నారదపురాణం 7.మార్కండేయ పురాణం

8.అగ్నిపురాణం 9.భవిష్యపురాణం 10.బ్రహ్మవైవర్త పురాణం 11.లింగపురాణం 12. వరాహ పురాణం 13.స్కాంద పురాణం 14.వామన పురాణం 15.కూర్మ పురాణం 16.మత్స్య పురాణం 17.గరుడ పురాణం 18.బ్రహ్మాండ పురాణం-ఈ పద్దెనిమిదీ మహాపురాణాలు. అలాగే 18 ఉపపురాణాలు కూడా వున్నాయి. ఈ మహాపురాణాల పేర్లని గుర్తుంచుకోవటానికి శ్లోకం కూడా వుంది.

**'మ' ద్వయం 'భ' ద్వయం చైవ 'బ్ర'త్రయం 'వ' చతుష్టయం ।**
**అనాపలింగ కూస్కాని పురాణాని పృథక్ పృథక్ ॥**

'మ' తో మొదలయ్యేవి రెండు 1.మత్స్య 2.మార్కండేయ

'భ' తో మొదలయ్యేవి రెండు 1.భాగవత 2.భవిష్య

'బ్ర' తో మొదలయ్యేవి మూడు 1.బ్రహ్మ 2.బ్రహ్మవైవర్త 3.బ్రహ్మాండ

'వ' తో మొదలయ్యేవి నాలుగు 1.వాయు 2.విష్ణు 3.వామన 4.వరాహ

అ-అగ్ని, నా-నారద, ప-పద్మ, లిం-లింగ, గ-గరుడ, కూ-కూర్మ, స్కా-స్కాంద ఇలా మొత్తం పద్దెనిమిది పురాణాలు.

## పురాణాలు విష్ణుస్వరూపం

అష్టాదశ పురాణాలను సాక్షాత్తు విష్ణు స్వరూపంగా పోల్చారు. 18 పురాణాలని మహావిష్ణువు శరీరంలోని 18 అంగాలుగా భావిస్తారు మన ప్రాచీన ఋషులు.

1. బ్రహ్మపురాణం - శ్రీ మహావిష్ణువు శిరస్సు
2. పద్మపురాణం - శ్రీ మహావిష్ణువు హృదయం
3. విష్ణుపురాణం - శ్రీ మహావిష్ణువు కుడిభుజం
4. వాయుపురాణం - శ్రీ మహావిష్ణువు ఎడమభుజం
5. భాగవతపురాణం - శ్రీ మహావిష్ణువు ఊరువులు
6. నారదపురాణం - శ్రీ మహావిష్ణువు నాభి
7. మార్కండేయపురాణం - శ్రీ మహావిష్ణువు కుడిపాదం
8. అగ్నిపురాణం - శ్రీ మహావిష్ణువు ఎడమపాదం

| | | | |
|---|---|---|---|
| 9. | భవిష్యపురాణం | - | శ్రీ మహావిష్ణువు కుడిమోకాలు |
| 10. | బ్రహ్మవైవర్తపురాణం | - | శ్రీ మహావిష్ణువు ఎడమమోకాలు |
| 11. | లింగపురాణం | - | శ్రీ మహావిష్ణువు కుడి చీలమండ |
| 12. | వరాహపురాణం | - | శ్రీ మహావిష్ణువు ఎడమ చీలమండ |
| 13. | స్కందపురాణం | - | శ్రీ మహావిష్ణువు కేశాలు |
| 14. | వామనపురాణం | - | శ్రీ మహావిష్ణువు చర్మం |
| 15. | కూర్మపురాణం | - | శ్రీ మహావిష్ణువు పృష్ఠభాగం |
| 16. | మత్స్యపురాణం | - | శ్రీ మహావిష్ణువు మెదడు |
| 17. | గరుడపురాణం | - | శ్రీ మహావిష్ణువు మాంససారం |
| 18. | బ్రహ్మాండపురాణం | - | శ్రీ మహావిష్ణువు ఎముకలు |

పురాణ లక్షణం :-

**సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశోమన్వంత రాణి చ ।**
**వంశానుచరితం చేతి పురాణం పంచ లక్షణం ॥**

పురాణానికి ఐదు లక్షణాలు ప్రధానంగా వుండాలని చెప్పారు. 1.సర్గ-అంటే ప్రపంచ సృష్టి, 2.ప్రతిసర్గ-ఈ ప్రపంచ ప్రళయం, 3.వంశం-రాజుల, ఋషుల, దేవతలకు సంబంధించిన వంశ విశేషాలు-అవతారాలు 4.వంశానుచరితం-రాజవంశాలలో, ఋషుల వంశాలలో పుట్టిన వారి జీవితచరిత్రలు, 5.మన్వంతరాలు-మనువులు, మనువు ద్వారా ఏర్పడ్డ సంతతి, ఆయా మన్వంతరాలలో జరిగిన విశేషాలు. ఈ విధంగా ప్రతిపురాణం పంచలక్షణాలతో కూడి వుంటుంది.

పురాణకర్త :-

**విష్ణోరంశో మునిర్జాత సత్యవత్యాం పరాశరాత్ ।**
**పురాణ సంహితాం దద్యే తేషాం ధర్మ విధిత్సయా ॥**

అనే ఈ ప్రమాణ శ్లోకం ప్రకారం సత్యవతీ పరాశర మహర్షి కుమారుడుగా శ్రీ మహావిష్ణు అంశంతో జన్మించిన వ్యాసుడే అష్టాదశ పురాణాల కర్త అని తెలుస్తోంది. ఈయననే కృష్ణద్వైపాయనుడు అని కూడా అంటారు. పురాణాలకు కర్త వ్యాసుడైతే వక్త సూతమహర్షి. ఈయన నైమిశారణ్యంలో శౌనకాది మహామునులకు ఈ పురాణాలన్నిటినీ ప్రబోధించాడు.

పురాణాల ప్రాచీనత :-

వేద వాఙ్మయం ఎంత విస్తృతంగా వుందో, పురాణ వాఙ్మయం కూడా అంత విస్తృతంగా వుంది. సాధారణంగా లోకంలో వేదాలు అత్యంత ప్రాచీనమైనవని చెబుతారు. అయితే ఈ శ్లోకం వేదాలకన్నా పురాణాలే ప్రాచీనమైనవని చెబుతుంది.

**పురాణం సర్వశాస్త్రాణాం ప్రథమం బ్రహ్మణాస్మృతమ్ ।**
**నిత్యం శబ్దమయం పుణ్యం శతకోటి ప్రవిస్తరమ్ ।**
**అనంతరంచ వక్త్రేభ్యః వేదాంతస్య వినిర్గతాః ॥**

పూర్వం బ్రహ్మ నోటి నుంచి వందకోట్ల శ్లోకాలతో ముందు పురాణాలు బయలుదేరి ఆ తరువాత వేదాలు బయలుదేరాయట. ఇలా వందకోట్ల శ్లోకాలతో చతుర్ముఖ బ్రహ్మతో చెప్పబడ్డ పురాణం మొత్తం ఒక్కటిగానే వుండేది. అల్పబుద్ధులైన మానవుల కోసం ఆ బ్రహ్మదేవుడే వ్యాసుడి రూపంలో వచ్చి ఆ కోటిశ్లోకాల పురాణాన్ని నాలుగు లక్షల శ్లోకాలలోకి కుదించి దాన్ని పద్దెనిమిది పురాణాలుగా రచించాడని స్కందపురాణం చెబుతుంది.

**పురాణమేక మేవాసీ దస్మిన్ కల్పాంతరే నృప ।**
**త్రివర్గ సాధనం పుణ్యం శతకోటి ప్రవిస్తరమ్ ॥**
**స్మృత్వా జగాదచ మునీన్ ప్రతి దేవశ్చతుర్ముఖః ।**
**చతుర్లక్ష ప్రమాణేన ద్వాపరే ద్వాపరే సదా ।**
**తదష్టాదశథా కృత్వా భూర్లోకేఽ స్మిన్ ప్రభాష్యతే ॥** *(స్కంద పురాణం)*

## పాఠకులకు నమస్కారం

భగవాన్ వేదవ్యాస మహర్షి రచించిన అష్టాదశ పురాణాలు ఆర్షవిద్యా భాండాగారాలు. ఆ భాండాగారాలలో నిక్షిప్తమైన ప్రధాన విషయాల్ని 18 పుస్తకాలుగా క్రోడీకరించి మీ ముందుకు తెస్తున్నాం. సరళమైన భాషలో మేము ప్రచురించిన ఈ 18 పురాణాలని ఆదరించి, మమ్మల్ని ప్రోత్సహిస్తారని ఆశిస్తూ... మీ

***- ప్రకాశకులు, వచనకర్త***

# అష్టాదశ పురాణాల మొదటి వక్త - శ్రోత

అష్టాదశ పురాణాలను మొదటగా చెప్పిన వక్తలు వారి నుంచి మొదటిసారి విన్న శ్రోతలు ఈ క్రింద చెప్పిన విధంగా వుంటారు. అదేవిధంగా ఒక్కొక్క పురాణానికి వక్తృ శ్రోతృపరంపర వేరువేరు విధాలుగా కూడా ఉంటుంది.

| సం. పురాణం | ఏకల్ప వృత్తాంతం | వక్తృశ్రోతలు |
|---|---|---|
| 1. బ్రహ్మ పురాణాన్ని | బ్రహ్మ కల్పంలో | బ్రహ్మ మరీచి మహామునికి బోధించాడు |
| 2. పద్మ పురాణాన్ని | పద్మ కల్పంలో | స్వాయంభువమనువు బ్రహ్మకు బోధించాడు |
| 3. విష్ణు పురాణాన్ని | వరాహ కల్పంలో | పరాశరుడు బ్రహ్మకు బోధించాడు |
| 4. శివ(వాయు)పురాణాన్ని | శ్వేత కల్పంలో | శివుడు వాయువుకు బోధించాడు |
| 5. భాగవత పురాణాన్ని | సారస్వత కల్పంలో | విష్ణువు బ్రహ్మకు బోధించాడు |
| 6. నారద పురాణాన్ని | బృహత్ కల్పంలో | పూర్వ భాగాన్ని – సనకాదులు నారదునికి బోధించారు. ఉత్తరభాగాన్ని – వశిష్ఠుడు మాంధాతకు బోధించాడు |
| 7. మార్కండేయ పురాణాన్ని | శ్వేత వారాహకల్పంలో | మార్కండేయుడు జైమినికి బోధించాడు |
| 8. అగ్ని పురాణాన్ని | ఈశాన కల్పంలో | అగ్నిదేవుడు వశిష్ఠుడికి బోధించాడు |
| 9. భవిష్య పురాణాన్ని | అఘోర కల్పంలో | బ్రహ్మ మనువుకు బోధించాడు |
| 10. బ్రహ్మవైవర్త పురాణాన్ని | రథంతర కల్పంలో | సావర్ణి నారదుడికి బోధించాడు |
| 11. లింగ పురాణాన్ని | కల్పాంత కల్పంలో | పరమశివుడు నారదుడికి బోధించాడు |
| 12. వరాహ పురాణాన్ని | మనుకల్పంలో | విష్ణువు పృథ్వికి బోధించాడు |
| 13. స్కాంద పురాణాన్ని | తత్పురుషకల్పంలో | స్కందుడు భూమికి బోధించాడు |
| 14. వామన పురాణాన్ని | కూర్మ కల్పంలో | బ్రహ్మ పులస్త్య మహామునికి బోధించాడు |
| 15. కూర్మ పురాణాన్ని | లక్ష్మీ కల్పంలో | విష్ణువు పులస్త్య మహామునికి బోధించాడు |
| 16. మత్స్య పురాణాన్ని | సప్త కల్పంలో | విష్ణువు మనువుకు బోధించాడు |
| 17. గరుడ పురాణాన్ని | గరుడ కల్పంలో | విష్ణువు మనువుకు బోధించాడు |
| 18. బ్రహ్మాండ పురాణాన్ని | భవిష్య కల్పంలో | బ్రహ్మ మనువుకు బోధించాడు |

# పురాణాలు ఎందుకు చదవాలి?

**పురాణశ్రవణే శ్రద్ధా యస్య స్యాద్ర్బాతరస్వహమ్ ।**
**తస్య సాక్షాత్ప్రసన్నః స్యాత్ శివో విష్ణుశ్చ సానుగః ॥**

**యత్స్నాత్వా పుష్కరే తీర్థే యాగే సింధౌ చ సంగమే ।**
**తత్ఫలం ద్విగుణం తస్య శ్రద్ధయా వై శృణోతి యః ॥**

**యే పఠంతి పురాణాని శృణ్వన్తి చ సమాహితాః ।**
**ప్రత్యక్షరం లభంత్యేతే కపిలాదానజం ఫలమ్ ॥**

**అపుత్రో లభతే పుత్రం ధనార్థీ లభతే ధనమ్ ।**
**విద్యార్థీ లభతే విద్యాం మోక్షార్థీ మోక్షమాప్నుయాత్ ॥**

**యే శృణ్వన్తి పురాణాని కోటిజన్మార్జితం ఖలు ।**
**పాపజాలంతు తే హిత్వా గచ్ఛన్తి హరిమందిరమ్ ॥**

పురాణాలు వినడంలో ఎవరికైతే శ్రద్ధ ఉంటుందో మరియు నిత్యము ఎవరైతే శ్రవణం చేస్తారో, అటువంటి వారి విషయంలో శివ-కేశవులు మరియు వారి గణాలు సంపూర్ణానుగ్రహం ప్రదర్శిస్తారు. పుష్కర తీర్థాల్లో, ప్రయాగ మొదలైన నదీసంగమ క్షేత్రాల్లో స్నానాలాచరిస్తే ఏవిధమైన పుణ్యం పొందగలరో దాని రెట్టింపు పుణ్యం పురాణ శ్రోతలకు లభిస్తుంది. భక్తి శ్రద్ధలతో పురాణ పఠన-శ్రవణాలు చేసేవారు కపిలగోవును దానం చేస్తే కలిగే పుణ్యరాశిని పొందగలరు. పుత్రులు లేనివారు పుత్రులను, దరిద్రులు ధనాన్ని, విద్యార్థులు విద్యను, మోక్షగాములు మోక్షాన్ని పొందగలరు. పురాణ శ్రోతలు తమ కోటి జన్మల పాపాలను దూరం చేసికొని చివర్లో శ్రీమన్నారాయణమూర్తి సాయుజ్యం పొందగలరు.

# పురాణ వైభవం

**అష్టాదశ పురాణానాం నామధేయాని యః పఠేత్ ।**
**త్రి సంధ్యాం జపతే నిత్యం సోఽశ్వమేధ ఫలం లభేత్ ॥**

ఈ అష్టాదశ మహాపురాణాల పేర్లను ఉదయ-మధ్యాహ్న-సాయంకాల సమయాల్లో ఎవరైతే పఠిస్తారో వారు అశ్వమేధ ఫలాన్ని పొందగలరని భావం.

# శ్రీ మార్కండేయ పురాణం

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్ ।
ప్రసన్నవదనం ధ్యాయేత్సర్వ విఘ్నోపశాంతయే ॥

నారాయణం నమస్కృత్య నరంచైవ నరోత్తమమ్ ।
దేవీం సరస్వతీం వ్యాసం తతో జయముదీరయేత్ ॥

**అ**ష్టాదశ మహాపురాణాలలో శ్రీ మార్కండేయ పురాణం ఏడవది. మార్కండేయ మహర్షి చేత చెప్పబడింది. కాబట్టి దీనికి మార్కండేయ పురాణం అనే పేరు వచ్చింది. “మార్కండేయం దక్షిణోంఽఘ్రిః” శ్రీ మహావిష్ణువుకి కుడిపాదంగా మార్కండేయ పురాణం చెప్పబడింది. ఈ పురాణంలో మొత్తం 136 అధ్యాయాలున్నాయి. వీటిలో శ్లోకాలు తొమ్మిదివేలు పూర్వం వుండేవి. ప్రస్తుతం లభిస్తున్న ప్రతిలో ఆరువేల తొమ్మిదివందల శ్లోకాలు మాత్రమే కనిపిస్తున్నాయి.

మార్కండేయ పురాణంలోని ముఖ్యాంశాలు. ఈ పురాణంలో

**1 నుంచి 10 అధ్యాయాలలో** వరుసగా–వప్రశాపకథనం, చటకోత్పత్తి, చతుర్వ్యూహ అవతారాలు, ద్రౌపతీపంచభర్తృకా నిరూపణం, బలరామకృత, బ్రహ్మహత్యా ప్రాయశ్చిత్తం, ఉపపాండవుల జననమరణ కారణం, హరిశ్చంద్రోపాఖ్యానం, ఆడి బకయుద్ధం, మృత్యుదశావిశేషాలు వర్ణించబడ్డాయి.

**11 నుంచి 40 అధ్యాయాలలో** –జీవుడి గర్భస్థితి, వివిధరకాల నరకాలు, తండ్రీ కొడుకుల సంవాదం, కర్మభుక్తి కథనం, కర్మవిపాకం, దత్తాత్రేయ మాహాత్మ్యం, మదాలసోపాఖ్యానం, కువలయాశ్వచరితం, ప్రవృత్తి మార్గం, గృహస్థాశ్రమ ధర్మం, శ్రాద్ధకల్పం, సదాచారం, ధర్మం, ఆత్మవివేకం, దత్తాత్రేయ అలర్క సంవాదం, యోగవిశేషాలు, యోగిచర్య, అలర్కుడి నిర్వేదం వంటి విషయాలు వర్ణించబడ్డాయి.

**40 నుంచి 70 అధ్యాయాలలో** – జడోపాఖ్యానం, బ్రహ్మోత్పత్తి, బ్రహ్మ ఆయుఃప్రమాణం, ప్రాకృతవైకృత స్వర్గాలు, సృష్టి ప్రకరణం, యక్ష్మాను శాసనం, రుద్రసర్గం, స్వాయంభువ మన్వంతర కథనం, జంబూద్వీప వర్ణనం, గంగావతార వర్ణనం, నదుల వర్ణన, ఉత్తర కురుదేశ వర్ణన, స్వారోచిష మన్వంతరం, నిధివర్ణనం, ఔత్తర మన్వంతరం వంటి విషయాలు వర్ణించబడ్డాయి.

**70 నుంచి 90 అధ్యాయాలలో** తామసమన్వంతర వృత్తాంతం, రైవత మన్వంతర విశేషాలు, ఆరోమన్వంతరం, వైవస్వత మన్వంతరం, దేవీసప్తశతి, మధుకైటభ సంహారం, మహిషాసురవధ, శుంభ నిశుంభాసురుల సంహారం, దేవీస్తుతి, దేవతలకి దేవీవరప్రదానం, సురథవైశ్యులకి వరప్రదానం వంటి విశేషాలు చెప్పబడ్డాయి.

**90 నుంచి 120 అధ్యాయాలలో** దక్ష మన్వంతరం, బ్రహ్మ మన్వంతరం, రుద్రమన్వంతరం, కాచ్యమన్వంతరం, రౌచ్య మన్వంతరం, భౌత్య మన్వంతరం, మార్తాండ మాహాత్మ్యం, ఆదిత్యస్తోత్రం, సూర్యస్తవం, వంశానుక్రమం, వృషధ్రదోపాఖ్యానం, నాభాగోపాఖ్యానం, నాభాగ చరిత్ర, భలందన వత్సప్రీతి చరిత్ర, ఖనిత్రచరిత్ర, వివింశచరిత్ర, ఖనీనేత్రచరిత్ర, కరంధమచరిత్ర, అవీక్షిత చరిత్ర వంటి విశేషాలు వర్ణించబడ్డాయి.

**120 నుంచి 136 అధ్యాయాలలో** మరుత్తచరిత్ర, నరిష్యంత చరిత్ర, దమచరిత్ర, వప్రప్మానుడి చరిత్ర తదితర విశేషాలు వివరించబడ్డాయి.

ఈ గ్రంథంలో మార్కండేయ మహాపురాణంలో చెప్పిన ముఖ్యవిశేషాల్ని సంగ్రహంగా మీకు అందిస్తున్నాం.

## జైమిని మహర్షి సందేహాలు

**పూ**ర్వం వ్యాసమహర్షి శిష్యుడైన జైమినిమహర్షికి మహాభారత కథనంలో కొన్ని సందేహాలు కలిగాయి. వాటిని గురించి తెలుసుకుని తన సందేహాల్ని నివృత్తి చేసుకోవటం కోసం ఆయన మార్కండేయ మహర్షి దగ్గరకి వెళ్ళాడు. ఆయనకి నమస్కరించి –

మహానుభావా! మార్కండేయా. మా గురుదేవులు మహాభారత గ్రంథాన్ని ఎన్నో ఆధ్యాత్మిక ధర్మవిశేషాలతో, ఎన్నో శాస్త్ర రహస్యాలతో ఉత్తమోత్తమ గ్రంథంగా రచించారు. దేవతల్లో మహావిష్ణువు, జాతుల్లో బ్రాహ్మణుడు, అన్ని ఆభరణాలలో చూడామణి ఏవిధంగా గొప్పవో అదేవిధంగా అన్ని శాస్త్రాలలో మహాభారతం ఎంతో గొప్పశాస్త్రంగా ప్రసిద్ధి చెందింది.

ఈ మహాభారతంలో ధర్మార్ధకామ మోక్షాలు సోదాహరణంగా వివరించబడ్డాయి. వేదవ్యాసుల వారు నాలుగు ఆశ్రమాలకి సంబంధించిన ఆచారాలు, వాటి స్థితిగతులు, తదితర విశేషాలు సంపూర్ణంగా మహాభారతంలో వివరించారు. పంచమవేదంగా ప్రసిద్ధి పొందిన ఈ మహాభారతం అనే సరోవరం మధురమైన శబ్దాలు అనే హంసలతో, మహా ఆఖ్యానాలు అనే కమలాలతో నిండి, అందమైన విస్తారమైన కథలు అనే శుద్ధ జలాలతో పరిపూర్ణంగా ఉంది.

వేదార్థాలని విపులీకరించి చెప్పేది, ఎన్నో రహస్యమైన అర్థాలతో నిండినది అయిన ఈ మహాభారతంలో రహస్యంగా వున్న కొన్ని విషయాల గురించి నాకు కొన్ని సందేహాలున్నాయి స్వామీ! వాటిని నివృత్తి చేసుకోవాలని తమ దగ్గరకి వచ్చాను. అవి –

1. సృష్టి, స్థితి, లయాలని చేసే ఆదిపురుషుడు శ్రీ మహావిష్ణువు నిర్గుణ పరబ్రహ్మంలా వున్నాడు కదా! ఆయన ఎందుకు సగుణుడుగా మానవరూపాల్ని ధరించాడు?

2. ద్రుపదరాజు పుత్రిక అయిన ద్రౌపతీదేవి పాండురాజు కుమారులైన పాండవులందరికీ ఒకే భార్యగా ఎందుకు అయ్యింది?

3. హలాయుధుడు శ్రీకృష్ణుడి సోదరుడు బలరాముడు తన తీర్థయాత్రలో భాగంగా ఎందుకు బ్రహ్మహత్యా ప్రాయశ్చిత్తాన్ని ఆచరించాడు?

4. ఉపపాండవులు అవివాహితులుగా, అనాథలుగా ఎందుకు చంపబడ్డారు?

ఈ విషయాల గురించి దయచేసి నాకు యదార్థాన్ని బోధించి నా సందేహాలని నివృత్తి చేయండి అని ప్రార్థించాడు.

జైమిని మహర్షి సందేహాలని విన్న మార్కండేయమహర్షి ఆయనతో "జైమినీ! నీ సందేహాలకి తగిన సమాధానాలు వింధ్యపర్వత గుహల్లో నివసిస్తున్న పక్షులు చెబుతాయి. అవి మామూలు పక్షులు కావు. ద్రోణమహర్షి కుమారులు శాపవశాన పక్షులుగా మారి ఆ ప్రాంతంలో నివసిస్తున్నాయి. అవి ధర్మపక్షులు. మానవుల్లా మాట్లాడగలవు. వాటికి అన్ని విషయాలు తెలుసు. కనుక నీవక్కడికి వెళ్ళి నీ సందేహ నివృత్తి చేసుకో" అని చెప్పి పంపాడు.

మార్కండేయుడి మాట ప్రకారం జైమిని మహర్షి వింధ్యపర్వత గుహల దగ్గరకి వచ్చి అక్కడున్న ధర్మపక్షుతో తనకున్న సందేహాలని తెలియచేసాడు. జైమిని మహర్షి సందేహాలకి సమాధానాలని ఆ ధర్మపక్షులు ఇలా చెప్పటం ప్రారంభించాయి.

**మొదటి ప్రశ్నకి సమాధానం :** శాశ్వతుడు, జనార్ధనుడు, అప్రమేయుడు అయిన వాసుదేవ పరబ్రహ్మకి 1.వాసుదేవుడు 2.సంకర్షణుడు 3.ప్రద్యుమ్నుడు 4.అనిరుద్ధుడు అనే నాలుగు రూపాలతో చతుర్వ్యూహాలు వున్నాయి. సగుణ నిర్గుణ స్వరూపుడు, అవ్యయుడు అయిన వాసుదేవుడికి నమస్కరిస్తున్నాం. అణువు కన్నా అణువుగా, మహత్తు కన్నా గొప్పమహత్తుగా, ఈ విశాల విశ్వమంతా వ్యాపించినవాడు, జన్మరహితుడు, ఈ జగత్తుకి ఆది అయిన పరమాత్మకి నమస్కరిస్తున్నాం. సృష్టి, స్థితి, లయకర్త అయిన ఆ పరమేశ్వరుడికి ఆ పరబ్రహ్మకి ధ్యానపూర్వకంగా నమస్కరిస్తున్నాం. దేవాది దేవుడైన ఆ మహాదేవుడి దివ్యచరణాలకి ప్రణమిల్లి చెబుతున్నాం.

జైమిని మహర్షీ! 'నారం' అంటే నీరు 'ఆయనం' అంటే నివాసం. అనగా నీటిలో నివసించేవాడు (నారాయణుడు) అని భగవంతుడి గురించి చెబుతారు. దేవాది దేవుడైన ఆ నారాయణుడు సగుణ నిర్గుణ అనే రెండు రూపాలతో నాలుగుమూర్తులుగా విలసిల్లుతున్నాడు. వీటిలో 'నిర్గుణ'మూర్తి ఎలాంటి ఆకారం లేనిది. మాటల్లో చెప్పలేనిది. అది కేవలం శుక్ల (తెల్లని) వర్ణంతో భాసించేది. ఆ నిర్గుణమూర్తిని కేవలం యోగులు మాత్రమే దర్శించగలరు.

ఇక నాలుగుమూర్తులలో మొదటిది వాసుదేవమూర్తి. ఇది త్రిగుణాతీతమైనది. ఈ వాసుదేవమూర్తిలో మమత్వం అనేది అసలే వుండదు. ఆ వాసుదేవమూర్తిలో రూపవర్ణాది భావాలన్నీ కేవలం కల్పనామయంగానే వుంటాయి. ఆ దివ్యమూర్తి సర్వకాలాల్లో సుప్రతిష్ఠితమై వుంటుంది. పరమ పవిత్రమైనది. ఒకే రూపంగా ప్రకాశిస్తూ వుంటుంది.

రెండోరూపం సంకర్షణమూర్తి. ఈ మూర్తి పాతాళలోకంలో వుంటుంది. ఇది సంకర్షణుడనే పేరుతో మహా సర్పరూపాన్ని ధరించి భూమిని మోస్తోంది. ఈ మూర్తిని తామసమూర్తి అంటారు. మూడోరూపం ప్రద్యుమ్నమూర్తి. ఈ రూపం ద్వారా భగవంతుడైన నారాయణుడు ధర్మస్థాపన చేస్తుంటాడు. సకల పాలనా కార్యక్రమాలు, అన్ని రకాల కర్మలు ఈయన వల్ల సక్రమంగా జరుగుతుంటాయి. నాలుగోరూపం అనిరుద్ధమూర్తి. ఈ రూపంలో స్వామి శేషశయ్య మీద శయనిస్తూ దర్శనమిస్తాడు. ఈయనది రజోమూర్తి. ఎప్పుడూ సృష్టి కార్యక్రమాన్ని నిర్వహిస్తూ వుంటాడు. ఇవి నారాయణుడి నాలుగుమూర్తుల విశేషాలు.

నారాయణుడి మూడోమూర్తి అయిన ప్రద్యుమ్నమూర్తి నియతంగా ధర్మపాలన, ప్రజాపాలన చేస్తుంటాడు. దుష్టశిక్షణ, శిష్టరక్షణ చేస్తూ నిరంతరం ధర్మపరుల్ని కాపాడుతుంటాడు. ఎప్పుడు ధర్మానికి హాని కలిగితే అప్పుడు ఆయన వివిధ అవతారాలు ధరిస్తుంటాడు. ఈ ప్రద్యుమ్నమూర్తే! పూర్వం వరాహరూపాన్ని ధరించి సముద్రంలో మునిగిపోయిన భూమిని తన కోరల మీద పైకిలేపి ఉద్ధరించాడు. ఈయనే నరసింహావతారాన్ని ధరించి హిరణ్యకశిపుణ్ణి సంహరించాడు. అలాగే ఎన్నో అవతారాలు ధరించి లోకాలకి ఎంతో మేలు చేసాడు. ఆ ప్రద్యుమ్నమూర్తి ప్రస్తుతం శ్రీకృష్ణావతారాన్ని ధరించి వున్నాడు.

జైమినిమహర్షీ! ఈవిధంగా సత్త్వగుణాత్మకుడైన నారాయణుడి అవతారాలు ఆయాకాలాల్లో అవతరిస్తుంటాయి. నారాయణుడి ప్రద్యుమ్నమూర్తి

దేవతల్లో తిర్యక్కులలో అవతరిస్తూ వాసుదేవుడి ఆజ్ఞానుసారంగా ప్రవర్తిస్తూ వుంటాడు.

## ద్రౌపతి అయిదుగురికి భార్య అయిన కారణం

**ఓ** జైమినిమహర్షీ! నీ రెండవ సందేహానికి సమాధానం చెబుతున్నాం విను – పూర్వం త్వష్టప్రజాపతి కుమారుడైన త్రిశిరుడనేవాడు శీర్షాసనం వేసి ఎంతో ఘోరంగా తపస్సు చేయసాగాడు. అతడు చేసే తపస్సు తన ఇంద్ర పదవి కోసమేనని భావించిన ఇంద్రుడు భయంతో అతన్ని సంహరించాడు. బ్రహ్మహత్యా పాపం చుట్టుకోవటంతో ఇంద్రుడిలో తేజస్సు హరించుకుపోయింది. అతడిలో వున్న తేజస్సు ధర్మదేవతలో ప్రవేశించింది. త్వష్ట ప్రజాపతికి తన కుమారుడు ఇంద్రుడి చేత చంపబడ్డాడన్న వార్త తెలిసింది. వెంటనే ఎంతో కోపంతో తన తలమీదున్న ఒక జటని పీకి, అగ్నిహోత్రంలో వేసాడు. తక్షణమే ఆ అగ్నిగుండం నుంచి జ్వాలలు మాలలుగా ధరించిన మహాభీకర శరీరంతో వృత్రుడు అనే అసురుడు ఆవిర్భవించాడు. అప్రమేయుడు, మహాపరాక్రమ వంతుడైన ఆ ఇంద్ర శత్రువు వృత్రాసురుడు, త్వష్ట ప్రజాపతి అనుగ్రహంతో ప్రతిరోజూ ఇషుపాతం (ఒక బాణం ప్రయోగిస్తే అది ఎంతదూరం పోతుందో అంతదూరం) అంత ఎత్తు పెరుగుతున్నాడు.

తనని చంపటానికి వృత్రాసురుడు జన్మించాడని తెలుసుకున్న ఇంద్రుడు అతడి దగ్గరకి తన దూతల్ని పంపి సంధి చేసుకున్నాడు. కొంతకాలం తరువాత ఎప్పటికైనా వృత్రుడి వల్ల తనకి ఆపద తప్పదని గ్రహించిన ఇంద్రుడు ఇచ్చిన మాటని విడిచిపెట్టి వృత్రాసురుణ్ణి మోసంతో వచించి వధించాడు. ఆ వృత్రుడు కూడా త్వష్ట ప్రజాపతి వల్ల జన్మించినవాడే కాబట్టి తిరిగి బ్రహ్మ హత్యాపాపం ఇంద్రుడికి చుట్టుకుంది. దాంతో ఇంద్రుడి శక్తి మరింత క్షీణించి అతడిలో వున్న తేజస్సు తొలగిపోయి వాయువులో ప్రవేశించింది.

తరువాత ఇంద్రుడు గౌతమ ముని భార్య అయిన అహల్యని రహస్యంగా మారువేషంలో వంచించి అనుభవించటంతో మరికొంత అతడి తేజస్సు,

బలం క్షీణించాయి. దురాత్ముడైన ఇంద్రుడి శరీరంలోని లావణ్యం, తేజస్సు, అతన్ని వదిలి అశ్వినీకుమారుల శరీరంలో ప్రవేశించాయి. ఇలా ఇంద్రుడిలో వున్న ధర్మదేవత దివ్యతేజస్సు అతడి నుంచి విడిపోయిందన్న విషయం దానవులకి తెలిసింది. వెంటనే వారంతా ఇంద్రుణ్ణి జయించాలని నిర్ణయించుకన్నారు.

ఓ జైమినీ! ఎంతో బలవంతులైన అసురులు కొంతకాలం తరువాత భూలోకంలో మదోద్ధతులైన రాజులుగా జన్మించారు. వారి బాధలు తట్టుకోలేక భూదేవి ఒకనాడు దేవతల సభలోకి వెళ్ళి "దేవతలారా! పూర్వం మీరు ఏఏ రాక్షసుల్ని సంహరించారో వారంతా మానవలోకంలో వివిధ రాజవంశాలలో రాజులుగా జన్మించి ఎన్నో అక్షౌహిణీల సంఖ్యలో వున్నారు. వారి భారాన్ని నేను మోయలేకపోతున్నాను. నాకు శాంతి కలిగించండి" అని వేడుకుంది.

భూదేవి బాధలు విని ఆమె భారం తొలగిద్దామనుకుని నిర్ణయించుకున్న దేవతలు తమ తేజోభాగాలతో స్వర్గం నుంచి భూలోకంలోకి అవతరించారు. అప్పుడు ధర్మదేవత తనలోని ఇంద్ర తేజస్సుని కుంతీదేవి గర్భంలో వుంచాడు. ఆ ప్రభావంతో ఆమెకి ధర్మరాజు జన్మించాడు. తరువాత వాయుదేవుడు తనలో వున్న ఇంద్ర తేజస్సుని కుంతీగర్భంలో వుంచగా దాని నుంచి మహా బలవంతుడైన భీముడు ఉద్భవించాడు. ఇంద్రుడి అర్ధతేజస్సు కుంతీగర్భంలో ప్రవేశించగా అర్జునుడు పుట్టాడు. తరువాత దేవేంద్రుడి లావణ్యాన్ని తేజస్సుని పొందిన అశ్వినీకుమారులు వాటిని కుంతీగర్భంలో ప్రవేశపెట్టటంతో నకుల–సహదేవులు జన్మించారు. ఈవిధంగా ఇంద్రుడు తన అయిదు అంశలతో భూలోకంలో పంచపాండవులుగా అవతరించాడు.

ఇంద్రుడి భార్య శచీదేవి ద్రౌపతి అనేపేరుతో హోమగుండం నుంచి ఆవిర్భవించింది. ద్రుపదరాజు కుమార్తె అయిన ద్రౌపతి శచీదేవి అంశే. అందుకే ఆమె తన భర్తలుగా పంచపాండవులని స్వీకరించింది. ఇది నీ రెండో సందేహానికి సమాధానం.

# బలరాముడు చేసిన బ్రహ్మహత్యా ప్రాయశ్చిత్తం

**ఓ** జైమినిమహర్షీ! మీరడిగిన మూడో ప్రశ్నకి సమాధానం చెబుతున్నాం వినండి – మహాభారత యుద్ధం అనివార్యమయ్యింది. త్వరలో యుద్ధం జరగబోతోంది. బలరాముడు దుర్యోధనుడికి గురువు. శిష్యుడి మీద ఆయనకి చాలా ప్రీతి. అలాగే శ్రీకృష్ణుడికి అర్జునుడంటే ఎంతో ఇష్టం. ఆయన పాండవ పక్షపాతి. ఆ సమయంలో బలరాముడు ఇలా ఆలోచించాడు "నేను నా శిష్యుడి పక్షం వెళితే స్వయంగా నా తమ్ముడితో పోరాడాల్సి వస్తుంది. అలాగని పాండవ పక్షంలో వుంటే స్వయంగా నా శిష్యుడైన దుర్యోధనుణ్ణి ఎదుర్కోవాల్సి వస్తుంది. ఇప్పుడేం చేయాలి? ఆ! నేను ఎవరి పక్షం వహించకుండా యుద్ధం పరిసమాప్త మయ్యేంత వరకూ తీర్థయాత్రలకి వెళితే మంచిది" అని భావించి ఆ విషయాన్ని కృష్ణుడికి, దుర్యోధనుడికీ చెప్పి కొంత పరివారాన్ని తీసుకుని తీర్థయాత్రలకి బయలుదేరాడు.

దారిలో బలరాముడు ఒకచోట ఆనందంగా మద్యాన్ని సేవించాడు. ఆ మత్తులో తన భార్య రేవతీదేవిని తీసుకుని అందమైన వృక్షాలతో లతలతో శోభిస్తున్న రైవత వనంలో విహరించటానికి వెళ్ళాడు. ఆ వనం చక్కని ఫలవంతమైన వృక్షాలతో, వికసించిన పూలపరిమళాలతో నయనానందకరంగా వుంది. కలకల కూజితాలు చేస్తున్న పక్షుల ధ్వనుల్ని వింటూ ఆ వనంలో మామిడి, కొబ్బరి, మోచ, అరటి, కదంబ, దానిమ్మ, అత్తి, అశ్వర్థ, ఆమ్లకి, ప్రబ్బలి, కడిమి, మోదుగ, దానిమ్మ, నిమ్మ, తిందుక, మహాఫల, కరక, తాడి, తమాల, అశోక వంటి వృక్షాలు, పొగడ, మొగలి, మల్లె, జాజి, సంపెంగ, మాలతి, పారిజాతం వంటి పూలచెట్లు, చకోర, శాతపత్ర, భృంగరాజు, శుక, పిక, కోకిల, కలవింక, హారీత, వంటి పక్షుల్ని దర్శించారు. అలా అన్నిటినీ చూస్తూ ఆనందిస్తూ తన భార్య ప్రియురాళ్ళతో కలిసి ఆ వనం లోపలకి ప్రవేశించాడు  బలరాముడు.

వనం లోపలికి వెళ్ళగానే వేదవేదాంగ పారంగతులైన కౌశిక, భార్గవ, భారద్వాజ, గౌతమ వంశాలలో పుట్టిన మహామునులు ఆయనకి కనిపించారు.

వారంతా కథల్ని వింటూ ఎంతో కుతూహలంగా కూర్చొని వున్నారు. కొందరు లేడిచర్మం ఆసనాల మీద, మరికొందరు దర్భాసనాల మీద ఆసీనులై వుండగా వారందరికీ మధ్యలో దర్భాసనం మీద కూర్చుని సూతమహర్షి పురాణకథల్ని ప్రవచిస్తుండగా వారంతా ఎంతో ఆసక్తిగా వింటున్నారు.

వారిలో శౌనకాది మునులు కొందరు మద్యం సేవించి తమ దగ్గరకి వచ్చిన బలరాముణ్ణి చూసి అందరూ తమ ఆసనాల నుంచి లేచి ఆయనకి స్వాగతం పలికి, అర్ఘ్య పాద్యాలతో పూజించారు. అయితే సూతమహర్షి మాత్రం లేవలేదు. అది గ్రహించిన బలరాముడికి ఆగ్రహం కట్టలు తెంచుకుంది. సూతుడు తనని అవమానించాడని భావించి మద్యం మత్తులో యుక్తాయుక్తాలు మరిచి ఆయన్ని సంహరించాడు. ఒక్కసారిగా తమ గురువుని సంహరించటం చూసి భయంతో అక్కడున్న మునులంతా ఆ వనం విడిచి వెళ్ళిపోయారు. బ్రహ్మవేత్తని చంపటంతో బలరాముడికి బ్రహ్మహత్యా పాపం చుట్టుకుంది. ఆ పాపదేవత తన శరీరంలోకి ప్రవేశించటం బలరాముడు గ్రహించాడు. ఆ పాప ఫలితంగా ఆయన శరీరం నుంచి దుర్వాసన బయలుదేరింది. తనలో తాను "అయ్యో! నా ఈ దుస్థితికి కారణం ఈ మద్యపానం. ఓ దుష్ట మద్య, దురభిమాన, సాహస, అమర్ష దేవతలారా! ఈ రోజు నుంచి మిమ్మల్ని వదిలేస్తున్నాను. అయ్యో! నేనెంత పాపం చేసాను. ఈ పాప ప్రక్షాళన కోసం పన్నెండు సంవత్సరాలు వ్రతం చేస్తాను. నేను చేసిన ఈ మహాపాపాన్ని అందరికీ చెప్పి ప్రాయశ్చిత్తం చేసుకుంటాను. ఇప్పుడే ఇక్కడి నుంచి ప్రతిలోమ అయిన సరస్వతీ నదీ తీర్థానికి వెళతాను" అని నిశ్చయించుకుని సరస్వతీ తీర్థంలో స్నానం ఆచరించటానికి వెళ్ళాడు. ఓ మహర్షీ! ఆనాడు బలరాముడు బ్రాహ్మణుడైన సూతమహర్షిని సంహరించి బ్రహ్మహత్య చేసిన కారణంగా ప్రాయశ్చిత్తం చేసుకున్నాడు.

## ఉపపాండవుల జనన మరణాలు

**జై**మిని మహర్షీ! నీవడిగిన నాలుగో సందేహానికి సమాధానం చెబుతున్నాం విను – పూర్వం త్రేతాయుగంలో హరిశ్చంద్రుడనే రాజుండేవాడు.

ఆయన ఎంతో ధర్మబద్ధంగా భూమిని పరిపాలిస్తూ ఉత్తమరాజుగా కీర్తి పొందాడు. ఆయన పాలనాకాలంలో ప్రజలకి దుర్భిక్షం, వ్యాధులు, అకాలమరణాలు వంటి అనర్థాలు ఏవీ కలగలేదు. ఒకనాడు ఆ మహారాజు వేట కోసం అడవికి వెళ్ళాడు. అక్కడాయనకి రక్షించండి – రక్షించండి అన్న స్త్రీల అరుపులు వినిపించాయి.

ఆ అరుపులు విన్న హరిశ్చంద్రుడు భయపడకండి నేను వస్తున్నాను అని అంటూ ఆ ఆర్తనాదాలు వినిపించిన వైపు వెళ్ళాడు. ఆ సమయంలో విఘ్నేశ్వరుడు ఇలా అనుకున్నాడు. "ఈ వనంలో మహాతేజస్వి, మునిశ్రేష్ఠుడైన విశ్వామిత్ర మహర్షి కఠోరదీక్షతో తపస్సు చేస్తున్నాడు. భవాది దివ్యవిద్యల గురించి ఆయన సాధన చేస్తుండగా, ఆ విద్యాదేవతలు స్త్రీమూర్తులుగా భయంతో ఏడుస్తున్నారు. ఎందుకంటే విశ్వామిత్ర మహర్షి ఎంతో తేజస్సు కలవాడు. తామేమో బలహీనమైన విద్యలం కనుక ఆయన అధీనంలోకి వెళితే ఆయన శక్తికి సరితూగలేమని భావించారా స్త్రీలు. ఇక ఇప్పుడు నేనేం చేయాలి. సరే! ఆ రాజెవరో అభయమిస్తూ ఇటు వస్తున్నాడు కదా ఆయన శరీరంలోకి ప్రవేశించి జరగబోయేది చూస్తాను" అని భావించి వెంటనే విఘ్నేశ్వరుడు హరిశ్చంద్రుడి శరీరంలోకి ప్రవేశించాడు.

విఘ్నేశ్వరుడు తన శరీరంలోకి ప్రవేశించగానే హరిశ్చంద్రుడికి అమితమైన రాజసం వచ్చింది. ఎంతో రౌద్రంగా "ఎవడు ఇక్కడి స్త్రీలకి వేదన కలిగిస్తున్నవాడు నా అమ్ములపొది లోంచి వచ్చిన బాణాలధాటికి అన్నిభాగాలు ఛేదించబడి శాశ్వత నిద్రపోగలడు" అని అన్నాడు. ఆ మాటలు వినగానే తపోభంగమైంది విశ్వామిత్ర మహర్షికి. వెంటనే ఆయనకి తీవ్రమైన ఆగ్రహం కలిగింది. దానితో ఆయన సాధించిన విద్యలన్నీ నశించిపోయాయి. హరిశ్చంద్రుడికి విశ్వామిత్రుణ్ణి చూడగానే భయంతో ఒళ్ళు కంపించింది.

విశ్వామిత్రుడు అతన్ని చూసి ఓరీ దురాత్మా! ఆగు! అని గట్టిగా గద్దించాడు. హరిశ్చంద్రుడు వినయంగా "స్వామీ! తమరు నాపై ఆగ్రహించకండి.

నా తప్పేమీ లేదు. ధర్మజ్ఞులైన రాజులు ధర్మశాస్త్రంలో చెప్పినట్టుగా దానం, రక్షణ, ధనుస్సు ధరించి యుద్ధం చేయటం వంటి కార్యాల్ని నిర్వర్తించాలి. నేను ఆర్తురాలి మాటలు విని ఇక్కడికి వచ్చాను" అని అన్నాడు.

హరిశ్చంద్రుడి మాటలు విన్న విశ్వామిత్రుడు రాజా! నీకు నిజంగా అధర్మం అంటే భయం వుంటే దానం ఎవరికి చేయాలి? రక్షణ ఎవరికి ఇవ్వాలి? యుద్ధం ఎవరితో చేయాలి? ఈ ప్రశ్నలకి జవాబులు చెప్పు" అని అడిగాడు.

ఓ మహర్షీ! బ్రాహ్మణుల్లో గొప్పవారికి, జీవనాధారం లేనివారికి దానం చేయాలి. భయంతో శరణు కోరినవారిని ఎప్పుడూ రక్షించాలి. శత్రువులతో యుద్ధం చేయాలి అని బదులిచ్చాడు హరిశ్చంద్రుడు. అదివిని "ఓ రాజా! నీవు నిజంగా ధర్మాచరణ చేసేవాడివే అయితే నేను బ్రాహ్మణుడిని నేను కోరినంత ధనాన్ని దక్షణగా నాకివ్వు" అని అడిగాడు.

విశ్వామిత్రా! మహానుభావా! తమరు నన్ను దక్షిణ అడిగారు చాలా సంతోషం. మీకు ఏదికావాలో అడగండి ఇవ్వటానికి నేను సిద్ధంగా వున్నానన్నాడు హరిశ్చంద్రుడు. రాజా! ప్రస్తుతం నేను రాజసూయ యజ్ఞం చేస్తున్నాను. దానికి తగిన దక్షిణ ఇవ్వు అని అడిగాడు. స్వామీ! మీ యాగానికి ఎంత దక్షణ కావాలో కోరుకోండి అన్నాడు హరిశ్చంద్రుడు. రాజా! ఈ సమస్త నగర, పట్టణ, గ్రామాలతో, సాగరంతో కూడిన భూమండలాన్ని, సకల సైన్య సమేతంగా వున్న రాజ్యాన్ని, దీనితో పాటు నీ కోశాగారాన్ని, సమస్త సంపదల్నీ. కేవలం నీవు, నీ భార్య, సుతులు తప్ప తక్కినవన్నీ దక్షిణగా ఇవ్వు అని కోరాడు. హరిశ్చంద్రుడు ఎంతో శాంతంగా "మహర్షీ! మీరు కోరినవన్నీ ఇస్తున్నాను స్వీకరించండి" అన్నాడు.

విశ్వామిత్రుడు వాటినన్నిటినీ గ్రహించి రాజా! నీ సర్వస్వం నాకు సమర్పించావు. ఇక నీ రాజ్యం నా రాజ్యం కాబట్టి నీవు నీ భార్యాపిల్లలతో నగరాన్ని విడిచివెళ్ళు అని ఆజ్ఞాపించాడు. సరేనని హరిశ్చంద్రుడు భార్యా,

సుతుణ్ణి తీసుకుని బయలుదేరాడు. అంతలో విశ్వామిత్రుడు ఆయన్ని ఆపి, రాజా! రాజసూయ యాగదక్షణకి నీవిచ్చినవి సరిపోవు పూర్తిగా ఇవ్వకుండా ఎక్కడికి పోతావు? అని ప్రశ్నించాడు. అందుకు హరిశ్చంద్రుడు మహర్షీ! ఇప్పుడు నాకు నేను, నా భార్య, నా కుమారుడు ఈ మూడు ప్రాణాలే వున్నాయి. ఉన్నదంతా నీకే ఇచ్చాను నా దగ్గరేమీ లేదు" అన్నాడు. రాజా! ఆడినమాట తప్పకు. నీవు ఎలాగైనా నా దక్షిణ నాకు చెల్లించి నీ ధర్మ నిరతిని నిరూపించుకో, లేదా నా శాపానికి గురౌతావు జాగ్రత్త అని హెచ్చరించాడు విశ్వామిత్రుడు. స్వామీ! నన్ను దయచూడండి. ఒక్క నెలరోజులు నాకు గడువివ్వండి. మీ దక్షిణ చెల్లిస్తాను అన్నాడు హరిశ్చంద్రుడు. సరే వెళ్ళు సరిగ్గా ఒక్కనెలలో నా దక్షిణ చెల్లించకపోతే నిన్ను వదిలిపెట్టను అని చెప్పి పంపించాడు విశ్వామిత్రుడు.

హరిశ్చంద్రుడు తన భార్యని, కుమారుణ్ణి వెంటబెట్టుకుని నగరం విడిచి బయలుదేరాడు. దారిలో నగర ప్రజలంతా ఆయన దుఃస్థితిని చూసి ఎంతో విలపించారు. ఆయన ధర్మనిరతికి సత్య వాక్పరిపాలనకి జేజేలు పలికారు. అందరూ ఆయనతో వస్తామన్నారు. ప్రజలకి తనపై వున్న అభిమానం చూసి హరిశ్చంద్రుడికి ఎంతో దుఃఖం కలిగింది. అంతలో విశ్వామిత్రుడు అక్కడికి వచ్చి ధూర్తుడా! ఇంకా ఇక్కడే వున్నావే వెళ్ళువెళ్ళు అని గద్దించగా, స్వామీ! వెళుతున్నాను ఆగ్రహించకండి అని బదులిచ్చి బయలుదేరాడు హరిశ్చంద్రుడు.

ఎంతో అలసిపోయి నడవలేని స్థితిలో వున్న భార్య శైబ్యాదేవిని తీసుకుని వేగంగా నడవసాగాడు హరిశ్చంద్రుడు. శైబ్యాదేవి ఆయనతో సమానంగా నడవలేకపోతోంది. అలా వాళ్ళు వేగంగా వెళ్తున్నప్పటికీ విశ్వామిత్రుడు వారిని తొందర చేస్తూ తన చేతిలోని కర్రతో శైబ్యాదేవి తలమీద కొట్టాడు. విశ్వామిత్రుడు అంత ఘోరమైన పనిచేసినప్పటికీ హరిశ్చంద్రుడు ఏమాత్రం ఆవేశపడకుండా "వెళ్తున్నా స్వామీ! ఆగ్రహించకండి" అని తప్ప మరేదీ మాట్లాడలేదు.

హరిశ్చంద్రుడు పొందిన ఈ దుఃస్థితిని చూసి విశ్వాదిదేవతలు అయిదుగురు ఎంతో బాధపడ్డారు. వారు విశ్వామిత్రుడి గురించి “ఈ కౌశికుడు ఎంత నిర్దయుడు. మహాఘోరమైన పాపం చేస్తున్నాడు. ఇతడెలాంటి నరకానికి పోతాడో కదా! మా అందరికీ నిత్యం యజ్ఞయాగాదులు చేసి హవిస్సులు సమర్పిస్తున్న ఈ హరిశ్చంద్ర మహారాజుని రాజ్యభ్రష్టుణ్ణి చేసిన ఈ విశ్వామిత్రుడు తప్పకుండా నరకానికి వెళతాడు” అని అనుకున్నారు.

విశ్వేదేవతల మాటలు విన్న విశ్వామిత్రుడికి వారిమీద తీవ్రమైన కోపం వచ్చింది. వెంటనే “విశ్వేదేవతలారా! నా గురించి నిందాపూర్వక వాక్యాలు పలికిన మీరు మానవజన్మల్ని పొందుదురు గాక!” అని శపించాడు. వెంటనే విశ్వేదేవతలు ఆయన కాళ్ళమీద పడ్డారు. స్వామీ! మా తప్పు మన్నించండి అని వేడుకోగా, విశ్వామిత్రుడు కరుణించి “మీరు మానవజన్మ పొందినప్పటికీ, మీరు బ్రహ్మచారులుగా వుంటారు. కామక్రోధాలు విడిచి తిరిగి దేవతలుగా మరతారు” అని శాపవిమోచనం అనుగ్రహించాడు.

ఓ జైమిని మహర్షీ! ఆవిధంగా విశ్వామిత్రుడి చేత శపించబడ్డ విశ్వేదేవతలు అయిదుగురు ద్రౌపతీ గర్భాన ఉపపాండవులుగా జన్మించారు. పూర్వం మహర్షి ఇచ్చిన శాపకారణంగా వారు అవివాహితులుగానే వున్నారు. మహాభారత యుద్ధంలో అందరూ ఒకేసారి చంపబడి తిరిగి దేవతలుగా మారిపోయారు. ఇది నీవడిగిన నాలుగో సందేహానికి సమాధానం అని ఆ ధర్మపక్షులు జైమిని మహర్షికి చెప్పాయి.

## ఆడిబక (బాతు-కొంగ) యుద్ధం

**ధ**ర్మపక్షులు జైమిని మహర్షితో! హరిశ్చంద్రుడి చరిత్ర గురించి చెప్పి ఆ తరువాత జరిగిన సంఘటనల్ని వివరిస్తూ ఇలా చెప్పారు “మహర్షీ! హరిశ్చంద్రుడి సత్యధర్మాచరణకి ఎంతో ఆనందించిన దేవతలు ఆయన్ని స్వర్గానికి రమ్మని ఆహ్వానించారు. అయితే ధర్మప్రభువైన హరిశ్చంద్రుడు తన అయోధ్యా నగరంలోని ప్రజలందరికీ స్వర్గప్రాప్తి కలిగిస్తే తాను వస్తానన్నాడు.

అందుకు అంగీకరించిన దేవేంద్రుడు కోట్లకొద్దీ విమానాల్ని రప్పించి హరిశ్చంద్రుడితో సహా అయోధ్యనగర వాసులందరినీ స్వర్గానికి చేర్చారు. హరిశ్చంద్రుడిలాంటి ధర్మప్రభువుని చూసి దైత్యగురువు శుక్రాచార్యుడు హరిశ్చంద్రుడులాంటి రాజు మరొకడు లేడు. ఇకపై పుట్టబోడు, తన త్యాగంతో దానంతో మహాపుణ్యాన్ని ఆర్జించి తనతో పాటు తన పౌరులందరినీ స్వర్గానికి తీసుకెళ్ళే రాజు ఎవడుంటాడు? అని కీర్తించాడు.

మహర్షీ! ఆవిధంగా హరిశ్చంద్రుడు స్వర్గానికి వెళ్ళిన తరువాత, హరిశ్చంద్రుడి కులగురువైన వశిష్ఠుడు ఎన్నో సంవత్సరాల నుంచీ కంఠం దాకా నీళ్ళలో వుండి చేస్తున్న తపస్సు చాలించి మహాతేజస్సుతో బైటికి వచ్చాడు. ఆయన పన్నెండు సంవత్సరాలు గంగానదిలో నిలబడి తపస్సు చేసాడు. అయోధ్యనగరానికి తిరిగి వచ్చిన వశిష్ఠమహర్షికి, విశ్వామిత్రుడు హరిశ్చంద్రుణ్ణి ఎన్ని రకాలుగా ఇబ్బంది పెట్టింది, ఎన్ని కష్టాలకి గురిచేసిందీ అన్న విషయాలన్నీ తెలిసాయి. మహాధర్మ ప్రభువైన హరిశ్చంద్రుణ్ణి ఘోరంగా కష్టాలపాలు చేసిన విశ్వామిత్రుడి మీద ఆయనకి తీవ్రమైన ఆగ్రహం కలిగింది.

“అయ్యో! ఈ విశ్వామిత్రుడు ఎంత దుర్మార్గుడు. పూర్వం నా వందమంది కుమారుల్ని చంపాడు. అప్పుడు కూడా నాకు అతడిపై కోపం రాలేదు. మహానుభావుడు, సత్యధర్మ పాలకుడు అయిన హరిశ్చంద్రుణ్ణి రాజ్యభ్రష్టుణ్ణి చేసినందుకే నాకు తీవ్రమైన కోపం కలుగుతుంది” అని మనసులో భావించిన వశిష్ఠుడు వెంటనే “దుర్మాత్ముడు, బ్రహ్మద్వేషి, మూర్ఖుడు, యజ్ఞనాశి అయిన విశ్వామిత్రుడు నేటినుంచి కొంగరూపాన్ని పొందుగాక!” అని శపించాడు. ఈ విషయం గ్రహించిన విశ్వామిత్రుడు కూడా అంతే ఆగ్రహంతో వశిష్ఠుణ్ణి “బాతు రూపాన్ని పొందుదువు గాక!” అని ప్రతిశాపం ఇచ్చాడు.

ఆవిధంగా మహా తపస్సంపన్నులైన విశ్వామిత్ర, వశిష్ఠులిద్దరూ కొంగ-బాతు జన్మలు ఎత్తారు. వారిద్దరూ ఆ రూపంలో పరస్పరం మహాఘోరంగా యుద్ధం చేయటం ప్రారంభించారు. వారిద్దరి యుద్ధం చూసి

ప్రజలందరూ భయభ్రాంతులయ్యారు. ఓ జైమినీ! బాతు పక్షి రెండువేల యోజనాల పొడవుతో వుంటే, కొంగ మూడువేల తొంభై ఆరుయోజనాల పొడవుతో వుంది. మహాభీకరాకారంతో వున్న ఆ పక్షులు రెండూ పోట్లాడుకుంటుంటే వాటి రెక్కల ధాటికి పెద్దపెద్ద పర్వతాలు భూమిపై పడిపోసాగాయి. భూమి కంపించిపోయింది. ఆ కంపనకి సముద్రాలు ఒక్కసారిగా ఉప్పొంగిపోయాయి. భూమి పాతాళం వైపుగా ఒరిగిపోయింది. ఆ భయానక సమయంలో మహాపర్వతాలు ఒరిగిపోతుంటే భూమిమీద వున్న సకలప్రాణులూ హాహాకారాలు చేస్తూ మరణించారు. ఈవిధంగా భూమండలమంతా అస్తవ్యస్తంగా మారిపోయి వినాశనమయ్యింది. ఈ విలయాన్ని గమనించిన బ్రహ్మదేవుడు హుటాహుటిన దేవతలందర్నీ తీసుకుని వారి దగ్గరకొచ్చాడు.

ఓ విశ్వామిత్ర, వశిష్ఠులారా! మీరిద్దరూ యుద్ధాన్ని చాలించండి. మీ యుద్ధం వల్ల సకల ప్రాణికోటీ ఎంతో నష్టమైపోయింది. ఇక ఆపండి అని ఆజ్ఞాపించాడు. అయినా వారిద్దరూ ఆయన మాటని ఏమాత్రం లెక్కచేయలేదు. తమ యుద్ధాన్ని మరింత తీవ్రంగా కొనసాగించారు. అది చూసిన బ్రహ్మదేవుడు లోక క్షేమం కోసం వారిద్దరిలో వున్న తామసగుణాన్ని హరించాడు. వెంటనే బాతు-కొంగ రూపంలో వున్న వశిష్ఠ విశ్వామిత్రులు తమ పూర్వరూపాన్ని పొందారు. అప్పుడు బ్రహ్మ వారితో “వశిష్ఠా! విశ్వామిత్రా! మీ ఇద్దరూ తామస భావంతో యుద్ధం చేస్తున్నారు. ముందు మీ కోపాన్ని తగ్గించుకోండి. ఓ వశిష్ఠా ఈ విశ్వామిత్ర మహర్షి ఎలాంటి తప్పు చేయలేదు. హరిశ్చంద్రుడి ధర్మనిరతిని లోకానికి తెలియచేసి ఆయనకి స్వర్గప్రాప్తి కలిగించాడు. అది తెలుసుకోకుండా నీవతన్ని శపించావు. ఈ విశ్వామిత్రుడూ క్రోధంతో నిన్ను శపించాడు. మీ ఇద్దరి వల్లా ఎంతో అనర్థం జరిగింది. ఇకపై మీరు పరస్పరం ద్వేషించుకోకుండా శాంతిని వహించండి” అని హితబోధ చేసాడు.

బ్రహ్మదేవుడి మాటలు విన్నాక వశిష్ఠ విశ్వామిత్రులిద్దరూ తాముచేసిన పనికి సిగ్గుపడ్డారు. తరువాత ఒకరినొకరు కౌగిలించుకుని పరస్పరం క్షమించమని కోరుకున్నారు. ఈ దృశ్యాన్ని చూసి ఎంతో సంతోషించిన బ్రహ్మ

వారిద్దరినీ ఆశీర్వదించి దేవతలతో కలిసి తన లోకానికి వెళ్ళిపోయాడు. అలాగే వశిష్ఠ విశ్వామిత్రులు కూడా తమతమ ఆశ్రమాలకి వెళ్ళిపోయారు.

మహర్షీ! ఎవరైతే హరిశ్చంద్రుడి కథని, ఈ ఆడి బక (బాతు–కొంగ) కథని చెబుతారో లేక వింటారో వారు చేసిన పాపాలన్నీ నశించిపోతాయి. వారుచేసే పనులన్నీ నిర్విఘ్నంగా నెరవేరుతాయి" ఈ విధంగా ధర్మపక్షులు ఆడి. బక యుద్ధ ఘట్టాన్ని జైమిని మహర్షికి వివరించి చెప్పాయి.

## మృత్యుదశ - పాపపుణ్య కర్మలు

**మ**హామతి అనే బ్రాహ్మణుడికి 'సుమతి' అనే అతడి కుమారుడు మృత్యుదశ ఏవిధంగా వుంటుందో వివరించి చెబుతున్నాడు – తండ్రీ! పూర్వజన్మల్లో అనిత్యమైన సంసార మాయలోపడి నేను ఎన్నోసార్లు ఎన్నో బాధలు పడ్డాను. అవన్నీ నాకు జ్ఞాపకమున్నాయి. అసలు మృత్యువు సమీపించినప్పుడు ఎలాంటి సంఘటనలు జరుగుతాయో ఎవరూ చెప్పలేరు. నేను చెప్పగలను.

తండ్రీ! జీవుడికి మరణకాలం సమీపించినప్పుడు శరీరంలోని పిత్తం బాగా వృద్ధి చెందుతుంది. అప్పుడు ఇంధనం లేకపోయినా తీవ్రంగా వాయువు సంచరించటంతో అది మండి లోపలున్న మర్మ స్థానాలన్నిటినీ భేదిస్తుంది. అలాగే కంఠంలో వుండే ఉదానవాయువు. పైభాగం నుంచి (నోటి) తిన్న ఆహారాన్ని, తాగిన నీటిని కిందికి పోకుండా నిరోధించి, మలమూత్రాలని బంధిస్తుంది. అప్పుడు ప్రాణం వియోగమవుతుంది.

జలదానం చేసినవారికి అన్నదానం చేసిన వారికి మరణ సమయంలో ఇలాంటి బాధ కలగకుండా అనాయాస మృత్యువు లభిస్తుంది. శ్రద్ధతో పవిత్రమైన మనసుతో అన్నదానం చేసినవాడు, తాను అప్పుడే అన్నం తిన్నవాడిలా సంతృప్తితో వుంటాడు. ఎవరైతే అసత్యం పలకడో, ఆస్తిక బుద్ధితో వుంటాడో, భగవంతుడి మీద శ్రద్ధాభక్తులు కలిగి వుంటాడో, దేవబ్రాహ్మణ పూజా నిరతుడై వుంటాడో, కామక్రోధ లోభమోహాలకి వశమై ధర్మాన్ని

త్యజించడో, సౌమ్యమైన గుణాన్ని కలిగి వుంటాడో అలాంటివాడు అనాయాస మరణాన్ని పొందుతాడు.

దాహం వేసేవారికి జలదానం చేయనివారు, ఆకలితో వున్నవాడికి అన్నదానం చేయనివారు, మృత్యు సమయంలో ఆకలిదప్పికలతో బాధలు పడతారు. శీతాకాలంలో కట్టెలు దానం చేసినవారికి చలి బాధించదు. జనులందరికీ భయాన్ని కలుగ చేసేవాడు మృత్యుసమయంలో ఎంతో భయాన్ని పొందుతాడు. అధర్మాన్ని, అజ్ఞానాన్ని ఉపదేశించినవారు మృత్యుసమయంలో మహాదుఃఖాన్ని పొందుతారు.

మానవుడు మరణకాలంలో యమదూతల్ని చూడటంతోనే భయంతో వణికిపోతాడు. తన తల్లిని, తండ్రిని, సోదరుల్ని, పిల్లల్ని, స్నేహితుల్ని నిర్విరామంగా పిలుస్తూ ఏడుస్తాడు. తండ్రీ! ఆ సమయంలో అతడికి మాటలు స్పష్టంగా రావు. జ్ఞాపకం వుండదు. కంటికి ముందు అంతా ఒకేరంగులో కనిపిస్తుంది. కళ్ళు తిరిగిపోతున్నట్టుంటాయి. భయంతో, ఆయాసంతో అతడి ముఖం ఎండిపోతుంది. తరువాత ఆ మానవుడికి ఎగశ్వాస ప్రారంభమవుతుంది. చూపు మందగిస్తుంది. క్రమంగా ఘోరమైన బాధతో ప్రాణం శరీరం నుంచి నిష్క్రమిస్తుంది.

ఈవిధంగా శరీరాన్ని విడిచిన జీవుడు వాయుదేవుడికి అగ్రసారిగా తానుచేసిన కర్మల్ని అనుసరించి నరకబాధల్ని అనుభవించటానికి తగిన శరీరాన్ని ధరిస్తాడు. ప్రమాణం, వయస్సు, అవస్థ, సంస్థానం అనేవి అతడికి కలుగుతాయి. తరువాత ఆ జీవుణ్ణి యమదూతలు కఠినమైన తాళ్ళతో బంధించి, దుడ్డుకర్రతో మోదుతూ దక్షిణదిక్కు వైపు తీసుకుపోతారు. పాపం చేసిన ఆ జీవుణ్ణి కుశ, కంటక, వల్మీక, శంకు, పాషాణాలతో నిండివున్న కఠినమైన ప్రదేశాల గుండా ఈడ్చుకుపోతూ మంటలతో నిండిన గుంటల్లో పడేస్తారు. దారిలో ఆ పాపాత్ముణ్ణి ఎన్నో నక్కలు పీక్కు తింటుంటాయి. అలా ఎంతో బాధలుపడుతూ జీవుడు నరకానికి చేరుకుంటాడు.

ఎవరైతే గొడుగుని, పాదరక్షల్ని వస్త్రం అన్నాన్ని, దానం చేస్తాడో వారు సుఖంగా యమలోకానికి చేరుకుంటారు. ఎవరైతే భూదానం చేస్తారో వారు దివ్యమైన విమానాలని ఎక్కి స్వర్గానికి వెళతారు. పాపకర్మలు చేసిన మానవుడు తాను చనిపోయిన పన్నెండు రోజుల వరకూ ఈ లోకంలోనే వుండి పన్నెండో రోజున యమలోకానికి తీసుకుపోబడతాడు.

మానవుడి శరీరాన్ని దహనం చేసిన వెంటనే ఆ జీవుడికి ఎంతో దాహం వేస్తుంది. అదే సమయంలో యమదూతల దెబ్బలకి మరింత వేదన కలుగుతుంది. జీవుడి బంధువులు తిల తర్పణాలు పిండదానం చేస్తే వాటిని యమదూతలు తీసుకువెళ్ళి ఆ జీవుడికి ఇస్తారు. అవి తిని ఆ నీటిని తాగి జీవుడు సంతృప్తి చెందుతాడు. ఆ పన్నెండురోజుల్లో మృతుడి బంధువులు నేలమీద పడుకుంటే ఆ జీవుడికి కష్టాలు తగ్గుతాయి. దానధర్మాలు చేస్తే జీవుడికి దుఃఖ నివారణ కలుగుతుంది. పన్నెండోరోజు పూర్తయిన తరువాత యమదూతలు అతన్ని అతి భయంకరమైన యమలోకానికి తీసుకుపోతారు. జీవుడక్కడికి వెళ్ళగానే మృత్యుదేవత, కాలదేవత, అంతక దేవత అనే సహచరులతో కూడి కాటుక కొండలా నల్లగా వున్న యమధర్మరాజుని దర్శిస్తాడు. విరూపులు, వక్రంగా వుండేవారు భీషణంగా కనిపించే వందలాది వ్యాధులతో వున్న కింకరులతో కూడిన యముడు జీవుణ్ణి చూస్తాడు. ఆ జీవుడు యమధర్మరాజు నిర్ణయించిన శిక్షల్ని అనుభవిస్తాడు.

తండ్రీ! ఎలాంటి పనులు చేసిన వారికి ఎలాంటి నరకశిక్షలు విధిస్తారంటే? అబద్ధం సాక్ష్యం చెప్పిన వారిని రౌరవాది నరకాల్లో పడేస్తారు. బ్రాహ్మణుడిని, ఆవుని, తండ్రిని చంపినవాడు రౌరవనరక బాధలు అనుభవిస్తాడు. ఇతరుల పొలాన్ని, భార్యని అపహరించినవాడు, పొలంగట్లని అక్రమంగా కలుపుకొనేవాడు, గురుపత్నితో సంగమించేవాడు, కన్యని బలవంతంగా అనుభవించేవాడు, రౌరవ నరకాన్ని చేరుకుంటాడు.

రౌరవ నరకం ఎలా వుంటుందంటే? అది రెండువేల యోజనాల పొడవు, అంతే వెడల్పుతో వుంటుంది. తొడలోతు ప్రమాణంతో కఠినమైన గుంటలతో

నిండి వుంటుంది. ఆ గుంటల్లో భయంకరమైన అగ్నిజ్వాలలు వెదజల్లే నిప్పు కణికలుంటాయి. యమదూతలు పాపాత్ముల్ని ఆ గుండాల్లో పడేసి కాలుస్తారు. పాపాత్ములు బాధ భరించలేక పరుగెడుతుంటారు. ఇలా పరుగెడుతుంటే వారి పాదాలు కాలి నశిస్తుంటాయి. రోజు మొత్తంలో ఒక్కసారి తన కాలుని మామూలు నేలమీద పెట్టుకోనిస్తారు.

ఈవిధంగా జీవుడు తాను చేసిన పాపాలని అనుసరించి వివిధ రకాల నరకబాధలు అనుభవించి తిరిగి తాను చేసిన కర్మానుసారంగా క్రిమి, కీటకాది జన్మల్ని పొందుతారు. తరువాత ఎద్దు, గుర్రం, ఏనుగు, మహావృక్షం లాంటి ఎన్నో రకాల జీవుల జన్మల్ని పొంది చిట్టచివరికి మానవజన్మ ఎత్తుతాడు. అయితే పాపం చేసిన వాడవటం వల్ల పొట్టివాడుగానో, నపుంసకుడుగానో, కుత్సితుడుగానో, చండాలుడుగానో జన్మిస్తాడు. తరువాత తానుచేసిన పుణ్యకర్మల్ని అనుసరించి క్రమంగా శూద్ర, వైశ్య, క్షత్రియ, బ్రాహ్మణ జన్మల్ని పొందుతాడు.

తండ్రీ! ఇక పుణ్యాలు చేసిన మానవుడు ఏఏ లోకాలు చేరతాడో విను – పుణ్యకర్మల్ని ఆచరించిన జీవుడు ధర్మదేవత నిర్ణయించిన పుణ్యలోకాలకి వెళతారు. పుణ్యాత్ములు ఆయా లోకాలకి వెళుతున్నప్పుడు, గంధర్వులు మధురంగా గానం చేస్తారు. అప్సరసలు నృత్యం చేస్తారు. వారు దివ్యమైన విమానాలలో పుణ్యలోకాలకి తీసుకుపోబడతారు. ఇలా ఆ పుణ్యాత్ములు స్వర్గలోకానికి చేరి సుఖాలు అనుభవించి తమ పుణ్యం క్షయమైపోయాక తిరిగి, రాజుల ఇళ్ళలో గానీ, ధనవంతుల ఇళ్ళలోగానీ, మహాత్ముల ఇళ్ళలోగానీ జన్మిస్తారు. తండ్రీ! ఈవిధంగా మృత్యువు దశలో మానవుడి స్థితి, పాపాత్ములు పుణ్యాత్ములు పొందే శిక్షలు, సుఖాలు వుంటాయి.

## దత్తాత్రేయ మాహాత్మ్యం

**పూ**ర్వం ప్రతిష్ఠానం అనే పట్టణంలో కౌశికుడనే బ్రాహ్మణుండేవాడు. ఆయనకి పూర్వజన్మలో చేసిన పాపం కారణంగా కుష్టువ్యాధి సంక్రమించింది.

ఆయన భార్య పతిని ఎంతో శ్రద్ధగా సేవిస్తుండేది. ఆయనకి స్నానం చేయించటం, అన్నం తినిపించటం, శ్లేష్మాన్ని, మలమూత్రాల్ని శుభ్రం చేయటం లాంటి పనులన్నీ ఎలాంటి విసుగు లేకుండా చేసేది. ఇలా ఎన్నిరకాలుగా సేవలు చేసినా, ఎంత సహనంతో వున్నా ఆ కౌశికుడు దుర్మార్గబుద్ధితో భార్యని మాటలతో, చేతలతో హింసించేవాడు. అయినా సరే ఆమె ఎలాంటి కోపాన్ని పెంచుకోకుండా సేవలు చేస్తూనే వుంది. పతినే దైవంగా భావించి అందరి కన్నా తన భర్తే ఉత్తముడని పూజించింది.

ఒకనాడు కౌశికుడు తన భార్యతో నేను ఇంట్లో నుంచి రాజమార్గంలో పోతున్న ఒక వేశ్యని చూసాను. ఆమె మీద నాకు మనసు కలిగింది. ఇప్పుడు రాత్రయ్యింది. వెంటనే నన్ను ఆమె దగ్గరకి తీసుకువెళ్ళు. ఆమె లేకపోతే నేను జీవించలేను అని ఆజ్ఞాపించాడు. ఆమెకి తన భర్త ఎంతో ఘోరమైన కోరిక కోరాడని తెలుసు. అయినా తమాయించుకుని భర్త కోరిక నెరవేర్చాలని భావించింది.

తన భర్తని భుజాలమీద ఎక్కించుకుని వేశ్యకి ఇవ్వాల్సిన ధనాన్ని తీసుకుని మెల్లగా రాజమార్గంలో వేశ్యా గృహం వైపు బయలుదేరింది. అంతలో ఒక్కసారిగా చీకట్లు కమ్మాయి. ఆకాశం మేఘావృతమైంది. వర్షం కురవటం మొదలయ్యింది. దారంతా చీకటిగా వుంది అయినా నెమ్మదిగా అలానే నడుచుకుంటూ వెళుతోంది కౌశికుడి భార్య. దారిలో ఒకచోట మాండవ్య మహాముని కర్మ ప్రారబ్ధంతో ఒక శూలానికి గుచ్చబడి వేలాడుతూ శిక్షని అనుభవిస్తున్నాడు. అదే దారిలో వస్తున్న కౌశికుడు తన పాదాలతో ఆ మునిని తాకాడు. దాంతో మాండవ్యుడు కదిలాడు అలా కదలగానే ఆ శూలం మరింతగా ఆయన్ని బాధించింది. కోపం తట్టుకోలేక తనకింత బాధ కలిగించినవాడు "సూర్యోదయం ఆయ్యేసరికి ప్రాణాలు విడుచుగాక" అని శపించాడు.

కౌశికుడి భార్య మాండవ్యముని ఇచ్చిన శాపాన్ని విన్నది. ఎంతో బాధపడింది. వెంటనే "నేనే గనుక మహాపతివ్రతగా వున్న దాన్నయితే

రేపు సూర్యుడు ఉదయించుకుండు గాక!" అని ఆజ్ఞాపించింది. ఆ మహాపతివ్రత శాపంతో సూర్యోదయం అవలేదు. అంతా రాత్రికాలంగానే వుంది. లోకంలో యజ్ఞయాగాది క్రతువులన్నీ ఆగిపోయాయి. అహోరాత్ర వ్యవస్థ తారుమారయ్యింది. సూర్యుడు ఉదయించకపోవటంతో స్నాన, దానాది క్రియలన్నీ ఆగిపోయాయి. చరాచర ప్రపంచమంతా అంధకార బంధురమయ్యింది.

**సతీ అనసూయ :** దేవతలంతా ఎంతో కలవరపడ్డారు. సూర్యోదయం కాకపోతే మానవులు యజ్ఞయాగాలు నిర్వహించి తమకు హవిస్సులు సమర్పించరు. అవి లేకపోతే తామెలా జీవించాలి అని చింతించసాగారు. వారి బాధలు గ్రహించిన బ్రహ్మదేవుడు "దేవతలారా! సూర్యోదయం కాకపోతే మీకు, మానవులకీ ఎన్నో కష్టాలు వస్తాయి. కాబట్టి మీరు వెంటనే అత్రిమహాముని భార్య అనసూయా దేవి దగ్గరకి వెళ్ళండి. ఆమె మాత్రమే మీ బాధల్ని పోగొట్టగలదు" అని సలహా ఇచ్చాడు. దేవతలంతా వెళ్ళి అనసూయాదేవిని ఆశ్రయించారు. తమ బాధలు చెప్పుకున్నారు. అనసూయాదేవి వారికి అభయాన్నిచ్చి" దేవతలారా మహాపతివ్రతల శాపానికి తిరుగుండదు. అయినా నేను వెళ్ళి ఆ కౌశికుడి భార్యని సముదాయించి, ఆమె భర్త మరణించకుండా చేసి తిరిగి సూర్యోదయమయ్యేలా చేస్తానని చెప్పి పంపింది. అనసూయాదేవి కౌశికుడి ఇంటికి వెళ్ళింది. "అమ్మా! నీవు నీ భర్తా కుశలమేనా? పతిసేవ వల్లే అన్ని కోరికలూ తీరతాయి! నీ భర్తని అందరికన్నా గొప్పవాడుగా భావిస్తున్నావా! ఎప్పుడూ మానవుడు అయిదు రకాల ఋణాలని తీర్చుకోవాలి. 1.తన వర్ణ ధర్మం ప్రకారం ధనాన్ని సంపాదించాలి. 2.తనకు లభించిన ధనాన్ని విధి పూర్వకంగా అర్హులకు మాత్రమే దానం చేయాలి. 3.ఎప్పుడూ సత్యాన్ని, మార్దవాన్ని, తపస్సుని, దానాన్ని దయని కలిగి వుండాలి. 4.ప్రతిరోజూ శ్రద్ధగా రాగద్వేషాల్ని విడిచిపెట్టాలి. 5.తన శక్తిని అనుసరించి సమస్త శాస్త్రోక్త క్రియల్ని అనుష్ఠించాలి. పురుషులు ఈ ప్రకారంగా అయిదు ఋణాలనీ తీరుస్తున్నట్లయితే ఉత్తమ లోకాలని చేరుకుంటాడు.

అమ్మా! స్త్రీ మాత్రం ఇవేవీ చేయక్కర్లేదు. కేవలం పతిసేవ చేయటంతోనే ఆయన చేసే అన్నిరకాల పుణ్యకర్మల్లో అర్ధభాగాన్ని పొందుతుంది. స్త్రీలకి ప్రత్యేకంగా యజ్ఞాలు, ఉపవాసాలు శాస్త్రంలో నిర్దేశించి చెప్పబడలేదు. స్త్రీ కేవలం పతి సేవతోనే ఉత్తమలోకాలకి చేరుకుంటుంది. కనుక ఓ సాధ్వీ! నీవెప్పుడూ పతిసేవా పరాయణురాలిగానే వుండు. పతియే ప్రత్యక్ష దైవం, పరమగతి అని బోధించింది.

అనసూయాదేవి బోధన విని ఎంతో ఆనందించిన కౌశికుడి భార్య ఎంతో ఆదరంగా ఆమెని కూర్చోబెట్టి పూజించి "అమ్మా శుభదాయినీ! అనసూయాదేవీ! నేనెంతో ధన్యురాలిని, నాకెంతో విలువైన ధర్మాల్ని బోధించావు. నీ మాటలతో నేను నా భర్తని మరింత శ్రద్ధగా సేవిస్తాను. నీవు చెప్పినట్టే, పతిసేవతోనే స్త్రీలు ఈ లోకంలో పరలోకంలో సుఖాల్ని అనుభవిస్తారు. కాబట్టి భర్తే భార్యకి దైవం. అమ్మా! తమరు నా ఇంటికి వచ్చినందుకు చాలా సంతోషం. నేను గానీ, నా భర్తగానీ తమకు ఏదైనా పని చేయాలంటే చెప్పండి చేస్తాను" అని వినయంగా అన్నది.

ఆ మాటలు విన్న అనసూయాదేవి సంతోషంతో "సాధ్వీ! నీ మాట ప్రకారం లోకంలో సూర్యుడు ఉదయించటం లేదు. రాత్రి పగలు అనేవి లేకుండా పోయాయి. దానివల్ల అన్ని కార్యాలు ఆగిపోయాయి. ఈ చర్యవల్ల దేవతలంతా ఇంద్రుడితో సహా ఎంతో దుఃఖిస్తూ నా దగ్గరకొచ్చారు. నేను వారికి తిరిగి సూర్యోదయమయ్యేలా చేస్తానని మాటిచ్చి నీ దగ్గరకి వచ్చాను. నువ్వు ప్రసన్నురాలివై తిరిగి నీ మాటని ఉపసంహరించుకుంటే సూర్యోదయమై లోకాలన్నీ ఎంతో సంతోషిస్తాయి" అన్నది. అనసూయ మాటలు విన్న ఆ మహాసాధ్వి అమ్మా నీవన్నట్టు నా మాట ఉపసంహరించుకుంటే నా భర్త మాండవ్యముని శాపంతో మరణిస్తాడు కదా! నేనేం చేయాలి? అని అడిగింది.

అనసూయ ఆమెతో "మహాసాధ్వీ నీవేం చింతించకు నీ భర్త ప్రాణాలని నేను కాపాడతాను. అతన్ని తిరిగి జీవింపచేస్తాను. అనగానే కౌశికుడి భార్య తన మాటల్ని ఉపసంహరించుకుంది. అప్పటికి తొమ్మిది రాత్రిళ్ళు గడిచాయి.

పదో రోజు రాత్రి అయ్యింది. వెంటనే అనసూయాదేవి అర్ఘ్యాన్ని చేతిలోకి తీసుకుని పైకి చూపించి సూర్యుణ్ణి ఆవాహన చేసింది. నెమ్మదిగా వికసించిన కమలం లాంటి ఎర్రని కాంతితో సూర్యుడు ఉదయించాడు. తక్షణమే కౌశికుడు ప్రాణాలు కోల్పోయి భూమిమీద పడబోతున్నాడు. ఆయన్ని మహాతపస్విని అయిన అనసూయాదేవి చేత్తో పట్టుకుంది.

ఓ సాధ్వీ! నీవేం బాధపడకు. మహాపతివ్రత శక్తి ఎలాంటిదో నీకిప్పుడు చూపిస్తాను. "నేను గనుక రూప, శీల, బుద్ధి, వాక్య, మాధుర్యాది సద్గుణాలతో నా భర్త ఇంతరులందరికన్నా ఎంతో గొప్పవాడని నిశ్చయంగా నమ్మిన దాన్నయితే, నిజమైన పతివ్రతనైతే ఈ కౌశికుడు వ్యాధి నుంచి విముక్తి పొంది తిరిగి జీవించుగాక!" అని అనసూయాదేవి పలికింది. మహాపతివ్రత అనసూయాదేవి పాతివ్రత్య మహిమతో కౌశికుడు పునర్జీవితుడయ్యాడు. దేవతలందరూ సంతోషించి ఆకాశం నుంచి పూలవాన కురిపించారు.

అనసూయాదేవి మహిమతో తిరిగి సూర్యోదయమైన కారణంగా వారంతా ఆమె దగ్గరకి వచ్చి కృతజ్ఞతా పూర్వకంగా వరం కోరుకోమన్నారు. వారి మాటలు విన్న అనసూయాదేవి "దేవతలారా! మీరంతా ఎంతో ఆదరంగా నాకు వరమివ్వాలని అనుకున్నారు. చాలా సంతోషం. మీరు ఇవ్వాలనుకుంటే, త్రిమూర్తులైన బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు ముగ్గురూ నాకు పుత్రులుగా జన్మించే వరాన్ని ప్రసాదించండి" అని కోరింది. దేవతలంతా తథాస్తు అని పలికి తమతమ స్థానాలకి వెళ్ళిపోయారు.

**త్రిమూర్తుల జననం :** కొంతకాలం గడిచాక అత్రిమహాముని ఒక శుభదినాన తన భార్య అనసూయాదేవిని కామభావంతో చూసాడు. మదనభావంతో ఆ మహామునికి రేతస్సు స్కలించింది. వాయుదేవుడు ఆ రేతస్సుని తీసుకెళ్ళి ఊర్ధ్వభాగంలో విడిచిపెట్టాడు. బ్రహ్మతేజస్సుతో తెల్లగా ప్రకాశిస్తున్న ఆ వీర్యకాంతి అన్ని దిక్కులా వ్యాపించింది. రజోగుణంతో కూడిన ఆ తేజస్సు క్రమంగా చల్లని తెల్లని చంద్రుడి రూపాన్ని ధరించి పదిదిక్కుల్లో

ఆశ్రయాన్ని పొందింది. ఆవిధంగా బ్రహ్మాంశతో చంద్రుడు అత్రిమహర్షికి అనసూయ వల్ల జన్మించాడు.

తరువాత సత్త్వగుణ ప్రధానుడు, సమస్త తత్త్వాలకీ ఆధారుడు, ఆయుర్దాయ కారకుడు అయిన విష్ణుభగవానుడు తన అంశతో ద్విజోత్తముడైన దత్తాత్రేయుడుగా జన్మించగా, ఆయన తరువాత రుద్రుడు తన అంశతో అనసూయాదేవి గర్భంలో ప్రవేశించి ఏడురోజుల్లోనే దుర్వాసమహర్షిగా అవతరించాడు. ఈవిధంగా బ్రహ్మ, విష్ణువు, మహేశ్వరులు, చంద్ర, దత్తాత్రేయ దుర్వాసమహర్షులుగా అనసూయాదేవికి జన్మించారు. వీరిలో చంద్రుడు తన చల్లని కిరణాలతో లతల్ని, ఔషధుల్ని, మానవుల్ని రక్షిస్తుండగా, వైష్ణవాంశ సంభూతుడైన దత్తాత్రేయుడు యోగమార్గాన్ని ఉపదేశించి శిష్టుల్ని రక్షిస్తుంటాడు. ఇక రుద్రాంశ సంభూతుడైన దుర్వాసుడు తమోగుణంతో నిండి తనని అవమానించిన వారిని దహిస్తూ సంచరిస్తాడు.

రుద్రాంశతో శరీరాన్ని ధరించిన దుర్వాసుడు తన మనస్సు, వాక్కు దృష్టితో దుష్టుల్ని సంహరిస్తాడు. అత్రి మహాముని తన కుమారుడైన చంద్రుడికి చంద్రగ్రహ పదవిని ఇచ్చాడు. ఇక విష్ణువు అంశతో జన్మించిన దత్తాత్రేయుడు యోగనిష్ఠా గరిష్టుడయ్యాడు. దుర్వాసుడు మునివృత్తిని అవలంబించి లోకసంచారం చేయగా, దత్తాత్రేయుడు కూడా మహాయోగిగా మారి, ఎన్నో సిద్ధశక్తుల్ని సాధించి, లౌకిక విషయాల మీద వ్యామోహాన్ని వదిలి అవధూతలా సంచరించసాగాడు. యోగిగా మారిన దత్తాత్రేయుణ్ణి ముని కుమారులందరూ నిత్యం సేవించేవారు. ఎప్పుడూ ఆయన్ని అనుసరించే వుండేవారు. దత్తాత్రేయుల వారు వారిని ఎలాగైనా వదిలించుకోవాలనుకున్నారు.

ఒకనాడు మంచి దివ్యాభరణాలు, పట్టు వస్త్రాలు ధరించిన అందమైన స్త్రీని వెంటబెట్టుకుని తన శిష్యుల ముందు ప్రత్యక్షమయ్యారు దత్తాత్రేయులు. అలా ఒక స్త్రీతో తనని చూస్తే ముని కుమారులు తనని వదిలి వెళ్తారని అప్పుడు తాను ఒంటరిగా యోగనిష్ఠతో వుండచని భావించారు. అయినాసరే

ముని కుమారులు ఆయన్ని వదలలేదు. తరువాత దత్తాత్రేయులు ఆ యువతితో కలిసి మద్యపానం చేసారు. అయినా వారు వదల్లేదు. రమణీమణులతో కలిసి వున్నప్పటికీ దత్తాత్రేయుల వారు మహా మహితాత్ముడని వారి విశ్వాసం.

**కార్త వీర్యార్జునుడు :** ఒకనాడు మహాబలవంతుడైన కార్తవీర్యార్జునుడి తండ్రి కృతవీర్యుడు మరణించాడు. అపుడు మంత్రులు, పురోహితులు కార్తవీర్యార్జునుణ్ణి రాజుగా చేయాలని తలచారు. ఆ సమయంలో కార్తవీర్యుడు వారి దగ్గరకొచ్చి పురోహిత, అమాత్యులారా! ప్రజలారా! నరకాన్ని పొందించే ఈ రాజ్యపాలన నేను చేయను. రాజు ప్రజల దగ్గరనుంచి పన్ను స్వీకరించాలి. అంతా తీసుకోవటం చాలా కష్టం. పన్నులు తీసుకుంటే రాజ్యాన్ని సుభిక్షంగా పాలించాలి. వైశ్యులు తమ వస్తువులు విక్రయించగా వచ్చిన లాభంతో పన్నెండు శాతం రాజుకు పన్నుగా చెల్లించాలి. ఇలా ఇచ్చినందువల్ల దొంగల భయంలేకుండా రక్షకభటులు వారిని రక్షిస్తుంటారు. అలగే గొల్లవారు, రైతులు తమ ఆదాయంలో ఆరోవంతు భాగాన్ని పన్నుగా చెల్లించాలి. రాజు పన్ను తీసుకుని తాను సరిగ్గా పాలించకుండా ఇతర వృత్తుల్ని అవలంబిస్తే నరకానికి పోతాడు. నాకు ఈ రాజ్యపాలన మీద ఆసక్తి లేదు. నేను తపస్సు చేసి యోగినౌతాను. అసలు ఈ రాజ్యాన్ని పాలించాలంటే అందుకు తగిన శస్త్రాస్త్ర సామర్థ్యం కావాలి. అలాంటి సామర్థ్యం నాకు కలిగినపుడు రాజ్యాన్ని పాలిస్తాను" అని తన మనో నిశ్చయాన్ని మంత్రులకు తెలియజేసాడు.

కార్తవీర్యుడి మాటలు విన్న ఆ సభలోని గర్గమహర్షి అతడితో "రాజా! నీకు చక్కగా రాజ్యపాలన చేయాలని కోరిక వుంటే అందుకు తగ్గ శక్తి సామర్థ్యాలు పొందటానికి ఒక ఉపాయం చెబుతా విను! సహ్యాద్రి పర్వతంలో ఆశ్రమాన్ని నిర్మించుకుని మహాయోగీశ్వరుడైన దత్తాత్రేయుడు నివసిస్తున్నాడు. ఆయన సర్వదర్శి, అవధూత, నారాయణాంశతో భూమి మీద అవతరించిన మహాపురుషుడు. పూర్వం ఆయన్ని ఆరాధించి ఇంద్రుడు ఎంతో మంది దానవుల్ని సంహరించే శక్తిని సంపాదించాడు. కనుక నీవు ఆయన్ని ఆశ్రయిస్తే మంచిది" అని సెలవిచ్చాడు.

గర్గముని వాక్యాలు విని కార్తవీర్యార్జునుడు సహ్యాద్రి పర్వతానికి వెళ్ళి అక్కడ నివసిస్తున్న దత్తాత్రేయుల వారిని భక్తిగా సేవించాడు. నిత్యం ఆయన పాదాల్ని ఒత్తుతూ, మంచిగంధాన్ని, పళ్ళని ఆయనకి తెచ్చి ఇస్తూ ఆయనకి భోజనాన్ని సమకూరుస్తూ, ఆయన ఎంగిలిని శుభ్రం చేస్తూ ఇలా ఎన్నో రోజులు సేవలు చేశాడు. రాజు చేసిన సేవలకు సంతోషించిన దత్తాత్రేయులు "ఓ కార్తవీర్యా! మద్యపానం, మాంసభక్షణం అనే నిందనీయ కర్మలని దేవతలు చెబుతారు. నేను ఈ రెండూ స్వీకరించాను. పైగా ఇదిగో అ అందమైన యువతితో కూడా సుఖిస్తున్నాను. నీవు అనవసరంగా నా దగ్గరకొచ్చి సేవలు చేస్తున్నావు. నీకు నేనేం ఉపకారం చేయలేను. వెళ్ళి వేరే ఎవరైనా శక్తిమంతుణ్ణి సేవించు" అని చెప్పాడు.

దత్తాత్రేయుల వారి మాటలు విని కార్తవీర్యార్జునుడు కార్తవీర్యుడు ఏమాత్రం చలించక స్వామీ! తమరు పురాణ పురుషులు, పాప రహితులు. స్వయంగా మాయను నీ పక్కన వుంచుకుని ఇలా ప్రవర్తిస్తున్నావు. మహాపురుషా! నీ ప్రక్కనున్న దేవి సంసార దుఃఖానికి ఆరణి వంటిది" అని స్తుతించాడు. కార్తవీర్యుడి నిశ్చలభక్తికి సంతోషించిన దత్తాత్రేయుడు "ఓ కార్తవీర్యా! నీ ప్రార్ధన వల్ల నాకెంతో ఆనందం కలిగింది. అతి రహస్యమైన తత్త్వం గురించి నీవు చెప్పటంతో నాకు సంతోషం అధికమైంది. ఎవరైతే నన్ను గంధమాల్యాదులతో పూజిస్తారో, మంచి ఆహార పదార్ధాలతో, మద్య, మాంసాలతో, గీతాలతో, బ్రాహ్మనార్చనలతో లక్ష్మీసమేతుడైన నన్ను అర్చిస్తారో, పాదోదకాల చేతా, మనోహరమైన వీణా, వేణు, శంఖనాదాల చేతా సేవిస్తారో అలాంటి వారికి నేను పుత్రుల్ని, ధనాన్ని ఇచ్చి వారికి సంతోషాన్ని కలుగచేస్తాను. అవధూతనైన నన్ను పూజించేవారికి సర్వసంపదల్నీ, సుఖాల్నీ, ప్రసాదిస్తాను. నన్ను అవమాన పరచిన వారిని సంహరిస్తాను. నీవు నన్ను ఎంతో శ్రద్ధతో పూజించావు కాబట్టి నీకు కావలసిన వరాలు కోరుకో అనుగ్రహిస్తాను" అన్నాడు దత్తాత్రేయుడు.

ఓ దత్తప్రభూ! నామీద నీకు దయవుంటే ఉత్తమమైన బుద్ధిని, ఐశ్వర్యాన్ని నాకు ప్రసాదించు. నేను ధర్మబద్ధంగా ప్రజల్ని పాలించేటట్లుగా, యుద్ధరంగంలో

నాతో సమానమైనవాడు మరొకడు లేనట్లుగా వరాన్ని కోరుతున్నాను. అలాగే శక్తివంతమైన వేయి చేతుల్ని ప్రసాదించమని కోరుతున్నాను. ఆకాశం, నీరు, భూమి, పర్వతాల్లో, అన్ని ప్రదేశాలలో యధేచ్ఛగా సంచరించే ఉత్తముడైన మానవుడి చేతిలోనే వధించబడేలా కోరుతున్నాను. ఈ విధంగా కార్తవీర్యార్జునుడు వరాలు కోరుకోగా దత్తాత్రేయుడు “వత్సా! నీ కోరికలన్నీ అనుగ్రహిస్తున్నాను. నీకు చక్రవర్తి పదవి లభించుగాక! అని ఆశీర్వదించాడు.

దత్తాత్రేయుడి ద్వారా వరాలు ఆశీస్సులుపొందిన కార్తవీర్యుడు ఆయన దగ్గర నుంచి వీడ్కోలు తీసుకుని తన రాజ్యానికి వచ్చి ఘనంగా పట్టాభిషేకం చేసుకున్నాడు. ఆ పట్టాభిషేకానికి ఎందరో మహర్షులు దేవ, మానవ, గంధర్వులు సకలలోకవాసులు విచ్చేసారు. బ్రహ్మాది దేవతలు అగ్నిని ప్రజ్జ్వలింపచేయగా దత్తస్వరూపుడైన నారాయణుడు అతడికి పట్టాభిషేకాన్ని చేసాడు. తరువాత సముద్ర నదీ దేవతలు, ఋషులు కార్తవీర్యుణ్ణి అభిషేకించారు. అందరూ కలసి కార్తవీర్యుడు భూమండల చక్రవర్తి అని ఎలుగెత్తి చాటారు.

ఆవిధంగా దత్తాత్రేయుడు అనుగ్రహంతో అఖండైశ్వర్యాన్ని అపరిమిత బలాన్ని పొందిన కార్తవీర్యుడు ఆరోజు నుంచి ఎవరూ తన రాజ్యంలో ఆయుధాలు ధరించకూడదు అని చాటించాడు. అలా ధరించిన వాడిని తాను దండిస్తానని చెప్పాడు. ఆయన  ఆజ్ఞతో ఎక్కడా ఏ మానవనుడూ ఆయుధాన్ని ధరించలేదు. మహావీరుడు వరప్రసాది అయిన ఆ కార్యవీర్య చక్రవర్తి చోర, సర్ప, అగ్ని, శస్త్ర, శత్రు, భయంకర సముద్ర జలాలు వీటినుంచి ఆపద కలిగిన వారిని రక్షించే వాడయ్యాడు. అంతేకాదు కార్తవీర్యుడి నామస్మరణ చేస్తే చాలు మానవుల సమస్త ఆపదలూ దూరమైపోతున్నాయి. ఆమహారాజు పాలనలో ఎవరికీ ధన నష్టం కలుగులేదు.

కార్తవీర్యుడు ఎన్నో యజ్ఞయాగాలు చేసి విరివిగా దానధర్మాలు చేసాడు. ఎన్నో యుద్ధాలు చేసి మహావీరుడిగా పేరుగాంచాడు. కార్తవీర్యుడి దివ్య వైభవాన్ని చూసి అంగీరస మహర్షి ఇతడికి సాటి రాజు వేరొకడు లేడని

ప్రశంసించాడు. యజ్ఞంలో, దానంలో, సంగ్రామంలో, పాలనలో కార్తవీర్యుడికి సమానులు లేరు అని ప్రకటించాడు. ఏరోజైతే తనకి అఖండమైన జల ఐశ్వర్యాలు, దివ్యవరాలు లభించాయో అదే రోజు ప్రతి సంవత్సరం దత్తాత్రేయుడి ప్రీత్యర్థం యజ్ఞాలు చేసేవాడు కార్తవీర్యుడు. ఆయన చేసిన విధంగా తన రాజ్యంలోని ప్రజలందరి చేతా దత్తయాగాలు చేయించాడు.

**దత్తమహిమ :** మహా ధీమంతుడైన దత్తాత్రేయుడి మహిమ ఇంతదని చెప్పటం ఎవరికీ సాధ్యంకాదు. చరాచర జగత్తులో సంచరించేవాడు. అనంతుడు, శార్ఙ్గధన్వుడు, శంఖ, చక్ర, గదాధారి, అప్రమేయుడు అయిన శ్రీమన్నారాయణుడే దత్తాత్రేయుడుగా అవతరించాడు. ఆదిమధ్యాంత రహితుడైన ఈ దత్తాత్రేయ మూర్తిని ధ్యానించిన వారు ధన్యులౌతారు.

ఏతస్య పరమం రూపం యశ్చింత యతి మానవ ।
స సుఖీ స చ సంసారాత్ సముత్తీర్ణోఽచిరాద్భవేత్ ॥
సదైవ వైష్ణవానాంచ భక్త్యాఽహం సులభోస్మ భోః ॥
పత్ర పుష్పఫలేనాఽహం పూజతో మోక్షదోఽస్మివై ।

(శ్లో.39-41, అధ్యా.17)

ఓ విష్ణుభక్తులారా! ఎవరైతే నన్ను భక్తిగా ఆరాధిస్తారో వారికి సుఖాల్ని ప్రసాదిస్తాను. అతి తొందరగా వారికి సంసార దుఃఖాల నుంచి విముక్తిని కలుగజేస్తాను. నేను భక్తులకి సులభంగా వశమౌతాను. కేవలం, పత్రం, పుష్పం, ఫలం సమర్పిస్తే చాలు అలాంటి వారికి కూడా నేను మోక్షాన్ని ప్రసాదిస్తాను" అని దత్తాత్రేయుడే స్వయంగా చెప్పాడు.

ఇంతటి మహాపురుషుణ్ణి జనులందరూ తప్పక సేవించాలి. దత్త భగవానుడు అనాది నిధనుడు. ధర్మాన్ని ఆచరించి అధర్మాన్ని నశింపచేసి స్థితిపాలన చేస్తుంటాడు. ఆయన్ని భక్తి శ్రద్ధలతో సేవించినవారు సకల శుభాలు పొందుతారు.

# మదాలసోపాఖ్యానం

**పూ**ర్వం మహావీరుడైన 'శత్రుజిత్తు' అనే మహారాజుండేవాడు. ఆయన ఎన్నో యజ్ఞాలు చేసి దేవేంద్రుణ్ణి సంతృప్తి పరచాడు. ఆరాజుకి ఋతుధ్వజుడనే కుమారుడున్నాడు. అతడు కూడా మహావీరుడే. ఋతుధ్వజుడు బుద్ధి, పరాక్రమ, లావణ్యాలలో గురు, శుక్ర, అశ్వనీ దేవతలతో సమానంగా వుండేవాడు. యోగ్యులైన వారితో మల్లయుద్ధక్రీడలు ఆచరిస్తూ, రథాలమీద, అశ్వాలమీద విన్యాసాలు చేస్తు తోటి రాజపుత్రులతో ఆహ్లాదంగా కాలం గడిపేవాడు. ఋతుధ్వజుడు రాత్రిపూట కూడా బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య బాలకులతో వినోదంగా సంచరించేవాడు. అందరితో కలవిడిగా వుండే ఆయన దగ్గరికి ఎందరో సమవయస్కులైన యువకులు వచ్చేవారు. అదేవిధంగా ఒకనాడు నాగలోకం నుంచి భూలోకానికి ఇద్దరు నాగకుమారులు మానవరూపంలో వచ్చారు. వారిద్దరూ బ్రాహ్మణ యువకుల్లాగా రూపాన్ని ధరించి ఋతుధ్వజుడి దగ్గరకు వచ్చారు. ఆ ఇద్దరు నవయువకులతో ఋతధ్వజుడికి మైత్రి కుదిరింది. నిత్యం వారితో కలసి మెలసి ఆటలాడేవాడు.

ఆ విధంగా ఋతుధ్వజుడు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య రాజకుమారులతో, నాగరాజు కుమారులతో సంతోషంగా విహరిస్తూ వుండేవాడు. నాగరాజు కుమారులు మాత్రం ప్రతిరోజూ ఉదయం నుంచి రాత్రి వరకూ అతడితోనే వుండి రాత్రికాగానే తమ లోకానికి తిరిగి వెళ్ళిపోయేవారు. నాగరాజు కుమారులతో గాఢమైన మైత్రి ఏర్పడిన కారణంగా ఋతుధ్వజుడికి రాత్రిపూట వారు లేకపోయేసరికి ఏమీ తోచేది కాదు. అక్కడ నాగరాజు కుమారులకి కూడా ఋతుధ్వజుడు లేక ఎంతో బాధపడేవారు.

కొన్నాళ్ళు గడిచాక ఒకనాడు నాగరాజు తన కుమారుల్ని పిలిచి "కుమారులారా! మీకు భూలోకం మీద ప్రేమ ఎక్కువైందనుకుంటాను. ఈ మధ్య మీరు ఉదయం పూట అసలే కనిపించటం లేదు. కేవలం రాత్రి పూటే కనిపిస్తున్నారు" అని అడిగాడు. దానికి ఆ నాగరాజు కుమారులు "తండ్రీ!

భూలోకంలో ఋతుధ్వజుడనే రాజకుమారుడున్నాడు. అతడెంతో సరళస్వభావుడు, మంచి మైత్రీ బంధం కలవాడు. మంచి విద్వాంసుడు. చతురుడు. స్నేహశీలి, వినయవంతుడు, అతడితో మాకు మైత్రి కలిగింది. అతడితో స్నేహం చేస్తుంటే మాకు కాలం తెలియటం లేదు. మాకు అతడికి ఏదో విడదీయరాని బంధం ఉన్నట్లనిపిస్తోంది. అందుకే మేము ప్రతిరోజూ ఉదయం నించి రాత్రివరకూ అతడితోనే కాలం గడుపుతున్నాం" అని బదులిచ్చారు.

కుమారుల మాటలు విన్న నాగరాజు వారితో "పుత్రులారా! మీరెంతో ధన్యులు. మీతో గాఢమైత్రి పొందిన ఆ రాజకుమారుడు కూడా ధన్యుడే. మీరెంతో గుణవంతులు కనుకనే పరోక్షంగా మీ మిత్రుడి గుణగణాల్ని పొగడుతున్నారు. మీతో అత్యంత అనురాగాన్ని పొందిన ఆ రాజకుమారుడికి మీరేమైనా ప్రత్యుపకారం చేసారా? అతడి మనసుని సంతోషపరచటానికి ఏమైనా చేసారా? మిత్రుడికి ఆనందం కలిగించిన వాడి జీవితమే జీవితం. మన ఇంట్లో ఎన్నో విలువైన వస్తువులున్నాయి. వాటిలో ఏదైనా నీ మిత్రుడికి అందించి అతన్ని ఆనందపరచండి"అని చెప్పాడు.

తండ్రీ! మా ప్రియ మిత్రుడికి కావలసిందేదీ లేదు. అతడే అడిగిన వారందరికీ ఎన్నో విలువైన కానుకల్ని అందిస్తుంటాడు. అతడి వద్ద వున్న రత్నాభరణాలు మన పాతాళలోకంలో కూడా లేవు. అతడి దగ్గరున్న వాహనాలు, ఆసనాలు, భూషణాలు, వస్త్రాలు, ఆయుధాలు మన దగ్గర కూడా లేవు. అలాంటివాడికి మేమేమి కానుకలీయగలం. అయితే ఆరాజకుమారుడికి సంతోషాన్ని కలిగించే పని ఒక్కటే వుంది. ఆ పనిచేయటానికి మాసామర్థ్యం చాలదు తండ్రీ! అని అన్నారు. అది విని ఎంతో కుతూహలంతో నాగరాజు "కుమారులారా! మీ మిత్రుడికి ఆనందం కలిగించే పని ఏదో చెప్పండి. అది నెరవేరే మార్గం నేను చెబుతాను. అసలు ప్రయత్నంతో సాధ్యంకాని పని ఏది వుంటుంది. మీ మిత్రుడికి ఆనందాన్ని చేకూర్చే బాధ్యత మీదే కదా!" అని అనగానే నాగరాజు కుమారులు ఇలా చెప్పటం ప్రారంభించారు.

**కువలయాశ్వచరిత్ర :** తండ్రీ! నామిత్రుడు తన చిన్నతనంలో జరిగిన ఒక సంఘటన గురించి మాకు చెప్పాడు. ఒకనాడు తన తండ్రి శత్రుజిత్తు దగ్గరకి 'గాలవుడు' అనే బ్రాహ్మణుడు ఒక అశ్వాన్ని తీసుకువచ్చి "రాజా! ఒక భయంకరమైన రాక్షసుడు నా ఆశ్రమాన్ని నాశనం చేస్తున్నాడు. అలాగే, ఏనుగు, సింహం రూపాలు ధరించి అడవినంతా ఛిన్నాభిన్నం చేస్తున్నాడు. ఇంకా ఎన్నో రకాల మాయా రూపాలు ధరించి మౌనంగా తపస్సు చేస్తున్న నాకు ఎన్నో ఆటంకాలు కలిగిస్తున్నాడు. అలాంటి అసురుణ్ణి శపించటానికి మా శక్తి చాలదు. అదీగాక మా తపస్సంతా వ్యర్థమైపోతుంది. ఒకనాడు ఆ అసురుణ్ణి ఏమీ చేయలేకపోతున్నానే అన్న బాధతో ఆకాశం వైపు చూసి గట్టిగా నిట్టూర్చాను. వెంటనే ఆకాశం నుంచి ఒక దివ్యాశ్వం భూమి మీదికి వచ్చింది. ఆ అశ్వం ఇదే ప్రభూ!

ఆ సమయంలో ఆకాశవాణి ఇలా పలికింది. ఓయ్యీ! విప్రవర్యా! ఈ గుర్రం ఎలాంటి అలసట లేకుండా భూమండలమంతా తిరిగి రాగలదు. ఇది సూర్యుడితో సమానమైన వేగం కలిగింది. ఆకాశంలో భూమి మీద పాతాళంలో కూడా సంచరించగలదు. దీన్ని నీకు ఇస్తున్నాను. ఇది పర్వతాల్ని సాగరాల్ని అధిగమించి సంచరించగలదు. అందుకే ఈ అశ్వాన్ని కువలయం అని పిలుస్తారు. నీ ఆశ్రమాన్ని ధ్వంసం చేస్తూ నీ తపస్సుకి ఆటంకం కలిగించే రాక్షసుణ్ణి శత్రుజిత్తు మహారాజు కుమారుడైన ఋతధ్వజుడనే వాడు. సంచరించగలడు. అని చెప్పింది. ప్రభూ! ఈ అశ్వాన్ని స్వీకరించి నీ కుమారుడు ఎంతో ఖ్యాతిని పొందగలడు. దయచేసి నా ఆశ్రమాన్ని తపస్సున్ని నీకుమారుడి ద్వారా సంరక్షించు అని కోరాడు.

గాలవుడి మాటలు విన్న శత్రుజిత్తు వెంటనే తన కుమారుడైన ఋతధ్వజుణ్ణి పిలిచి, అశ్వాన్ని అప్పగించి గాలవుడి వెంట అతడి ఆశ్రమానికి రక్షణగా పంపించాడు. ఋతధ్వజుడు గాలవుడి వెంట అతడి ఆశ్రమానికి రక్షణగా వెళ్ళాడు. ఋతధ్వజుడు గాలవుడి ఆశ్రమానికి వెళ్ళి వారందరికీ

సంరక్షకుడిగా వున్నాడు. నిత్యం గాలవుడి తపస్సుకి విఘ్నం కలిగించే అసురుడికి ఋతధ్వజుడు అక్కడున్న విషయం తెలియదు. అతడు పంది రూపాన్ని ధరించి యధాప్రకారం గాలవుడి తపస్సు విఘ్నం చేయటానికి వచ్చాడు. ఆపందిని చూసి ముని పుత్రులంతా హాహాకారాలు చేసారు. ఋతధ్వజుడు వారి ఆర్తనాదాలు విని తన కువలయాశ్వాన్ని ఎక్కి ఆ పంది వెంటపడ్డాడు. తన పదునైన బాణాలతో దాన్ని కొట్టాడు. బాణం దెబ్బ సహించలేక ఆ రాక్షసుడు మరింత వేగంగా అడవిలోకి పరుగెత్తిపోయాడు. రాజకుమారుడు వెంటాడుతూనే వున్నాడు. తిరిగీ తిరిగీ అలసి పోయిన ఆ అసురుడు భూగర్భంలో వున్న పెద్ద గోతిలోకి పారిపోయాడు. అతన్నే వెంటాడుతూ వస్తున్న ఋతధ్వజుడు కూడా ఆ గోతిలోకి దూకాడు. అలా లోపలికి ప్రవేశించిన రాజకుమారుడికి పాతాళలోకం కనిపించింది.

పాతాళలోకంలో వెలుగు కనిపించింది. అక్కడ అంతా బంగారంతో నిండిన రాజాప్రాకారాలు కనిపించాయి. ఇంద్రలోకంలాంటి పట్టణం వుంది. రాజకుమారుడు ఆ పట్టణంలోకి ప్రవేశించాడు. అక్కడ మనుష్యులెవరూ అతడికి కనిపించలేదు. అయితే హడావిడిగా అటూ ఇటూ తిరుగుతున్న ఒక యువతి కనిపించింది. ఆమెని ఆపి సుందరీ ఎవరు నీవు? ఎక్కడికి పోతున్నావు? అని ప్రశ్నించాడు. ఆమె ఏమీ మాట్లాడకుండా ఒక మేడ మీదకి వెళ్ళింది. రాకుమారుడు అశ్వాన్ని ఒకచోట కట్టేసి నిదానంగా ఆవనిత వెంటే పైకి వెళ్ళాడు. పైన గదిలో అద్భుత సౌందర్యరాశి అయిన ఒక స్త్రీని చూసాడు. అపరిచితుడైన రాజకుమారుణ్ణి చూడగానే ఆ సుందరాంగి ఆశ్చర్యంతో ఒక్కసారి పైకి లేచింది. ఎవరితడు? గంధర్వుడా! యక్షుడా! విద్యాధరుడా! నరుడా! అని ఆలోచిస్తూ తిరిగి నేలపై పడి మూర్ఛపోయింది.

రాజకుమారుడు కూడా ఆమెని చూసి గాఢంగా మోహించాడు. వెంటనే ఆమెని చేరి భయపడవద్దు అని ఆమెని పట్టుకొని సముదాయించాడు. అంతలో ఆమె చెలికత్తె వచ్చి ఆ సుందరికి పరిచర్యలు చేయసాగింది. రాకుమారుడు

చెలికత్తెలతో ఎందుకు పడిపోయింది అని ప్రశ్నించాడు. చెలికత్తె రాకుమారుడితో ఇలా చెప్పటం ప్రారంభించింది.

రాకుమారుడా! స్వర్గలోకంలో 'విశ్వావసుడు' అనే గంధర్వ రాజు వుండేవాడు. ఈ దివ్యసుందరి అతడి కుమార్తె ఒకరోజు ఈమె తన ఉద్యానవనంలో ఆటలాడుతుండగా పాతాళలోక నివాసి అయిన పాతాళకేతువనే రాక్షసుడు గాఢమైన అంధకారాన్ని సృష్టించాడు. ఆ చీకట్లో స్వర్గం నుంచి ఈమెని అపహరించి పాతాళానికి తీసుకువచ్చాడు. రాబోయే త్రయోదశినాడు ఈమెని వివాహం చేసుకోబోతున్నాడు. ఆ అధముడు ఈమెకి తగినవాడు కాదు. ఈమె నిన్ననే ఆత్మహత్య చేసుకోవాలని ప్రయత్నించింది. అదే సమయంలో ఒక గోమాత ఇక్కడికి వచ్చి ఓ అమ్మాయీ! భయపడవద్దు. ఆ అసురుడు నిన్ను పెళ్ళి చేసుకోలేడు. భూలోకం నించి వచ్చే ఒక రాకుమారుడు తన బాణాలతో అతన్ని సంహరిస్తాడు. అతడే నీకు కాబోయే భర్త " అని చెప్పింది. నేను ఈమె చెలికత్తె ని నాపేరు కుండల. ప్రభూ మారాకుమారి తమని మోహించి ఇలా మూర్ఛపోయింది. అది సరే ఇంతకీ తమరెవరు? దైవాంశసంభూతులు తప్ప అన్యులు ఈ పాతాళానికి రాలేరు. మీ విషయాలు దయచేసి చెప్పండి" అని కోరింది.

కువలయాశ్వుడు (ఋతధ్వజుడు) ఆ చెలికత్తె కుండలతో దేవీ! నేను శత్రుజిత్తు మహారాజు కుమారుణ్ణి. ఒక రాక్షసుడు గాలవ్యముని ఆశ్రమాన్ని ధ్వంసం చేస్తుంటే ఆయన్ని రక్షించాలని వెళ్ళాను. అక్కడికి ఆ రాక్షసుడు సూకర (పంది ) రూపంలో రాగా అతన్ని వెంబడిస్తూ నేనీ లోకానికి వచ్చాను" అని చెప్పాడు. అంతలో మదాలస మూర్ఛ నుంచి తేరుకుంది. ఎంతో ఆనందంతో రాజకుమారుణ్ణి ఓరకంట చూసి సిగ్గుపడింది. అప్పుడు కుండల రాకుమారుడితో ప్రభూ! ఈమె నీమీద మనసు పడింది. సురభి అనే గోవు చెప్పిన మాటల ప్రకారం తమరే ఆ మహావీరుడు ఈమెకి కాబోయే భర్త గోవు అసత్యం చెప్పదు కనుక దయచేసి మీరీమెని వివాహం చేసుకోండి" అని ప్రార్థించింది.

కుండలమాటలు విన్న ఋతధ్వజుడు కుండలా! నాకు కూడా ఈమె అంటే ఇష్టమే. అయితే నేను తండ్రి ఆజ్ఞ లేకుండా ఈ కన్యని ఎలా వివాహం చేసుకోగలను? అని అన్నాడు. అందుకు కుండల ప్రభూ! ఈమె దేవకన్య తమరు ఎలాంటి కారణం చెప్పకుండా ఈమెని వివాహం చేసుకోండి. ఇది ముందే నిర్ణయమైన విషయం. మీ ఇద్దరికి ఒకరంటే ఒకరికి ఇష్టమే కదా! ఇంకేం అభ్యంతరం చెప్పకండి" అని చెప్పటంతో ఋతధ్వజుడు అంగీకరించాడు. వెంటనే కుండల తమ కులగురువైన 'తుంబురుణ్ని' స్మరించింది. వెంటనే దర్భల్ని తీసుకుని తుంబురుడు అక్కడ ప్రత్యక్షమయ్యాడు. విధి విధానంగా అగ్ని హోత్రాన్ని వెలిగించి శాస్త్రోక్తంగా మదాలసకి ఋతధ్వజుడికి (కువలయాశ్వరుడి)వివాహం జరిపించి వెళ్ళిపోయాడు. కుండల కూడా వారి దగ్గరనుంచి శెలవు తీసుకుని తనలోకానికి వెళ్ళి పోయింది. ఇక ఋతధ్వజుడు ఆనందంగా మదాలసని వెంటబెట్టుకుని తన లోకానికి పయనమయ్యాడు.

ఎవరోవ్యక్తి అశ్వాన్ని అధిరోహించి పాతాళలోకానికి వచ్చాడన్న విషయం రాక్షసులకి తెలిసిపోయింది. వారంతా ఒక్కసారిగా అరుస్తూ వివిధరకాల ఆయుధాలు ధరించి పాతాళకేతుణ్ణి వెంటబెట్టుకుని ఋతధ్వజుడి దగ్గరకొచ్చారు. వెంటనే తమతమ ఆయుధాలతో అతడి మీద దాడిచేశారు. ఋతధ్వజుడు కూడా ఏమాత్రం చలించక తన దివ్యాస్త్రాలతో ఆ రాక్షసవీరుల ఆయుధాలని నిర్వీర్యంచేసి వారిని తరిమికొట్టాడు. చివరగా మహా ప్రభావవంతమైన త్వాష్ట్రాస్త్రాన్ని ఆ దానవుల మీదకి ప్రయోగించగా అది పాతాళకేతుడితో సహా దానవులందరినీ మట్టుబెట్టింది.

ఆ విధంగా ఋతధ్వజుడు అసురులందర్నీ సంహరించి మదాలసతో సహా తిరిగి తన రాజ్యానికి వచ్చి తండ్రిని నమస్కరించి జరిగిన వృత్తాంతమంతా సవివరంగా తెలియజేసాడు. శత్రుజిత్తు ఎంతో ఆనందించి కుమారుణ్ని గాఢాలింగనం చేసుకుని అతడు చేసిన పనికి అభినందించాడు. తన కోడల్ని చూసిఎంతో సంతోషపడ్డాడు. ఋతధ్వజుడు తన భార్య మదాలసతో కలిసి ఆనందంగా జీవితాన్ని కొనసాగిస్తున్నాడు.

**తాళకేతుడి మాయోపాయం :** ఒకనాడు శత్రుజిత్తు తన కుమారుణ్ణి పిలిచి నాయనా బ్రాహ్మణ, ఋషుల సంరక్షణ కోసం నీవు ఒక్కసారి భూమండలమంతా సంచరించాలి. నీవువెళ్ళి చాలాకాలమయ్యింది కనుక ఒక్కసారి నీ అశ్వం మీద ప్రయాణించి వారందరి యోగక్షేమాలు విచారించిరా! అది మన కర్తవ్యం అని చెప్పాడు. తండ్రిమాటని అంగీకరిస్తూ ఋతధ్వజుడు ప్రతిరోజూ మధ్యాహ్నం వరకూ భూమండలం పర్యటిస్తూ రాత్రి సమయానికి తిరిగి రాజ్యానికి వచ్చి మదాలసతో హాయిగా కాపురం చేసేవాడు.

ఇలా కొన్నాళ్ళు గడిచాక పాతాళకేతుడి సోదరుడైన తాళకేతుడనేవాడు తన సోదరుణ్ణి చంపిన ఋతధ్వజుడి మీద పగతీర్చుకోవాలనుకున్నాడు. వెంటనే యమునా నదీ తీరానికి వచ్చి ఒక ఆశ్రమాన్ని నిర్మించుకుని మునిగా వేషాన్ని ధరించి సంచరిస్తున్నాడు. ఒకనాడు ఋతధ్వజుడు అశ్వం మీద భూమండలమంతా తిరుగుతూ తాళకేతుడున్న ఆశ్రమానికి వచ్చాడు. అతన్ని చూసి మునివేషంలో వున్న తాళకేతుడు పూర్వ వైరాన్ని గుర్తు తెచ్చుకుని "ఓ రాజా! నీవు ఆర్తత్రాణపరాయణుడివి సరైన సమయానికి వచ్చావు. నేను ఒక యజ్ఞాన్ని నిర్వహించాలనుకుంటున్నాను. అది ఇక్కడ కాదు వేరొక చోట అక్కడ నామిత్రులందరూ యజ్ఞసన్నాహాలు చేస్తున్నారు. నేను వారికి యజ్ఞదక్షిణ ఇస్తానని మాటిచ్చాను. అయితే నాదగ్గర అంతద్రవ్యం సమకూరలేదు. కనుక నీవు నీ కంఠహారాన్ని ఇచ్చినట్లయితే దాన్ని వారికి దక్షిణగా సమర్పించి వస్తాను. నేను వచ్చేంతవరకూ నా ఆశ్రమాన్ని సంరక్షించు" అని కోరాడు.

తాళకేతుడి మాయోపాయం గురించి తెలియని ఋతధ్వజుడు అతడు కోరిన ప్రకారం తన కంఠహారాన్ని ఇచ్చి అతడు వచ్చేంతవరకూ ఆశ్రమాన్ని సంరక్షిస్తానని మాటిచ్చి పంపాడు. రాకుమారుడి కంఠహారాన్ని తీసుకున్న తాళకేతుడు అక్కడినుంచి సరాసరి శత్రుజిత్తు రాజ్యానికి వెళ్ళి రాజుని కలిసాడు. అక్కడ ఎంతోమంది పరివారం కూడా వున్నారు. వారందరి సమక్షంలో "మహారాజా! ఘోరం జరిగిపోయింది. తమ కుమారుడైన కువలయాశ్వుడు

(ఋతధ్వజుడు) తాపసుల ఆశ్రమాన్ని సంరక్షిస్తున్న సమయంలో రాక్షసులు దాడిచేసారు. వారిని ఎదుర్కొని పోరాడుతుండగా ఒక దుష్టరాక్షసుడు తన శూలంతో కువలయాశ్వుణ్ణి గుండెల్లో పొడిచి చంపాడు ప్రభూ! ఆయన మరణిస్తూ ఇదిగో ఈ కంఠహారాన్ని నాకిచ్చి తమకీ విషయాన్ని తెలియచేయుచున్నారు" అని చెప్పి ఆ కంఠహారాన్ని మహారాజుకి అప్పగించాడు.

మాయ రూపంలో ఉన్న తాళకేతుడి మాటలు విని అందరూ ఒక్కసారిగా కుప్పకూలిపోయారు. రాజభవనమంతా ఆర్తనాదాలతో నిండిపోయింది. ప్రజలందరికీ తమ యువరాజు మరణించాడన్న వార్త తెలిసి తీవ్రంగా దుఃఖించసాగారు. ఈ వార్త అంతఃపురంలో వున్న మదాలసకి కూడా తెలిసింది. వెంటనే ఆమె తన ప్రాణాలు వదిలేసింది. మహారాజు రాజపరివారం, రాజ్యంలోని ప్రజలు అందరూ దుఃఖసాగరంలో మునిగిపోయారు. తన పాచిక పారినందుకు తాళకేతుడు ఎంతో ఆనందించాడు.

తాళకేతుడు తిరిగి తన ఆశ్రమానికి వచ్చాడు. అక్కడ సంరక్షుడిగా వున్న ఋతధ్వజుడు (కువలయాశ్వుడి)తో రాజా! నీ దయవల్ల నాయాగం నిర్విఘ్నంగా పరిసమాప్తమయ్యింది. ఇక నీవు వెళ్ళవచ్చు" అని అన్నాడు. రాజకుమారుడు మాయారూపం ధరించిన ఆ తాళకేతుడికి నమస్కరించి వేగంగా తన అశ్వాన్ని అధిరోహించి నగరానికి బయలుదేరాడు. క్రమంగా నగరానికి చేరుకున్నాడు. నగరంలో ప్రజలంతా బాధతో విలపిస్తూ కనిపించారు. తనని చూడగానే వారంతా ఆనందంతో నృత్యాలు చేసారు. వారి కళ్ళలో ఆనందం తాండవించింది. సరాసరి తల్లిదండ్రుల మందిరానికి వెళ్ళాడు వాళ్ళు తమ కుమారుడు సజీవుడుగా రావటం చూసి ఆనందంతో నోటమాట రాక నిశ్చేష్టులైపోయారు.

నెమ్మదిగా వారు జరిగిన వృత్తాంతమంతా కుమారుడికి నివేదించాడు. కువలాయశ్వుడు తన ప్రియ భార్య మదాలస తన మరణ వార్త విన్న వెంటనే ప్రాణత్యాగం చేసినందుకు ఎంతో కుమిలిపోయాడు. యథావిధిగా తన భార్యకి

కర్మకాండలు జరిపి అక్కడున్న వారితో ఈ జన్మకి నా భార్య మదాలసే నేను మరే ఇతర స్త్రీని భార్యగా చేసుకోను అని ప్రకటించి ఆనాటి నుంచి భార్య విషయం మరిచి తన తోటి యువకులతో ఆటపాటలు కొనసాగిస్తూ కాలక్షేపం చేస్తున్నాడు.

తండ్రీ! మా ప్రియ మిత్రుడికి మదాలస తిరిగి ప్రాప్తించటమే కోరిక. అది తప్ప అతడికి మరే కోరికా లేదు. మరి మదాలస మరణించింది కదా! ఆమెని తిరిగి తీసుకురావటం ఎలా? అని అన్నారు. కుమారులు చెప్పిన మాటలు విని నాగరాజు తీవ్రంగా ఆలోచించి మనం మన ప్రయత్నం చేద్దాం. ఫలితం దైవేచ్ఛ. నేను మీ మిత్రుడి భార్యని తిరిగి రప్పించటం కోసం తపస్సు చేస్తాను. అని వారికి చెప్పి హిమాలయాల్లో వున్న "ప్లక్షావతరణం' అనే తీర్థానికి వెళ్ళాడు. అక్కడ కఠోరమైన తపస్సు చేయటం మొదలు పెట్టి ముందుగా సరస్వతీ దేవిని ఘనంగా ఇలా స్తుతించాడు.

## సరస్వతీ స్తుతి

జగద్ధాత్రీం మహాదేవీం మారిరాధయిషుశ్శుభామ్ ।
స్తోష్యే ప్రణమ్య శిరసా బ్రహ్మ యోని సరస్వతీమ్ ।
సదసద్దేవి యత్కించిత్ మోక్ష బంధాఉర్థవత్ పదమ్ ॥
తత్సర్వం త్వయ్య సంయోగం యోగవద్దేవి సంస్థితమ్।
త్వ మక్షరం పరం దేవి యత్ర సర్వం ప్రతిష్ఠితమ్॥ (శ్లో॥31-34అధ్యా21)

అమ్మా జగజ్జననీ నీవు శుభప్రదాయినివి. సరస్వతీ దేవియైన నిన్ను నేను ఆరాధించదలిచాను. నేను బ్రహ్మ కారణమైన సరస్వతీదేవికి నమస్కరిస్తున్నాను. అమ్మా సరస్వతీ! మోక్షం, అర్థం, బంధం, సత్, అసత్ అన్ని రూపాలూ నీవే అయి వున్నావు. అక్షరరూప పరబ్రహ్మవి నీవే. ఈ సకల ప్రపంచం నీ దివ్య స్వరూపం. ఓంకారం నీరూపం. ముల్లోకాలు, త్రిమూర్తులు, మూడు వేదాలు, మూడు అగ్నులూ, మూడు గుణాలూ, మూడు శబ్దాలూ, మూడు దోషాలూ అన్నీ నీ స్వరూపమే. భూతభవిష్యత్ వర్తమానాలు, జాగ్రత్,

స్వప్న, సుషుప్త్యవస్థలు, అహోరాత్రులు అన్నీ నీవే తల్లీ! నిత్యానిత్య పదార్థాలు, అద్వైత ద్వైత తత్త్వాలు నీవే. నీ దివ్య రూపంగా వున్న స్వర, వ్యంజనాల (అచ్చులు-హల్లులు) వల్లనే సమస్త పదార్థాల జ్ఞానం కలుగుతోంది తల్లీ!"

ఈ విధంగా నాగరాజైన అశ్వతరుడు చేసిన స్తుతికి సరస్వతీదేవి ఎంతో సంతోషించి అతడికి ప్రత్యక్షమై నాగరాజా! ఏం వరం కావాలో కోరుకో అని అడిగింది. నాగరాజు వినయంగా అమ్మా! నాకు నాసోదరుడైన కంబలుడికి సమస్త స్వరసంబంధమైన సంగీత జ్ఞానాన్ని ప్రసాదించు అని కోరుకున్నాడు. సరస్వతీదేవి తథాస్తు అని ఆశీర్వదించి వెళ్ళిపోయింది.

వెంటనే అశ్వతరుడికి, కంబలుడికి అపారమైన సంగీతజ్ఞానం లభించింది. వారిద్దరూ కైలాసపర్వతానికి వెళ్ళి తమ సంగీత సాధనతో పరమేశ్వరుణ్ణి మెప్పించారు. వారి గానామృతానికి చలించిపోయిన పరమేశ్వరుడు వారికి ప్రత్యక్షమై వరం కోరుకోమన్నాడు.

అశ్వతరుడు శివుడికి నమస్కరించి స్వామీ! కువలయాశ్వుడి భార్య మదాలస మరణించిన సమయంలో ఏ వయసులో ఏరూపంలో వున్నదో అదే రూపంతో నాకు కుమార్తెగా జన్మించాలి ఇదే నా కోరిక" అన్నాడు. శివుడు తథాస్తు అని వరమిచ్చి అందుకు చేయవలసిన కార్యక్రమాన్ని వివరించి అంతర్ధానమయ్యాడు. అశ్వతరుడు శివుడు చెప్పిన విధానాన్ని నిర్వర్తించగా అతడికి మదాలస అదే రూపంతో అదే వయసుతో కుమార్తెగా జన్మించింది. అశ్వతరుడు ఈ విషయాన్ని ఎవరికీ చెప్పకుండా ఆమెని తన అంతఃపురంలో దాచివుంచాడు.

ఒకనాడు అశ్వతరుడు తన కుమారుల్ని పిలిచి నాయనా మీరు మీ మిత్రుణ్ణి ఇక్కడికి అతిథిగా తీసుకురండి అని చెప్పి పంపాడు. ఆ నాగ కుమారులిద్దరూ భూలోకానికి వచ్చి ఋతధ్వజుడి దగ్గరకు వెళ్ళి తమ తండ్రిగారు తమ లోకానికి రమ్మన్నారని అతన్ని ఆహ్వానించారు. వారి ఆహ్వానాన్ని మన్నించి ఋతధ్వజుడు వారితో బయలుదేరి నాగలోకానికి వచ్చాడు. వచ్చేవరకు అతడికి

తన మిత్రులు నాగకుమారులని తెలియదు. నాగరాజు అశ్వతరుణ్ణి కలిసిన ఋతధ్వజుడు వెంటనే ఆయన పాదాలకి నమస్కరించాడు. నాగరాజు అతన్ని లేవనెత్తి కొంతకాలం తమ లోకంలో అతిథిగా వుండమన్నాడు. సరేనని ఋతధ్వజుడు వారికి అతిథిగా సకలసుఖభోగాలు అనుభవిస్తూ నాగలోకంలో కాలం గడపసాగాడు.

ఒకనాడు నాగరాజు అశ్వతరుడు ఋతధ్వజుడి దగ్గరకొచ్చి "కుమారా! నీకు దుర్లభమైన కోరిక ఏదైనా వుంటే చెప్పు తీరుస్తాను" అన్నాడు దానికి కువలయాశ్వుడు "నాగరాజా! నాకు ప్రత్యేకంగా ఏకోరికా లేదు. నా తండ్రిగారి దయవల్ల నాకు ఏలోటూ లేదు. కేవలం మానవమాత్రుడనైన నేను దేవతా స్వరూపులైన మీతో మాట్లాడగలుగుతున్నాను. ఇదెంతో భాగ్యం కదా! మీరేదైనా వరం ఇవ్వాలనుకుంటే నేను పుణ్యకర్మల్ని చేయటం మానకుండా వుండే వరాన్ని ప్రసాదించండి చాలు నాకింకేమీ అక్కర్లేదు" అని బదులిచ్చాడు. అది విని నాగరాజు కుమారా! నీవు కోరింది జరుగుతుంది. నీవెంతో ధర్మాత్ముడివి నా ఇంటికి అతిథిగా వచ్చావు. కనుక నీకు భూలోకంలో లభించని దేదైనా కోరుకో అని అన్నాడు. ఆ మాటలు విని కువలయాశ్వుడు ఏం సమాధానం చెప్పాలో తెలియక తమ మిత్రులైన నాగరాజు కుమారుల వైపు చూసాడు.

నాగరాజు కుమారులు తమ తండ్రితో తండ్రీ! నా మిత్రుడి భార్య మదాలస అర్ధాంతరంగా ప్రాణాలు కోల్పోయింది. నా మిత్రుడికి ఆమెని చూడాలని కోరిక మీరు కనుక ఆపని చేస్తే అతడి కోరిక తీరుతుంది" అని చెప్పారు.

వెంటనే నాగరాజు నాయనా పంచభూతాలలో కలిసిన పూర్వపు శరీరాన్ని కేవలం స్వప్నంలోనే శాబర మాయలోనే మాత్రమే చూడగలం కదా! అని అన్నాడు. అది విని కువలయాశ్వుడు నాగరాజా! మాయారూపంలోనైనా సరే నా మదాలసని నాకు చూపించండి అని ప్రార్థించాడు. రాకుమారా! నీ కోరిక ప్రకారం మాయా మదాలసని నీకు చూపిస్తాను చూడు అని తన మందిరంలో రహస్యంగా దాచివుంచిన మదాలసని పిలిపించి కువలయాశ్వుడికి చూపించాడు నాగరాజు.

ఒక్కసారి తన ప్రియపత్ని కళ్ళముందు కనిపించటంతో ఆనందం పట్టలేక కువలయాశ్వుడు ఆమె దగ్గరకి వెళ్ళి హాప్రియా! అని అంటూ పట్టుకోబోయాడు. నాగరాజు అతన్ని వారించి ఆమెని ముట్టుకుంటే అదృశ్యమవుతుందని చెప్పాడు. అది విని అయ్యో! అని అరుస్తూ నేలమీద పడి మూర్ఛపోయాడు కువలయాశ్వుడు. అతడి గాఢమైన ప్రేమకి ఎంతో సంతోషించిన నాగరాజు అతన్ని పైకి లేపి మదాలస నిజమైనదేనని, ఆమె తిరిగి జన్మించిన వృత్తాంతాన్నంతా వివరంగా చెప్పి ఆమెని అతడికి అప్పగించాడు. కువలయాశ్వుడు తన మదాలస తిరిగి లభించినందుకు ఎంతో ఆనందించి నాగరాజుకి అతని పుత్రులకి కృతజ్ఞతాపూర్వక నమస్కారాలు తెలిపి తన గుర్రాన్ని ఎక్కి నగరానికి ప్రయాణమయ్యాడు.

ఈ కువలయాశ్వ చరిత్రను ఏ మానవుడు నిరంతరం భక్తిపూర్వకంగా వింటాడో అతడు దుర్లభమైన వేదపారాయణ ఫలాన్ని పొందుతాడు. అన్ని కోరికలూ తీరి సుఖాన్ని పొందుతాడు. అతడకి లోకంలో దుర్లభమైనదేదీ వుండదు.

## గృహస్థాశ్రమ ధర్మాలు

**కు**వలయాశ్వుడి భార్య అయిన మదాలస తన కుమారుడైన అలర్కుడితో గృహస్థాశ్రమ ధర్మాల గురించి ఇలా చెప్పింది. కుమారా! మానవుడు గృహస్థాశ్రమాన్ని అవలంబించి సకల జీవుల్నీ పోషించాలి. అలా చేయటం వల్ల అతడికి స్వర్గం లభిస్తుంది. పితృదేవతలు, మునులు, దేవతలు, పంచభూతాలు, మానవులు, క్రిమి కీటక, పతంగ, పశుపక్ష్యాదులు ఇవన్నీ గృహస్థుణ్ణి ఆశ్రయించే వుంటాయి. ఈ చెప్పినవన్నీ గృహస్థుడు తమకి ఆహారం పెడతాడని ఆశిస్తాయి. కుమారా! గృహస్థుడు వేదమయమైన కామధేనువుగా అన్నిటికీ ఆధారభూతుడై వున్నాడు.

ఈ బ్రహ్మాండమంతా కామధేనువులో ప్రతిష్ఠితమై వుంది. ఈ కామధేనువుకి ఋగ్వేదం పృష్ఠభాగం. యజుర్వేదం మధ్యభాగం. సామవేదం

ముఖం, కంఠం, ఇష్టాపూరాలు కొమ్ములు. సాధుసూక్తాలు రోమాలు. శాంతి పౌష్టిక కర్మలు మలమూత్రాలు. నాలుగు వర్ణాలు (బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర) నాలుగు ఆశ్రమాలు కామధేనువుకి, నాలుగు పాదాలు ఈ కామధేనువుకి నాశనం అనేదే లేదు. ఈ పవిత్రమైన ధేనువుకి స్వాహా, స్వధా, వషట్, హంత అనే నాలుగు పేర్లతో నాలుగు స్తనాలున్నాయి. ఈ నాలుగుస్తనాల నుంచి దేవతలు స్వాహాకారాన్ని, పితృదేవతలు స్వధాకారాన్ని, ఋషిగణాలు వషట్కారాన్ని, మానవులు హంతకారాన్ని, పానం చేస్తారు. కుమారా! ఈ విధంగా ఈ కామధేనువు అందరికీ తృప్తి కలిగిస్తుంది.

**బలిప్రదానం :** గృహస్థుడు ప్రతిరోజూ యథాశక్తిగా తన శరీరాన్ని పోషించుకున్న విధంగానే దేవ, ఋషి పితృ, మనుష్య పంచభూతాల్ని పోషించాలి. దానికోసం శుచిగా స్నానం చేసి శ్రద్ధగా, దేవతలకి, ఋషులకి, పితృదేవతలకి తర్పణాలు విడవాలి. అలాగే ప్రజాపతికి కూడా తర్పణమివ్వాలి. చందన ధూపదీపాదులు సమర్పించి దేవతార్చన చేయాలి. తరువాత అగ్నికార్యాన్ని చేసి, బ్రహ్మ విశ్వ దేవతలు ధన్వంతరిని ఉద్దేశించి, తన ఇంటి మధ్యలో ఈశాన్య భాగంలో బలి ప్రదానం చేయాలి. ఇంద్రుడికి తూర్పు దిక్కున, యముడికి దక్షిణదిక్కున, వరుణిడికి పడమర దిక్కున, చంద్రుడికి ఉత్తర దిక్కున బలి ప్రదానం చేయాలి. ఇంటి ద్వారం ముందు ధాత విధాత అనేవారికి బలిదానం చేయాలి.

ఇంటికి బైట అన్ని వైపులా అర్యముడు అనే వాడికి బలిని సమర్పించాలి. తరువాత ఆకాశంలో సంచరించే భూతాల్ని ఉద్దేశించి బలిహరణ చేయాలి. పితృదేవతల కోసం బలిని దక్షిణాభిముఖంగా కూర్చొని ఇవ్వాలి. తరువాత శ్వాస, శ్వపచ పక్షులకి భూమిమీద బలిదానం చేయాలి. దీన్నే వైశ్వ దేవబలి అంటారు. ఈ బలి ప్రధాన కార్యక్రమాన్ని ఉదయం సాయంత్రం ఆచరించాలి. ఇంటి యజమాని (గృహస్థుడు) ఈ విధంగా వైశ్వ దేవ బలిదానం చేసి ఆరునిమిషాలు అతిథి కోసం ఎదురుచూడాలి. అతిథి వచ్చిన తరువాత తన శక్తిని అనుసరించి అతన్ని పూజించి భోజనం పెట్టి పంపాలి.

**అతిథి :** అతిథిగా తన మిత్రుణ్ణి సొంత గ్రామంలో వున్న వ్యక్తిని భావించకూడదు. ఎవరి కులగోత్రాలు తెలియవో, ఎవరు ఆ సమయంలో వస్తారో, ఎవరు ఆహారం కోసం వస్తాడో, ఎవడు అలసిపోయి వస్తాడో, ఎవడు యాచకుడిగా వస్తాడో, అలాంటి వాడినే పండితులు అతిథి అంటారు. గృహస్థుడు వచ్చిన అతిథిని కులగోత్రాలు, తదితర విషయాలేవీ అడగకూడదు. ఆ అతిథి కురూపిగా వున్నా సరే తిరస్కరించకుండా ప్రజాపతిలా భావించాలి. ఎప్పుడూ ఉండేవాడు కాదు కాబట్టే అతిథి అని చెప్పబడుతున్నాడు.

ఏ పురుషుడు అతిథికి అన్నంపెట్టకుండా తాను భుజిస్తాడో అతడు తన పాపాన్ని భుజించినవాడవుతాడు. అలాంటివాడు మరుజన్మలో పురీషాన్ని భుజించేవాడవుతాడు. అతిథి ఎవరి ఇంటికి వచ్చి నిరాశగా తిరిగి వెళ్ళిపోతాడో, ఆ అతిథి పాపం ఇంటి యజమానికి సంక్రమించి జలాన్ని గాని, కూరల్నిగానీ, అతడు ఏది తింటాడో దాన్ని సమర్పించాలి. పితృదేవతలకి పెడుతున్నాం అన్న భావనతో బ్రాహ్మణులకి భోజనం పెట్టాలి. నిత్యం కనీసం ఒక్కడికైనా భోజనం పెట్టాలి. గృహస్థుడు అతిథికి పెట్టకుండా తాను భుజించకూడదు. అతిథి సత్కారం తరువాత బంధువులకి, యాచకులకి, వికలాంగులకి, బాలురకి భోజనం పెట్టాలి. సూర్యాస్తమయం తరువాత వచ్చిన అతిథికి భోజనంతోపాటు నిద్రించటానికి తగిన ఏర్పాటు కూడా చేసి గౌరవించి మర్నాడు పంపాలి.

కుమారా! ఈ విధంగా గృహస్థుడనే వాడు గృహస్థాశ్రమధర్మం అనే భారాన్ని మోయటం వల్ల బ్రహ్మాదిదేవతలు, పితృదేవతలు, మహర్షులు, అతిథులు, బంధువులు, పశుపక్ష్యాదులు, సూక్ష్మక్రిములు ఎంతో ఆనందించి ఆ గృహస్థుడికి క్షేమం కలగాలని కోరుకుంటారు.

## కామ్య శ్రాద్ధవిధి

**మ**దాలస తన కుమారుడికి శ్రాద్ధవిధుల్ని, శ్రాద్ధమహిమని గురించి చెబుతూ వివిధ తిథుల్లో శ్రాద్ధాన్ని పెట్టడం వల్ల ఏఏ ఫలితాలు లభిస్తాయో ఈ విధంగా వివరించి చెప్పింది.

కుమారా! పాడ్యమి తిథిలో శ్రాద్ధం పెడితే ధన లాభం కలుగుతుంది. విదియనాడు చేస్తే సంపద లభిస్తుంది. తదియ తిథిలో వరం లభిస్తుంది. చతుర్థి తిథి నాడు శ్రాద్ధంపెడితే శత్రునాశనం జరుగుతుంది. పంచమి నాడు పెడితే ధనలాభం షష్ఠిరోజు చేస్తే జనపూజ్యత, సప్తమినాడు శ్రాద్ధం పెడితే రాజ్యాధిపత్యం, అష్టమి తిథులో చేస్తే లాభవృద్ధి, నవమినాడు పెడితే స్త్రీ లాభం, దశమి నాడు పెడితే సకల కోరికలూ సిద్ధిస్తాయి.

ఏకాదశినాడు శ్రాద్ధ కర్మ చేస్తే సకల వేదాల, వేదార్థాల శ్రవణపఠన లాభం కలుగుతుంది. ఎవడు ద్వాదశినాడు శ్రాద్ధవిధిని ఆచరిస్తాడో వాడికి అన్నిటా జయం, లాభం, సంతానాభివృద్ధి, పశువృద్ధి, తుష్టి, పుష్టి అన్నీ కలుగుతాయి. త్రయోదశినాడు యధాశక్తి శ్రాద్ధకర్మని ఆచరిస్తే వాడికి దీర్ఘాయుర్ధాయం, ఐశ్వర్యం లభిస్తాయి.

కుమారా! ఎవరి తల్లిదండ్రులు వారి చిన్నతనంలోనే మరణిస్తారో లేదా శస్త్రాస్త్రాలతో ప్రాణత్యాగం చేస్తారో అలాంటి వారి కోసం చతుర్ధశీ తిథి నాడు శ్రాద్ధకర్మ చేయాలి. పవిత్రంగా నియమనిబద్ధంగా అమావాస్యనాడు శ్రాద్ధవిధిని ఆచరిస్తే సకల కోరికలూ తీరిపోతాయి. అక్షయంగా స్వర్గసుఖాలు లభిస్తాయి. పితృదేవతల్ని అర్చించిన మానవుడు స్వర్గంలో సుఖభోగాలు అనుభవిస్తాడు.

కుమారా! ఇపుడు వివిధ నక్షత్రాలలో శ్రాద్ధకర్మ ఆచరిస్తే ఎలాంటి ఫలితం లభిస్తుందో చెబుతా విను – సంతానం కావాలనుకునేవాడు రోహిణీ నక్షత్రంలో శ్రాద్ధవిధిని నిర్వర్తించాలి. తేజస్సు కావాలంటే మృగశిరా నక్షత్రంలో పెట్టాలి. ఆర్ద్రా నక్షత్రంలో పెడితే శౌర్యం, పునర్వసూ నక్షత్రంలో పెడితే భూలాభం కలుగుతుంది. పుష్యమినక్షత్రం రోజు పుష్టి, ఆ శ్లేషలో పెడితే సుపుత్రుడు మఘానక్షత్రంలో జనపూజ్యత, పూర్వ ఫల్గుణిలో శ్రాద్ధం పెడితే సౌభాగ్యలాభం కలుగుతాయి. ఉత్తర ఫల్గుణిలో దానశీలుడైన పుత్రుడు జన్మిస్తాడు. హస్తానక్షత్రంలో పెడితే అందరికన్నా గొప్పవాడవుతాడు.

చిత్తా నక్షత్రంలో శ్రాద్ధం పెడితే అందమైన కుమారుడు పుడతాడు. స్వాతి నాడు పెడితే వాణిజ్యలాభం, కౌమార్యసిద్ధి కలుగుతుంది. అనూరాధా నక్షత్రంలో శ్రాద్ధంపెడితే ఆరోగ్య లాభం, పూర్వాషాఢలో పెడితే కీర్తి ప్రతిష్టలు, ఉత్తరాషాఢలో పెడితే శోక రాహిత్యం, శ్రవణానక్షత్రంలో శ్రాద్ధం పెడితే శుభలోక ప్రాప్తి కలుగుతాయి. ధనిష్ఠా నక్షత్రంలో శ్రాద్ధకర్మని ఆచరించినవాడు మహాధనవంతుడవుతాడు. అభిజన్మనక్షత్రం నాడు చేస్తే సమస్త వేదవిద్యని పొందుతాడు. శతభిషానక్షత్రం రోజు శ్రాద్ధ కర్మ చేస్తే వైద్యశాస్త్రంలో ప్రావీణ్యత కలుగుతుంది. పూర్వాభాద్ర నక్షత్రం నాడు చేస్తే గొర్రెలు లభిస్తాయి. ఉత్తరాభాద్రలో విద్యాప్రాప్తి, గోలాభం కలుగుతాయి. రేవతీ నక్షత్రం నాడు శ్రాద్ధం చేస్తే సువర్ణ, రజత లాభం కలుగుతుంది. అశ్వనీ నక్షత్రం రోజు శ్రాద్ధం పెడితే అశ్వాలు లభిస్తాయి. భరణీ నక్షత్రం నాడు పెడితే దీర్ఘాయుర్దాయం కలుగుతుంది. నాయనా! ఈ విధంగా మానవుడు తన కామ్యాన్ని అనుసరించి ఆయా తిథుల్లో, నక్షత్రాల్లో శ్రాద్ధవిధిని శ్రద్ధగా ఆచరిస్తే తన కోరికల్ని సఫలం చేసుకోగలడు.

## దత్తాత్రేయుడు బోధించిన యోగవిద్య

**మ**దాలస కుమారుడైన అలర్కుడికి దత్తాత్రేయుడు యోగవిద్యను గురించి ఇలా చెప్పాడు. అలర్కా! యోగం అభ్యసించే పురుషుడికి జ్ఞానం కలిగి అజ్ఞానం తొలగిపోతుంది. తద్వారా ముక్తి లభిస్తుంది. మోక్షాన్ని కోరుకునే పురుషుడు దుస్సాంగత్యాన్ని విడచిపెట్టాలి. అలాచేస్తే అతడికి మమకారం తొలగిపోతుంది. మమకారం లేకపోవటమే సుఖానికి కారణం. పురుషుడు వైరాగ్యాన్ని పొందటం ద్వారా సంసారం అనేది అశాశ్వతమైనదని తెలుసుకుంటాడు. జ్ఞానం ద్వారా ఎలా వైరాగ్యం కలుగుతుందో అలాగే వైరాగ్యం ద్వారా కూడా జ్ఞానం కలుగుతుంది.

అలర్కా ! ఇపుడు నీకు యోగం గురిచి చెబుతా విను. యోగాభ్యాసం వల్ల శాశ్వతమైన బ్రహ్మత్వాన్ని యోగి పొందగలుగుతాడు. యోగి కావాలంటే

ముందుగా ఆత్మని జయించాలి. దాన్ని జయించటానికి తగిన ప్రయత్నం చేయాలి. ప్రాణాయామం ద్వారా దోషాలని, ధారణ ద్వారా పాపాలని ప్రత్యాహారం ద్వారా విషయాలని, ధ్యానం ద్వారా ఈశ్వర రహితమైన గుణాలని దగ్ధం చేయాలి. ఏవిధంగా నైతే అగ్ని పర్వతాలలోని ధాతువుల మలాన్ని దహించి నిర్దోషాన్ని పొందుతుందో అదేవిధంగా ప్రాణాయామం చేయటం ద్వారా ఇంద్రియాల ద్వారా చేసిన సమస్త దోషాలూ దగ్ధమైపోతాయి.

యోగి మొదట ప్రాణాయామాన్ని చేయాలి. ప్రాణం–అపానం ఈ రెండు వాయువుల నిరోధమే ప్రాణాయామం అని చెప్పబడుతుంది. అలార్కా! ఈ ప్రాణాయామం 1.లఘువు 2.మధ్యమ 3.ఉత్తరీయ అని మూడు విధాలుగా వుంటుంది. ఈ మూడు రకాల ప్రాణాయామాల ప్రమాణం ఇలా వుంటుంది. 1.లఘు ప్రాణాయామం ద్వాదశ (12) మాత్రల కాలం ఉంటుంది. 2.మధ్యమ ప్రాణాయామం దీనికి ద్విగుణంగా అనగా (24) మాత్రల కాలం వుంటుంది. 3.మూడోదైన ఉత్తరీయ ప్రాణాయామం రెండోదాని కన్నా త్రిగుణాత్మకంగా అంటే 72 మాత్రల కాలం వుంటుంది.

నిమేషం ఉన్మేషం ఈ రెండింటి కాలాన్ని కలిపి ఒక మాత్రాకాలం అంటారు. ఈ విధంగా పన్నెండుమాత్రల కాలంలో చేసేదాన్ని లఘు ప్రాణాయామం అంటారు. మొదటి ప్రాణాయామం చేయటం ద్వారా చెమటని, రెండో ప్రాణాయామం ద్వారా వణకటాన్ని, మూడో ప్రాణాయామం ద్వారా విషాదాది దోషాల్ని తొలగించుకోవాలి.

సింహం, పులి, ఏనుగు ఏవిధంగా క్రమశిక్షణ ద్వారా సౌమ్యంగా మారి లోబడి వుంటున్నాయో అదేవిధంగా ప్రాణాయామం ద్వారా లోపలున్న ప్రాణాలు యోగికి వశమై వుంటాయి. మావటివాడు తను వశం చేసుకున్న ఏనుగుని ఏవిధంగా తన ఇష్టానుసారం నడిపిస్తాడో అదేవిధంగా యోగి కూడా ప్రాణాన్ని వశం చేసుకుని దాన్ని ఇష్టానుసారం నడిపించగలడు. క్రమశిక్షణ పొందిన సింహం మనుషుల్ని చంపకుండా ఎలా మృగాలనే చంపుతుందో,

అదేవిధంగా, యోగి చేసిన ప్రాణాయామ సాధన అతడి శరీరాన్ని నష్టపరచకుండా కేవలం అతడి పాపాల్ని మాత్రమే నశింపచేస్తుంది. అలర్కా! అందుకే యోగులు నిత్యం ప్రాణాయామాన్ని చేస్తూ వుంటారు. ఈ ప్రాణాయామానికి ముక్తి ఫలాన్నిచ్చే నాలుగు రకాల అవస్థలున్నాయి చెబుతున్నా విను.

ప్రాణాయామం 1.ధ్వస్తి. 2.ప్రాప్తి 3.సంవిత్ 4.ప్రసాదం అని నాలుగు విధాలుగా వుంటుంది. క్రమంగా వీటి స్వరూపం ఏ విధంగా వుంటుందో వర్ణిస్తాను. 1.ఏ అవస్థలో మంచి చెడు ఈ రెండింటి ద్వారా చేసే సమస్త క్రియలు వాటి ఫలితాలు క్షయమై పోతాయో, దానితోపాటు చిత్త మాలిన్యం తొలగిపోతుందో దానిని 'ధ్వస్తి' అంటారు. 2.యోగి అయినవాడు ఎలాంటి పరిస్థితిలో లోభమోహాత్మకమైన ఐహిక ఆముష్మిక కోరికల్ని స్వయంగా నిరోధించగలుగుతున్నాడో ఆ అవస్థని 'ప్రాప్తి' అంటారు. 3.యోగులు ఏ స్థితిలో, జ్ఞానం పొందటం ద్వారా, చంద్ర, సూర్య, గ్రహ, నక్షత్రాలతో సమానమైన జ్ఞానసంపద పొందగలుగుతారో అదే విధంగా అతీత, అనాగత, అంతర్ధాన, దూరస్థమైన అన్ని విషయాలనీ తెలుసుకోగలుగుతున్నారో ఆ స్థితిని 'సంవిత్' అంటారు. 4. ఎలాంటి స్థితిలో యోగి మనస్సు పంచవాయువులు, ఇంద్రియాలు, వాటి విషయ సమూహాలు శుద్ధి కలిగివుంటాయో, ఆ స్థితిని ప్రసాదం అంటారు.

అలర్కా! ఇపుడు నీకు ప్రాణాయ లక్షణం, యోగం చేయటానికి ఏఏ ఆసనాలు హితకరంగా వుంటాయో చెబుతున్నాను విను. పద్మాసనం, అర్ధాసనం, స్వస్తికాసనం వీటిలో ఏదో ఒక ఆసనాన్ని ఎంచుకొని హృదయంలో ఓంకారాన్ని జపిస్తూ యోగాన్ని అనుష్టించాలి. పరిశుద్ధమైన మనసుతో సమానంగా స్థిరంగా కూర్చొని రెండు పాదాలు ముడుచుకుని, నోటిని మూసుకుని, రెండు తొడల్ని బాగా విశాలంగా చాపి సుఖంగా కూర్చోవాలి. ఆ సమయంలో చేత్తో లింగాన్ని అండకోశాన్ని తాకకూడదు. తల కొంచెం పైకెత్తాలి. నోటిలోపలి నాలుకతో పళ్ళని తాకకూడదు. దృష్టిని నాసిక అగ్రభాగాన్నే వుంచాలి.

అటూ ఇటూ చూడకూడదు. ఇలాంటి స్థితిలో యోగాభ్యాసం చేసేవాడు రజోగుణంతో తామసవృత్తిని నాశనం చేసి కేవలం నిర్మలంగా యోగాభ్యాసం చేయటంలో నిమగ్నుడు  కావాలి. ఇలా ప్రాణాయామం చేసిన తరువాత ప్రత్యాహారాన్ని, ధారణని చేయాలి. ఈ విధంగా నియమపూర్వకంగా గురువు మార్గదర్శకత్వంలో యోగసాధన చేసిన వాడి సమస్త పాపాలూ దగ్ధమైపోతాయి.

నియతాత్ముడైన పురుషుడు ఏ అవస్థలో  ఇంద్రియసమూహాలని శబ్దాది విషయాలనుంచి ప్రత్యాహరణ చేస్తున్నాడో దాన్ని ప్రత్యాహారం అంటారు. యోగికి దేని ద్వారా మనోధారణ కలుగుతుందో దాన్ని ధారణ అంటారు. నియమపూర్వకంగా యోగసాధనచేసే యోగికి వ్యాధులు సంక్రమించవు. యోగం చేసేవాడు ఎలాంటి శ్రమపడకుండా వాయువుని పానం చేయాలి. తాను పానం చేసిన వాయువుని మొదట నాభి, తరువాత హృదయం, వక్షఃస్థలం తిరిగి కంఠం, ఆపై నాసాగ్రం, తరువాత నేత్రాలు, దాని తరువాత భ్రూమధ్యం దానిపైన మూర్ధన్యం, చివరగా బ్రహ్మరంధ్రంలో ధారణ చేయాలి. ఈ ధారణ అనేది పది విధాలుగా వుంటుంది. ధారణ గనుక సిద్ధిస్తే యోగి బ్రహ్మ స్థితిని పొందుతాడు.

**యోగాభ్యాసం ఎక్కడ చేయకూడదు :** అతి చల్లదనం, అతి వేడి, అతిగా వీచే గాలి వున్న ప్రదేశాలలో ధ్యానంతో కూడిన యోగాన్ని చేయకూడదు. అదేవిధంగా  గట్టిగా శబ్దాలు వినిపించే చోట, నిప్పు, నీటి సమీపంలో ప్రాచీన గోశాలల్లో, నాలుగు దారుల కూడళ్ళలో, ఎండిన ఆకులతో నిండిన ప్రదేశాలలో, నదీతీరాలలో, పాములు సంచరించే ప్రదేశాలలో, బావి ప్రక్కన, చైత్య వృక్షం ప్రక్కన, గుట్టల మధ్యన, యోగాభ్యాసం చేయకూడదు. సాత్త్వికభావం కలగని ప్రదేశాలలో అసలు యోగాన్ని చేయకూడదు. యోగం చేసేవాడు చెడు విషయాల్ని వినటం, చూడటం చేయకూడదు. ఎవడైతే మూర్ఖంగా మంచి స్థానాన్ని ఎన్నుకోకుండా యోగాభ్యాసాన్ని చేస్తాడో ఆ వ్యక్తిలో ఎన్నో దోషాలు ఉద్భవిస్తాయి. అవి ఏమంటే? చెవిటితనం, జడత్త్వం, మూగతనం, జ్ఞాపకశక్తి లోపం, అంధత్వం, తక్షణజ్వరం వంటివి కలుగుతాయి.

ప్రమాదవశాన పై తెలిపిన వ్యాధులన్నీ యోగం చేసేవాడికి సంక్రమిస్తే ఈ విధంగా చికిత్స చేయాలి. బాగా వేడిచేసిన యవాసని (గంజిని) బాగా స్నిగ్ధం చేసి భక్షణపూర్వకంగా కడుపులో ధారణ చేయాలి. దీనివల్ల వాతం, గుల్మం, అజీర్ణం వంటి వ్యాధుల నుంచి ఉపశమనం లభిస్తుంది. ఈ యవాగుని తినటం వల్ల వాయు రోగాలు, వాయుగ్రంథి రోగాలు కూడా నశిస్తాయి. మనస్సు చంచలంగా వున్నప్పుడు గట్టిగా కళ్ళు మూసుకుని ఒక పెద్ద మహాపర్వ తన శిఖరాన్ని మనసులో స్థిరంగా ధారణ చేయాలి. అదేవిధంగా కంపనం కలుగుతున్నప్పుడు కూడా పెద్ద పర్వతాన్ని ధారణ చేయాలి. మాటపడిపోతే మాటని మనసులో ధారణ చేయాలి. అదేవిధంగా వినిపించకపోతే శ్రవణేంద్రియాన్ని ధారణ చేయాలి. ఈ విధంగా అంతఃకరణ ద్వారా శరీరాన్ని రక్షించుకోవటం యోగికి ప్రథమకర్తవ్యం. ఎందుకంటే శరీరమే ధర్మార్ధకామ మోక్షాలకి కారణం.

**యోగసిద్ధి :** అలర్కా! మంచి ఆరోగ్యం, శరీరం నుంచి సువాసనలు రావటం, మూత్రం, మలం అతి స్వల్పంగా రావటం, తేజస్సు, మధురమైన కంఠస్వరం ఇవన్నీ యోగం సిద్ధించినవాడికి వచ్చే ప్రథమ లక్షణాలు. ఆత్మ దర్శనమైనప్పుడు యోగులకి ఎన్నో రకాల కోరికలు కలుగుతాయి. మనస్సు భ్రాంతికి లోనై వివిధ భోగాల్ని అనుభవించాలనే కోరిక యోగికి కలుగుతుంది. స్త్రీ, దానం, ఫలం, విద్య, మాయా బావిలోని నీరు, ధనం, స్వర్గం, అమరత్వం ఇంద్రపదవి, వివిధ రకాల రసాయనాలు, ఆకాశగమనం, యజ్ఞం, అగ్ని ప్రవేశం, జలప్రవేశం, శ్రాద్ధం వంటి విషయాల మీద యోగికి కోరికలు పుడతాయి. ఆ సమయంలో యోగి ఉపవాసం దేవతార్చన చేయాలి. తనకి కోరికలు కలిగినప్పుడు ప్రయత్నపూర్వకంగా తన దృష్టిని వాటినుంచి ప్రక్కకి మరల్చాలి. మనస్సుని గనుక పరబ్రహ్మమీద లగ్నం చేస్తే కోరికలు కలుగవు.

**యోగి కర్తవ్యాలు :** అలర్కా! యోగికి మానం అవమానం అనే రెండూ ప్రీతికీ, ఉద్వేగానికి కారణమవుతున్నాయి. నిజమైన యోగి మానాన్ని– అవమానంగా, అవమానాన్ని – మానంగా తలిస్తే స్థితి పొందుతాడు.

మానవమానాలు రెండూ అమృతం విషాలతో పోల్చబడ్డాయి. యోగి విషాన్ని అమృతంలా, అమృతాన్ని విషంలా భావించాలి. యోగాభ్యాసం చేసేవాడు. పవిత్రమైన ప్రదేశాలలోనే సంచరించాలి. నీటిని వస్త్రంతో వడకట్టుకుని త్రాగాలి. ఎప్పుడూ సత్యమైన ప్రియమైన వాక్యాలనే మాట్లాడాలి. మంచి బుద్ధితో ఆలోచించాలి. యోగి ఎప్పుడూ ఆతిథ్య శ్రాద్ధ, యాత్రా, మహోత్సవాలకి వెళ్ళకూడదు.

యోగి గృహస్థుల ఇంటికి భిక్ష కోసం వెళ్ళాలి. అదీ ఆ గృహస్థులు భోజనం చేసి నిశ్చితంగా వున్న సమయంలోనే వెళ్ళాలి. ప్రతిరోజూ వెళ్ళిన ఇంటికే వెళ్ళకూడదు. ఏ గృహస్థుడైతే గుణశీలాలతో వుంటాడో శ్రోత్రియంగా వుంటాడో అలాంటివాడి ఇంటికే భిక్షకి వెళ్ళాలి. గంజి, మజ్జిగ, పాలు, కొర్రలు, నూకలు, తెలకపిండి, సత్తుపిండి, ఈ వస్తువుల్ని యోగి తన భిక్షగా స్వీకరించాలి. ఇవీన్న పవిత్రమైనవి యోగ సిద్ధిని కలుగచేసేవి. యోగి భోజనం చేయటానికి ముందు మొదట ఒకసారి నీటిని త్రాగి సావధానంగా 'ప్రాణాయస్వాహా' అని చెప్పి ఆహారాన్ని స్వీకరించాలి. దీన్ని మొదటి ఆహుతి అంటారు. ఇలా క్రమంగా 'అపానాయాస్వాహా' సమానాయస్వాహా' 'ఉదానాయాస్వాహా' 'వ్యానాయాస్వాహా' అని అయిదు ఆహుతుల్ని స్వీకరించాలి. తరువాత యధేచ్ఛగా భోజనం చేయాలి. భోజనం పూర్తి చేసాక నీటిని తాగి ఆచమనం చేసి తన హృదయాన్ని స్పృశించాలి.

అస్తేయం, బ్రహ్మచర్యం, త్యాగం, లోభం లేకపోవటం, అహింస అనే ఈ అయిదు యోగికి పరవ్రతాలు. అలాగే క్రోధం, న్యూనత్వం, గురుసేవ శౌచం, అల్పాహారం, వేదాధ్యయనం ఈ అయిదూ యోగి కి నిత్యనియమాలు. యోగి నిర్జన ప్రదేశంలో గాని, గుహల్లోకానీ, అడవుల్లో కానీ విధి విధానంగా తన యోగ సాధన చేసుకోవాలి. వాగ్దండం. 2. కర్మదండం 3. మనోదండం ఈ మూడూ ఎవరి వశంలో వుంటాయో అలాంటి వారినే త్రిదండి మహాయతి" అంటారు. ఎవరైతే ఇంద్రియాల్ని జయించి నియమితమైన కర్తవ్యాల్ని ఆచరిస్తూ యోగసాధన చేస్తాడో ఆ యోగి ముక్తిని పొందుతాడు.

# గంగావతరణం

**మా**ర్కండేయ మహర్షి క్రౌష్టికి మునితో గంగావతరణం గురించి ఇలా చెబుతున్నాడు. "విప్రోత్తమా! నారాయణుడికి సంబంధించిన ధ్రువపథం నుంచి త్రిపథగామిని అయిన గంగాదేవి ఆవిర్భవించింది. అక్కడినుంచి ఆ గంగ చంద్రుడి మీద పడి అక్కడ సూర్యుడి కిరణాలతో కలిసి అతి పవిత్రమైన మేరు పర్వతం మీదకి చేరింది. ఆ మేరు పర్వతం నుంచి గంగా నది నాలుగు ధారలుగా ప్రవహించింది. అలా ప్రవహించిన గంగానది తన అపార నీటిధారలతో కొండశిలల్ని భేదిస్తూ నాలుగు దిక్కులా ప్రవహించింది. గంగమందర పర్వతం మీదుగా తూర్పు దిశలో ప్రవహిస్తూ చైత్రరథం వనం వైపుగా వెళ్ళింది. అలా వెళ్ళిన జలధార 'సీత' అనే పేరుతో ప్రసిద్ధి చెందింది. 'సీత' అనే పేరుతో వున్న ఆ గంగ అక్కడనుంచి వరుణోదర సరోవరంలోకి వెళ్ళింది. అక్కడినుంచి ఎన్నో పర్వతాల్ని భూమి మీద భద్రాశ్వవర్షం గుండా ప్రవహించి సముద్రంలో కలిసింది.

సుమేరు పర్వతం దక్షిణభాగం నుంచి గంధమాదన పర్వతం మీదుగా పడే గంగని 'అలకనందా' అంటారు. ఈ అలకనందా నది మేరు పర్వతానికి సమీపంలో వున్న దేవతలందరికీ ఆహ్లాదాన్ని కలిగిస్తూ నందనవనంలోకి వెళ్ళి మహావేగంగా అక్కడినుండి మానససరోవరంలోకి ప్రవహించి, అక్కడనుంచి రమ్య పర్వతశిఖరాల మీదుగా దక్షిణంలో వున్న అన్ని పర్వతాలనీ తాకుతూ మహాపర్వతమైన హిమాలయం మీదకి ప్రవహిస్తుంది. ఆ పర్వతం మీద మహాదేవుడైన పరమేశ్వరుడు తనవైపు వచ్చిన గంగని పట్టి సిగలో ధరించాడు. ఆయన ఆ నీటిని విడవలేదు. తరువాత భగీరథ చక్రవర్తి ఎంతో గొప్ప తపస్సు చేసి పరమేశ్వరుణ్ణి సంతోష పరచగా ఆయన దయతలచి తన సిగలో వున్న గంగని విడిచిపెట్టాడు. పరమేశ్వరుడి సిగనుంచి విడివడ్డ గంగానది అక్కడినుంచి ఏడు పాయలుగా ప్రవహించి దక్షిణసముద్రంలో కలిసింది. ఈ ఏడు ధారల్లో మూడు ధారలు తూర్పుగా ప్రవహించి సముద్రంలో కలవగా ఒక్క ధార మాత్రం భగీరథుడి వెంట ప్రవహించి దక్షిణసముద్రంలో కలిసింది.

సుమేరు పర్వతం పడమర దిక్కునుంచి విపుల పాదాలతో ప్రవహించే గంగానది పేరు "సుచక్షువు" ఆ నది ఆది పర్వతం మీద వున్న వైభాజవనాన్ని పవిత్రం చేసి, అక్కడనుంచి వెళ్ళి "శీతోదక సంహారాన్ని" చేరింది. దాని నుంచి క్రమంగా అన్ని పర్వత శిఖరాలనీ తాకుతూ కేతమాల వర్షంలోకి చేరింది. అక్కడనుంచి ప్రవహించి సరాసరి దక్షిణ సముద్రంలో కలిసింది. మేరు పర్వతం ఉత్తరభాగం నుంచి ప్రవహించే ధారకి 'భద్రసోమ' అని పేరు. ఈ నది ఋషభాద్రి పర్వతం మీదుగా ప్రవహించి సవితృవనాన్ని చేరింది. ఆ వనాన్ని పవిత్రం చేసి, అక్కడనుంచి సరాసరి మహాభద్ర సరోవరంలోకి చేరింది. తరువాత శంఖచూడ పర్వతం మీదుగా ప్రవహిస్తూ ఉత్తర కురు దేశాలని పవిత్రం చేసి మహాసాగరంలో కలిసిపోయింది. ఓ విప్రోత్తమా! ఈ విధంగా నీకు గంగానదికి సంబంధించిన అన్ని విషయాలూ చెప్పాను అన్నాడు మార్కండేయ మహర్షి.

## భరతవర్షం - నదులు

**భరతవర్షం :** భరత వర్షంలో తొమ్మిది భేదాలున్నాయి. అవన్నీ సముద్రంతో కూడా పరస్పరం అగమ్యంగా వుంటాయి. 1. ఇంద్రద్వీపం 2.కశేరుమాన్ ద్వీపం 3.తామ్రవర్ణద్వీపం 4.గభస్తిమాన్ ద్వీపం 5.నాగద్వీపం 6.సౌమ్యద్వీపం 7.గాంధర్వద్వీపం 8.వారుణద్వీపం 9.భరతద్వీపం భరతం అన్న ఈ తొమ్మిదో ద్వీపం సముద్రంతో చుట్టబడింది. ఇది ఉత్తర దక్షిణాలుగా వెయ్యి యోజనాల విస్తీర్ణంలో ఉంది. ఈ ద్వీపానికి తూర్పు భాగంలో కిరాతులు, పశ్చిమసరిహద్దుల్లో యవనులు నివసిస్తారు. బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్ర గణాలు ఈ ద్వీపానికి మధ్యభాగంలో నివసిస్తారు. వీరంతా యజ్ఞం అధ్యయనం, వాణిజ్యం, కర్షకత్వం అనే పనులు చేస్తూ పవిత్రులై వుంటారు.

ఈ భరత వర్షంలో 1.మహేంద్ర 2.లయ 3.సహ్య 4.శక్తిమాన్ 5.ఋక్ష 6.వింధ్య 7.పారియాత్ర అనే పేరుతో ఏడుకుల పర్వతాలున్నాయి. ఈ కులపర్వతాలే కాక ఏన్నో వేల ఇతర పర్వతాలు కూడా ఉన్నాయి. వీటిలో ప్రధానమైనవి.

కోలాహల, వైభ్రాజ, మందర, దర్దుర, వాతస్వన, వైద్యుత, మైనాక, స్వరస, తుంగప్రస్థ, నాగగిరి, రోచన, పాండుర, పుష్ప, దుర్జయంత, రైవతక, అద్భుద, ఋష్యమూక, గోమంత, కూటశైల, కృతస్మర, శ్రీపర్వత, చకోర పర్వతాలున్నాయి. ఈ పర్వతాలన్నీ ఎంతో ఎత్తుగా మనోహరంగా వుంటాయి. ఈ పర్వత పాదాలలో ఎన్నో వందల జనపదాలున్నాయి. ఈ జనపదాలలో మ్లేచ్ఛులు, ఆర్యులు అనే విభాగాలున్నాయి. ఈ జనపదాలలో నివసించే ప్రజలు ఎంతో శ్రేష్టమైన నదుల్లోని నీళ్ళని త్రాగి జీవిస్తున్నారు.

**నదులు :** గంగా, సరస్వతి, సింధు, చంద్రభాగ, యమున, శతద్రు, వితస్త, ఇరావతి, కుహు, గోమతి, ధూతపాప, బహుద, దృషద్వతి, విపాశ, దేవిక రంక్షు, నిశ్చీరా, గండకీ, కౌశికీ ఈ నదులన్నీ హిమాలయ సమీపంలో వున్న వివిధ పర్వతాల నుంచి జన్మిస్తున్నాయి.

వేదస్మృతి, వేదవతి, వృతఘ్ని, సింధు, వేణా, సానందన, సదానీర, మహీ, పార, చర్మణ్వతీ, నూపీ, విదిశ, వేత్రవతి, క్షిప్ర, అవంతి. ఈ నదులన్నీ పారియాత్రా పర్వతం నుంచి ఆవిర్భవిస్తున్నాయి.

మహానది, శోణా, నర్మదా, సురథాద్రి నుంచి జన్మించగా, మందాకినీ, దశవర్ణా నదులు చిత్రకూట పర్వతం నుంచి పుడుతున్నాయి. చిత్రోత్పలా, తమసా, కరమోదా, పిశాచికా, పిప్పలా, శ్రోణీ, విపాశా, మంజులా, సుమేరుజా, శుక్తిమతీ, నకులీ, త్రిదివా, ఆక్రమా అనే ఈ దివ్యనదులన్నీ ఋక్షపర్వత సానువుల నుంచి ఉద్భవిస్తున్నాయి. అలాగే వింధ్యపర్వత పాదాల నుంచి వరుసగా, క్షిప్రా, పయోష్ణీ, నిర్వింధ్యా, తాపీ, నిషధావతీ, వేణ్యా, వైతరణీ, సినీవాలీ, కుముద్వతీ, కరతోయా, మహాగౌరీ, దుర్గా, అంతఃశివా అనే పుణ్యనదులు ప్రవహిస్తున్నాయి. వీటితోపాటు గోదావరీ, భీవరథీ, కృష్ణా, వేణ్యా, తుంగభద్రా, సప్రయోగా, వాహ్యా, కావేరీ ఇవి కూడా వింధ్య పర్వతం నుంచే ఆవిర్భవిస్తున్నాయి.

ఇక మలయపర్వతం నుంచి కృతమాలా, తామ్రపర్ణీ, పుష్పజా, ఉత్పలావతీ నదులు పుట్టగా, మలయాద్రి పర్వతం నుంచి పితృకుల్యా, సోమకుల్యా, ఋషికుల్యా, ఇక్షుకుల్యా, త్రిదివా అనే నదులు జన్మిస్తున్నాయి. అలాగే లాంగూలినీ, వంశకరా అనే పేర్లుగల నదులు మహేంద్ర పర్వతం నుంచి ప్రవహిస్తున్నాయి. శుక్తిమత్ పర్వతం నుంచి కుమారీ, మందగా, మందవాహినీ, కుశా, పలాశనీ నదులు వెలువడుతున్నాయి. ఈ నదులన్నీ ఎంతో పవిత్రమైనవి. నిండుగా జలం కలిగినవి. వీటిలో ఎన్నో నదులు గంగలో కలవగా మరికొన్ని సరాసరి సముద్రంలో కలుస్తున్నాయి. ఈ నదులన్నీ ప్రపంచానికి తల్లిలాంటివి. ఇవేకాక ఇంకా ఎన్నోవేల చిన్నచిన్న నదులున్నాయి. వీటిలో కొన్ని వర్షాకాలంలోనే నీటితో నిండి వుంటే మరికొన్ని నదుల్లో ఎప్పుడూ నీరు వుంటుంది.

## స్వాయంభువ మన్వంతరం

**మా**ర్కండేయ మహర్షి క్రౌష్టుకి మునికి మొదటిదైన స్వాయంభువ మన్వంతరగాథని చెబుతున్నాడు. మన్వంతరాలు మొత్తం పద్నాలుగు. వీటిలో మొదటిది స్వాయంభువ మన్వంతరం. ఒక్కో మన్వంతరం డెబ్బై ఒక మహాయుగాల, ముప్పైకోట్ల అరవై ఏడులక్షల ఇరవైవేల వర్షాల మానవుల సంవత్సర కాలం వుంటుంది. దేవ కాలమానం ప్రకారం ఎనిమిది లక్షల ఏభై రెండువేల సంవత్సరాలు గడిస్తే ఒక మన్వంతరం గడిచిపోతుంది.

ఈ మన్వంతరాలు వరుసగా 1.స్వాయంభువ 2.స్వారోచిష 3.ఉత్తమ 4.తామస 5.రైవత 6.చాక్షుష 7.వైవస్వత 8.సావర్ణి 9.దక్షసావర్ణి 10.బ్రహ్మసావర్ణి 11.ధర్మసావర్ణి 12.రుద్రసావర్ణి 13.రౌచ్యసావర్ణి 14.భౌమ్య అని వుంటాయి. ప్రస్తుతం వైవస్వత మన్వంతరం జరుగుతోంది.

ఈ మన్వంతరంలో స్వాయంభువ మనువుకి పదిమంది పుత్రులు జన్మించారు. వారంతా తండ్రితో సమానమైన బలపరాక్రమాలు కలిగినవారు. ఆ పదిమంది కుమారులు ఈ భూమండలాన్ని ఏడుద్వీపాలుగా, పర్వతాలతో,

సముద్రాలతో వర్ష విభాగాలుగా చేసారు. ఆనాటినుంచి వారు వంశ పరంపరగా స్వాయంభువ మన్వంతరంలో సప్తద్వీపాలతో వున్న ఈ భూమండలాన్నంతా పాలించసాగారు.

## స్వారోచిష మన్వంతరం

**మా**ర్కండేయ మహర్షి క్రౌష్టుకుడికి స్వారోచిష మన్వంతర విశేషాలు గురించి ఇలా వివరిస్తున్నాడు. ఓ విప్రుడా! పూర్వం అశ్వనీకుమారుల కంటే అందగాడు, శాంతస్వభావుడు, సచ్ఛరిత్రుడు, వేదవేదాంగ పారంగతుడైన ఒక బ్రాహ్మణుడు వరుణానది ఒడ్డున వున్న అరుణాస్పదం అనే గ్రామంలో నివసిస్తున్నాడు.

ఆ విప్రుడి పేరు ప్రవరుడు. అతడెప్పుడూ ప్రసన్నంగా వుండేవాడు. అతిథిసేవ చేయటమంటే అతడికి ఎంతో మక్కువ. అర్ధరాత్రి అతిథులు వచ్చినా ఏమాత్రం అశ్రద్ధ చూపకుండా వారిని ఆదరించేవాడు. అతడికి మనసులో చిరకాలంగా ఒక కోరిక వుండిపోయింది. అదేమిటంటే! చక్కని నదీ నదాలతో, ఉద్యానవనాలతో రమణీయంగా వున్న ఈ భూమండలంలోని సుందర ప్రదేశాలు చూడాలని. ఒకనాడు ఔషధ విజ్ఞానం బాగా తెలిసినవాడు మంత్రతంత్ర పారంగతుడైన ఒక అతిథి అతడి ఇంటికి వచ్చాడు. వచ్చిన అతిథికి అన్ని సేవలు చేసిన తరువాత ఆ ప్రవరుడికి, వచ్చిన అతిథి తాను చూసిన ఎన్నో దివ్యసుందర ప్రదేశాల గురించి అందంగా వర్ణించి చెప్పాడు. ఆ విశేషాలన్నీ విన్న ప్రవరుడు ఎంతో ఆనందంతో ఆశ్చర్యంతో "ఓ మహానుభావా! తమరు ఎన్నో దేశాలు పర్యటించానని చెప్పారు. అయితే తమరిలో ఏమాత్రం అలసటన్నదే కనిపించటం లేదు. తమను చూస్తేనేమో మధ్య వయస్కులుగా వున్నారు. ఇంత కొద్దికాలంలో ఇన్ని దేశాలు, ప్రదేశాలు ఎలా మీరు పర్యటించగలిగారు" అని ప్రశ్నించాడు.

ఓ విప్రవరా! నేను మంత్ర ఔషధుల ప్రభావంతో అప్రతిహతమైన వేగంతో ఒక్క రోజులోనే వేల యోజనాల దూరం ప్రయాణం చేయగలను"

అన్నాడు. అదివిని ప్రవరుడు ఎంతో ఆనందపడి ఆయనతో "స్వామీ! నాకు కూడా ఈ భూమండలంలోని సుందర ప్రదేశాలు చూడాలని కోరిక, తమరు దయచేసి నాకు కూడా లేపనాన్ని ప్రసాదించండి అని కోరాడు. సరేనన్న అతిథి తన దగ్గరున్న లేపనాన్ని ప్రవరుడి పాదాలకి పూసాడు. దానితో పాటు అన్ని దిక్కుల్నీ అభిమంత్రించి ఆ మంత్రాన్ని కూడా అతడికి ఉపదేశించాడు.

**ప్రవరుడి హిమాలయ గమనం :** ప్రవరుడు పాదలేపనం చేసిన కొద్దిసేపటికే అక్కడ నుంచి బయలుదేరి హిమాలయ పర్వతాలు చూడటానికి వెళ్ళాడు. అన్ని వేల యోజనాల దూరంలో వున్న హిమాలయాల్ని చాలా కొద్దిసేపట్లోనే వచ్చి చేరాడు. తన మనసులో కోరిక తీరుతున్నందుకు సంతోషిస్తూ ఆ పర్వతం మీద ఉల్లాసంగా సంచరించసాగాడు. అయితే అధికంగా వున్న మంచు కారణంగా ప్రవరుడి పాదాలకి వున్న లేపనం పూర్తిగా కరిగిపోయింది. ఆ విషయాన్ని అతడు గమనించలేదు. ఆ దివ్యపర్వతం మీద విహరిస్తున్న సిద్ధులు, యక్షులు, గంధర్వులు, కిన్నెరులు, అప్సరసలు ఇలా ఎంతోమందిని దర్శించాడు.

ఆ దివ్య హిమాలయాల్లో ప్రవహించే అందమైన నదీ తరంగాలని, వివిధ రకాల పక్షుల క్రీంకారాల్ని కిలకిల రావాలనీ వింటూ తిరుగుతున్నాడు. ఇలా దివ్య సుగంధ వృక్షాలతో నిండిన ఆ సుందర హిమగిరి శిఖరాల్ని చూసి ఆనందించిన ప్రవరుడు తనలో "ఇక ఈ రోజుకి తిరిగింది, చూసింది చాలు, మరల రేపు వచ్చి మిగిలిన అన్ని ప్రాంతాలూ చూస్తాను" అని అనుకుని ఇంటికి వెళ్ళటానికి సంసిద్ధుడయ్యాడు. అయితే అతడి పాదలేపనం కరిగిపోవటం వల్ల అక్కడ నుంచి ఒక్క అడుగు కూడా కదపలేకపోయాడు. "అయ్యో! ఎంతపని జరిగింది. నా పాదలేపనం కరిగిపోయిందే నా ఇల్లు ఎంతో దూరంలో వుంది. నేనక్కడికి ఎలా వెళ్ళగలను? నేను నిత్యాగ్నిహోత్ర నిరతుడినే, ఈ చల్లటి ప్రదేశంలో అగ్నిహోత్రం ఎలా చేయగలను? అలా నేను చేయకపోతే నేనిప్పటిదాకా చేసిన కర్మఫలమంతా నశించిపోతుందే!" అని చింతించాడు.

కొద్దిసేపటికి తమాయించుకుని "ఈ పర్వతం మీద బాగా వెతికితే ఎవరైనా సిద్ధపురుషుడు కనిపించకపోడు, ఆయన్ని ప్రార్థించి నా ఇంటికి చేరే ఉపాయాన్ని తెలుసుకుంటా" అని అనుకుని ఆ పరిసర ప్రాంతాల్లో సంచరించసాగాడు.

**వరూథినీ సమాగమం :** ప్రవరుడు ఆవిధంగా సిద్ధపురుషుణ్ణి వెతుకుతూ, హిమాలయాల్లో సంచరిస్తుండగా, అప్సరసల్లో ఎంతో గొప్పది, మహా సౌందర్యరాశి అయిన వరూథిని అనే దివ్యసుందరి ప్రవరుణ్ణి చూసింది. బ్రహ్మవర్చస్సుతో వెలిగిపోతున్న ఆ విప్రుణ్ణి చూడగానే వరూథిని మనసు అతని మీద మరులుగొంది. తనలో తాను "ఎవరీ దివ్యపురుషుడు ఎంత అందంగా వున్నాడు. ఇతడు నన్ను ఆదరిస్తే చాలు, నా జన్మ ధన్యమౌతుంది. ఎంత గంభీరంగా వున్నాడు. ఈ భూమండలంలో ఇతడంత అందమైనవాడు మరొకడుండేలా లేడు. నేనింత వరకూ దేవ, గంధర్వ, యక్ష, కిన్నెరులలో ఎంతోమంది పురుషుల్ని చూసానుగాని, ఇతనంత అందగాడు, నాకెవరూ వారిలో కనిపించలేదు. నేనెలా అతన్ని ఇష్టపడుతున్నానో, అతడు కూడా నన్ను ఇష్టపడితే నా జన్మ ధన్యమౌతుంది" ఈవిధంగా మనసులో భావించిన ఆ వరూథిని ప్రవరుడి ముందుకి వచ్చి తన శరీర సౌందర్యాన్ని ప్రవరుడి ముందు ప్రదర్శించింది.

ప్రవరుడు తన ముందు నిలిచన వరూథిని దివ్యసౌందర్యాన్ని చూసి ఆశ్చర్యపోయి ఆమె దగ్గరకి వెళ్ళి "ఓ సుందరీ ఎవరు నీవు? ఇక్కడ ఏం చేస్తున్నావు? నేను ఒక విప్రుణ్ణి, మాది అరుణాస్పదం అనే గ్రామం, ఒక సిద్ధుడి అనుగ్రహంతో పాదలేపనాన్ని ధరించి ఇక్కడికి వచ్చాను. ఆ లేపనం మంచువల్ల కరిగిపోయింది. అందుకే ఏంచేయాలో తోచక ఇలా తిరుగుతున్నాను" అన్నాడు.

వరూథిని అతడి మాటలు విని "ఓ విప్రవరా! నా పేరు వరూథిని, నేనొక అప్సరసని. నిత్యం ఈ పర్వతం మీద విహరిస్తుంటాను. ఈ రోజు నిన్నుచూసి నా మనసు చలించిపోయింది. నీ మీద నాకు అంతులేని ప్రేమ ఉదయించింది. నా మనసు నీ వశమైపోయింది. నేను నీకు అధీనమైపోయాను.

దయచేసి నన్ను స్వీకరించు" అన్నది. అదివిని ప్రవరుడు ఆమెతో "దేవీ! నేను నా ఇంటికి వెళ్ళాలి దానికి తగ్గ మార్గమేదో చెప్పు. నేను నిత్యం చేసే కర్మలకి విఘాతం కలుగుతోంది. అది ఎంతో అరిష్టదాయకం. కనుక నన్ను ఈ హిమాలయాల నుంచి నా ఇంటికి పంపు, విప్రులకి ఇతర ప్రదేశాల్లో ఎక్కువ కాలం వుండటం శ్రేయస్కరం కాదు. కొద్దిసేపట్లో సూర్యాస్తమయం కాబోతోంది. అంతకు ముందే నేను నా ఇంటికి వెళ్ళాలి" అని అన్నాడు.

ప్రవరుడు తన కోరికని సరిగ్గా అర్థం చేసుకోలేదని గ్రహించిన వరూధిని "ఓ విప్రవరా నన్ను వదిలి నీవు వెళ్ళకూడదని నేను కోరుకుంటున్నాను. స్వర్గం కూడా ఈ హిమాలయం కన్నా గొప్పగా వుండదు. ఈ రమణీయ ప్రదేశంలో నాతో విహరిస్తే నీకు ఎవరూ గుర్తుకురారు. ఇక్కడ నీకు కావలసినవన్నీ సమకూరుస్తాను. ఎందుకంటే నా మనసు నీ వశమైపోయింది. ఓ దయానిధీ! నీవిక్కడ నివసిస్తే ప్రతిరోజు కిన్నెరుల మనోహరమైన సంగీతాన్ని వింటూ ఆనందంగా కాలం గడపగలవు. ఇంత అందమైన దృశ్యాలు నీ ఇంట్లో వుండవు కదా! ఇది దేవభూమి. పరమ పవిత్రమైనది. యౌవనాన్ని పెంపొందిస్తుంది. కనుక నన్ను తిరస్కరించకు. నీవంటే నాకు చాలా ఇష్టం. నన్ను వరించు" అని అంటూ ఒక్కసారిగా ఆవేశం ఆపుకోలేక హఠాత్తుగా ప్రవరుణ్ణి కౌగలించుకుంది.

వరూధిని ఒక్కసారిగా తనని కౌగలించుకోగానే నిత్యాగ్నిహోత్రుడు, పరమ పవిత్రుడైన ఆ ప్రవరుడు ఆగ్రహంతో "ఓసీ దుష్టులారా! నన్ను తాకకు నీకు తగినవాడి దగ్గరకి వెళ్ళు. నా ప్రార్థన వినకుండా నన్ను నీవు కామిస్తున్నావు. ఇది నీకు తగదు. నేను నిత్య నైమిత్తిక కర్మల్ని నియమంగా ఆచరించేవాడిని. ప్రతిరోజూ ఉదయం సాయంత్రం హోమం చేయటం వల్ల సంపూర్ణమైన శాశ్వతలోకాలు ప్రాప్తిస్తాయి. కనుక నేను ఇంటికి వెళ్ళి వాటిని నిర్వర్తించాలి. దానికి తగ్గ మార్గాన్ని చెప్పు" అని గద్దించి అడిగాడు.

ఓ విప్రవరా! నన్ను నీవెందుకు తిరస్కరిస్తునావు. ఈ హిమాలయాలు నీకు నచ్చలేదా! దయచేసి నాతో కొంచెంసేపు ఈ పర్వతం మీద క్రీడించు,

దుర్లభమైన సుఖాన్ని పొందు. తరువాత నీకు, నీ ఇంటికి చేరే మార్గాన్ని చెబుతాను” అన్నది వరూధిని. ఓ వరూధినీ! బ్రాహ్మణులు శాస్త్ర ప్రకారం విచ్చలవిడిగా సుఖభోగాలు అనుభవించకూడదు. దానివల్ల వారికి ఎన్నో కష్టాలు, నష్టాలు కలుగుతాయి. ఇది శాస్త్రం చెప్పిన విషయం. దయచేసి నన్ను వాంఛించకు. పరస్త్రీని కోరవద్దని నా గురువు నాకు చెప్పారు. కనుక నీవెంత ప్రాధేయపడినా, ప్రాణత్యాగం చేసినా నేను నిన్ను గ్రహించను”అని హెచ్చరించాడు.

వరూధిని తనకు ఇంటికి వెళ్ళే మార్గం చెప్పదని గ్రహించిన ప్రవరుడు మానసికంగా ఆచమనం చేసి పరిశుద్ధుడై గార్హపత్య అగ్నికి నమస్కరించి “ఓ గార్హపత్య అగ్నిదేవా! అన్ని కర్మలకీ బీజస్వరూపుడివి నీవే. ఆవహనీయ-దక్షిణ అనే రెండు అగ్నులూ నీ వల్లనే ఉత్పన్నమయ్యాయి. నీవు అనుగ్రహిస్తేనే దేవతలు వర్షాలు కురిపిస్తారు. ధ్యానం వల్లనే ఈ జగత్తంతా ప్రతిష్ఠితమై వుంది. ఏ సత్యం ద్వారా ఈ ప్రపంచమంతా నీలో ఇమిడిపోయి వున్నదో. ఆ సత్యం ద్వారానే నిన్ను కోరుకుంటున్నాను. సూర్యాస్తమయం అయ్యేలోపు నేను నా ఇంటికి వెళ్ళెదను గాక! నా మనసు ఏ సమయంలోనైనా పరద్రవ్యాల మీదగానీ, పరస్త్రీల మీదగానీ కాంక్షని పెంచుకోకుండా వున్నదో అలాంటి మనసుతో నేను నా ఇంటికి వెళ్ళాలని కోరుతున్నాను” అని అంటూండగానే ఆ విప్రవరుడి శరీరంలోకి గార్హపత్యాగ్ని ప్రవేశించింది. దానితో అతడు దివ్యతేజస్సుతో వెలిగిపోవటం ప్రారంభించాడు. అతడి తేజోరూపాన్ని చూసి వరూధిని మరింతగా అతనిపై ప్రేమని పెంచుకుంది. అంతలోనే ఆ ప్రవరుడు ఆ స్థలం నుంచి అత్యంత వేగంగా తన గృహానికి వెళ్ళిపోయాడు. ఆ దృశ్యాన్ని చూసి వరూధిని ఏమీ చేయలేక విరహంతో నిట్టూర్పులు విడుస్తూ విలపించసాగింది.

**మాయా ప్రవరుడు :** విప్రవరుడు తన ఇంటికి వచ్చి యధావిధిగా తన నిత్యకృత్యాలు చేసుకోసాగాడు. అక్కడ హిమాలయాల్లో వరూధుని ప్రతిరోజూ ప్రవరుణ్ణి తలుచుకుంటూ రోజుని ఒక్కోయుగంగా భావిస్తూ,

ఎప్పటికైనా అతడు తన దగ్గరకి రాకపోతాడా అని ఎదురుచూస్తూ చాలా భారంగా కాలం గడపసాగింది. తనలో తాను "అయ్యో! నేనెంత పాపాత్మురాలను. వలచిన వరుణ్ణి పొందలేకపోయాను. ఆ బ్రాహ్మణుడితో సంగమించని ఈ శరీరం నాకెందుకు? ఇప్పటిదాకా ఈ పర్వతం మీద అందంగా కనిపించిన దృశ్యాలన్నీ నేడు నాకు ఆనందాన్ని ఏమాత్రం కలిగించటం లేదు. హతవిధీ!" అని విలపిస్తూ సంచరిస్తోంది.

వరూధినిని పూర్వం 'కల' అనే గంధర్వుడు ప్రేమించాడు. అయితే ఆమె అతన్ని తిరస్కరించింది. ఆ గంధర్వుడు అటువైపు వచ్చి వరూధిని పడుతున్న అవస్థని గమనించాడు. ఆమె మనోగతాన్ని తెలుసుకున్నాడు. వెంటనే అతడికి ఒక దుష్ట ఆలోచన తట్టింది. "ఈ వరూధిని ఇంతకు ముందు నేను ఎంత వేడుకున్నా నన్ను తిరస్కరించింది. ఈమెని పొందటానికి ఇదే సరైన సమయం" అని భావించి వెంటనే ప్రవరుడి రూపాన్ని ధరించాడు. ఏమీ ఎరగనివాడిలా వరూధిని సంచరిస్తున్న ప్రదేశానికి దగ్గర్లో తానూ సంచరించసాగాడు. వరూధిని తన సమీపంలో వున్న మాయాప్రవరుణ్ని చూసింది. ఆమెకి సత్యం తెలియదు. వెంటనే అతడి దగ్గరకి వచ్చి "స్వామీ! నన్ను దయచూడు, నీవు లేకపోతే నేను జీవించలేను. నన్ను చేపట్టు. నన్ను వదిలివెళితే మీకు పాపం చుట్టుకుంటుంది. ఈ దివ్యమైన హిమాలయ గుహల్లో నాతో సంగమించి ఆనందాన్ని కలిగించు" అని పరిపరివిధాలుగా ప్రార్థించింది.

వరూధిని ప్రార్థన విన్న మాయాప్రవరుడు "దేవీ! నీ ప్రార్థన వింటుంటే నా మనసు కరిగిపోతోంది. ధర్మవిరుద్ధమైనప్పటికీ నీ మాట మన్నించాలనిపిస్తోంది. అయితే నేను చెప్పినట్టు వింటేనే నీతో నేను సంగమిస్తాను. అలా చేయకపోతే మన సంగమం జరగదు అన్నాడు. స్వామీ! మీరేం చెబితే అది చేస్తాను. దయచేసి నన్ను అనుగ్రహించండి అంది వరూధిని. "దేవీ! నీతో నేను సంగమించేప్పుడు నీవు కళ్ళు తెరవకూడదు. అలా అయితే నేను సంగమిస్తాను. ఇదే నియమం అన్నాడు. సరేనని అంగీకరించింది వరూధిని.

ఇక ఆనాటి నుంచి మాయాప్రవరుడు వరూధిని ఆ హిమాలయ వనాల్లో సంచరిస్తూ వివిధ రమణీయ ప్రదేశాలలో నచ్చిన రీతిలో సంగమిస్తూ కాలం గడపసాగారు. వరూధిని మాత్రం ప్రవరుడికిచ్చిన మాట ప్రకారం సంభోగ సమయంలో కళ్ళు మూసుకుని మహా తేజోవంతుడైన ఆ ప్రవరుడి రూపాన్నే మనసులో ధ్యానించ సాగేది. అలా జరుగుతుండగా కొంత కాలానికి మాయాప్రవరుడు (కలి) ద్వారా వరూధిని గర్భం ధరించింది. మాయాప్రవరుడు తన ఇంటికి వెళ్ళే సమయమైందని వచ్చి చాలా కాలమైంది గనుక ఇంటిలో వారంతా ఎదురు చూస్తుంటారని వరూధినికి నచ్చచెప్పి ఆమె అనుమతితో తిరిగి వెళ్ళిపోయాడు.

**స్వరోచి జననం :** నవమాసాలు నిండిన తరువాత వరూధిని దివ్యతేజస్సుతో, సూర్యుడితో సమానమైన కాంతితో వెలిగిపోతున్న ఒక బాలుడు జన్మించాడు. సూర్యుడితో సమానమై వెలుగులు వెదజల్లుతూ వుండేవాడు కనుక ఆ బాలకుడు 'స్వరోచి' అనే పేరుతో ప్రసిద్ధుడయ్యాడు. ఆ బాలకుడు దినదిన ప్రవర్ధమానుడై క్రమానుసారంగా నాలుగు వేదాలని, సకల శాస్త్రాలని అభ్యసించి, ధనుర్విద్యా పారంగతుడై యౌవనదశకి చేరుకున్నాడు. మహావీరుడైన ఆ 'స్వరోచి' ఒకనాడు మందర పర్వతం మీద విహరిస్తున్నాడు. అక్కడ అతడికి భయంతో సంచరిస్తున్న ఒక కన్య కనిపించింది. ఆ కన్య స్వరోచిని చూసి రక్షించండి అని అరిచింది. భయంతో వున్న ఆ కన్యని సముదాయించి దేవీ! ఎవరు నీవు? భయపడకు అని ధైర్యం చెప్పాడు స్వరోచి. అప్పటికి కొంత తేరుకున్న ఆ కన్య నెమ్మదిగా మాటలు పెగల్చుకుని ఇలా చెప్పటం ప్రారంభించింది.

స్వామీ! నేను ఇందీవరుడనే విద్యాధరుడి కుమార్తెను. నా పేరు మనోరమ. నాకు విభావరి-కళావతి అనే ఇద్దరు చెలికత్తెలున్నారు. నేను ఒకరోజు నా చెలికత్తెలతో కలసి కైలాసపర్వత సమీపంలో వున్న ఒక చెరువు దగ్గరకి వెళ్ళాను. అక్కడ ఒకముని తపస్సు చేస్తూ నాకు కనిపించాడు.

ఆయన ఎంతో సన్నగా వికారంగా కనబడేసరికి నేను గట్టిగా ఆయన్ని చూసి నవ్వాను. అది గ్రహించిన ఆ తపస్వి కోపంతో "ఓసీ దుష్టులారా! నన్ను చూసి పరిహసించిన నీవు ఒక రాక్షసుడి చేతిలో పరాభవాన్ని పొందుదువు గాక!"అని శపించాడు. ప్రభూ! నన్ను ముని శపించటం విన్న నా చెలికత్తెలిద్దరూ కోపం ఆపుకోలేక ఆ మునిని పరుష వాక్యాలతో దూషించారు. అప్పుడా ముని వారిని కూడా ఘోరంగా ఒక దానిని కుష్ఠు వ్యాధిగ్రస్తురాలివి కమ్మని, ఇంకో చెలిని క్షయవ్యాధి పీడితురాలివి కమ్మని శపించాడు.

ఓ మహారాజా! ముని శాపంతో నా చెలులిద్దరికీ వ్యాధులు సంక్రమించాయి. నన్ను ఒక రాక్షసుడు తరుముకొస్తున్నాడు. అతన్ని తప్పించుకుని మూడురోజులుగా నేను పరుగెడుతూనే వున్నాను. అదిగో ఆ చివర నిల్చుని గర్జిస్తున్నాడే అతడే ఆ రాక్షసుడు. ప్రభూ! ఇదిగో ఈ దివ్యాస్త్రాన్ని తీసుకోండి. ఈ అస్త్రాన్ని పూర్వం పరమేశ్వరుడు స్వాయంభువ మనువుకి ఇచ్చాడు. ఆయన ఆ అస్త్రాన్ని వశిష్ఠమహర్షికి ఇవ్వగా, వశిష్ఠులవారు దాన్ని నా తాతగారైన చిత్రాంగదుల వారికి సమర్పించాడు. ఆయన నా తండ్రిగారికి ఆ అస్త్రాన్ని ఇవ్వగా నా తండ్రి నాకీ అస్త్రాన్ని అప్పగించాడు. ఇది అన్ని అస్త్రాలు చేసేపని చేస్తుంది. దీన్ని గ్రహించి నన్ను వెంటాడుతున్న ఆ రాక్షసుడి మీద ప్రయోగించి అతన్ని సంహరించు" అని కోరింది.

స్వరోచి ఆమె దగ్గర నుంచి విధివిధానంగా ఆ దివ్యాస్త్రాన్ని గ్రహించాడు. అంతలో ఆ రాక్షసుడు అరుస్తూ వచ్చి ఒక్కసారిగా ఆ కన్యని పట్టుకున్నాడు. ఆమె ప్రభూ! కాపాడండి అని గట్టిగా విలపించింది. వెంటనే స్వరోచి తను పొందిన దివ్యాస్త్రాన్ని ఆ రాక్షసుడి మీదకి ఎక్కుపెట్టాడు. అది చూసిన ఆ రాక్షసుడు వెంటనే ఆ కన్యని విడిచిపెట్టి స్వరోచితో "ప్రభూ నన్ను క్షమించండి. మీ అస్త్రాన్ని ఉపసంహరించండి. దయచేసి నా వృత్తాంతాన్ని వినండి–పూర్వం బ్రహ్మ మిత్రుడనే మహాముని అధర్వవేదంలో ఎంతో గొప్ప పాండిత్యాన్ని పొంది అందులో భాగమైన ఆయుర్వేదాన్ని సంపూర్ణంగా అభ్యసించాడు. నాపేరు ఇందీవరాక్షుడు. నేను ఈ కన్యకి తండ్రిని.

ఒకనాడు నేను బ్రహ్మమిత్రుడి దగ్గరకి వెళ్ళి నాకు ఆయుర్వేదాన్ని బోధించండి అని కోరాను. అలా నేను ఎంతో వినయంగా ఎన్నిసార్లు అడిగినా ఆయన ఆ విద్యని నాకు బోధించలేదు. ఒకనాడా ముని ఆయుర్వేదాన్ని తన శిష్యులకి బోధిస్తున్న సమయంలో రహస్యంగా నేనా విద్యను విని నేర్చుకున్నాను. నాకు ఇష్టమైన విద్యని సంపూర్ణంగా నేర్చుకున్న తరువాత ఆయన దగ్గరకి వెళ్ళి గట్టిగా ఆనందంతో నవ్వసాగాను. ఆ ముని నా విషయాన్నంతా గ్రహించి కోపంగా నన్నిలా శపించాడు.

ఓరీ దుర్మతీ! రాక్షసుడిలా నీవు మాయోపాయంతో రహస్యంగా విద్యను నా నుంచి అపహరించావు. పైగా నన్ను చులకన చేస్తూ పరిహసించావు. కనుక నీవు ఏడురోజుల్లో భయంకరమైన రాక్షసుడివౌతావు" అని శపించాడు. అప్పుడు నేను ఆయన పాదాలమీద పడి క్షమించమని ప్రార్థించాను. దానికి ఆయన "నా శాపానికి తిరుగులేదు. అయితే నీవు రాక్షస రూపం ధరించిన రెండు వారాలలోనే తిరిగి నీ యాధారూపాన్ని పొందుతావు. అయితే రాక్షసరూపంలో వున్నప్పుడు నీవు జ్ఞానాన్ని కోల్పోయి నీ కుమార్తెనే భక్షించాలని ప్రయత్నిస్తావు. ఆ సమయంలో ఒక మహావీరుడి ద్వారా దివ్యాస్త్రం ఎక్కుపెట్టబడి, తక్షణమే నీవు నీ పూర్వస్మృతిని పొంది తిరిగి నీ శరీరాన్ని ధరిస్తావు" అని శాపవిమోచనాన్ని అనుగ్రహించాడు ప్రభూ! ఇదీ నా కథ.

**స్వరోచి వివాహం :** "ఓ మహావీరా! రాక్షస రూపం నుంచి నన్ను విముక్తి చేసావు కనుక ఏదైనా వరం కోరుకో! అలాగే నీవు రక్షించిన నా కుమార్తెను నీకే సమర్పిస్తున్నాను. దీనితో పాటు నేను నేర్చుకున్న ఆయుర్వేద విద్యను కూడా నీకు సమర్పిస్తున్నాను గ్రహించు" అని చెప్పి తన కుమార్తెని అప్పగించబోయాడు ఇందీవరాక్షుడు. అప్పుడు మనోరమ తన తండ్రితో "తండ్రీ! నాకు కూడా నన్ను రక్షించిన ఈ మహావీరుడంటే ఇష్టమే. నేను ఇతన్ని మనసార స్వీకరిస్తాను. అయితే ఇది సందర్భం కాదు. నా ప్రియ చెలులు ఇద్దరూ కుష్ఠ క్షయ వ్యాధులతో బాధపడుతుంటే నేను ఆనందంగా వివాహం చేసుకోవటం భావ్యం కాదు" అని వినయంగా పలికింది.

మనోరమ మాటలు విన్న స్వరోచి ఆమెతో దేవీ! నీవేం బాధపడవద్దు. నీ తండ్రి ప్రసాదించిన ఆయుర్వేద విద్య ద్వారా నీ చెలులిద్దరినీ రోగవిముక్తుల్ని చేస్తాను” అని అనగానే మనోరమ ఎంతో ఆనందించింది. వెంటనే వివాహానికి సమ్మతించింది. ఇందీవరాక్షుడు వైభవంగా మందరాచలం మీద తన కుమార్తెను స్వరోచికి ఇచ్చి వివాహం జరిపించి తిరిగి తన లోకానికి వెళ్ళిపోయాడు. తరువాత స్వరోచి మనోరమలిద్దరూ చెలికత్తెలు నివసిస్తున్న ఉద్యానవనానికి వెళ్ళారు. స్వరోచి తన ఆయుర్వేద విద్య ద్వారా వాళ్ళిద్దరి వ్యాధుల్నీ పోగొట్టాడు. వెంటనే ఆ చెలులిద్దరికీ దివ్యశరీరాలు వచ్చాయి. దివ్యసౌందర్యంతో వారిద్దరూ ప్రకాశించసాగారు.

రోగవిముక్తి పొందిన చెలికత్తెలలో మొదటి చెలికత్తె స్వరోచితో “ప్రభూ నా పేరు విభావరి. మీరు నా రూపాన్ని నాకు తిరిగి ప్రసాదించారు. అందుకు ప్రతిఫలంగా నా ఆత్మని మీకు సమర్పిస్తున్నాను. అలాగే అన్ని ప్రాణుల స్వరాలు (మాటలు) గ్రహించగలిగే విద్యని కూడా మీకు ఇస్తున్నాను గ్రహించండి” అని పలికింది. వెంటనే రెండోకన్య స్వరోచితో “ప్రభూ నా పేరు కళావతి. పారుడు అనే బ్రహ్మర్షి నా తండ్రి. పూర్వం నన్ను ఒక రాక్షసుడు కామించి నన్ను తనకిచ్చి వివాహం చేయమని నా తండ్రిని కోరాడు. ఆయన నిరాకరించగా ఆ రాక్షసుడు నా తండ్రిని వధించాడు. దానితో నేను ఆత్మత్యాగం చేసుకోబోయాను. అప్పుడు సతీదేవి ప్రత్యక్షమై అమ్మా! నీకు త్వరలోనే ‘స్వరోచి’ అనే మహావీరుడు భర్తగా లభిస్తాడు. నీ ప్రాణాల్ని తీసుకోకు అని చెప్పి ఇదిగో సకలనిధుల్నీ ప్రసాదించే ‘పద్మినీ’ అనే విద్యని నీకు ప్రసాదిస్తున్నాను స్వీకరించు అని నాకు ఆ విద్యని ప్రసాదించి అంతర్ధానమైంది. ఆమె అసత్యం చెప్పదు కనుక తమరు స్వరోచి మహారాజే అయివుంటారు. తమరు దయచేసి నన్ను వివాహం చేసుకోండి. ఈ శరీరం నేను పొందిన పద్మినీ విద్య మీకే సమర్పిస్తున్నాను” అని పలికింది.

ఆవిధంగా విభావరి–కళావతి మాటలు విన్న స్వరోచి తన మొదటిభార్య ఆమోదంతో వారిద్దరినీ వివాహం చేసుకున్నాడు. తరువాత స్వరోచి ముగ్గురు భార్యలతో కలిసి హిమాలయవనాలలో ఆనందంగా సంచరించసాగాడు.

స్వర్గంతో సమానమైన ఆ దివ్యపర్వతం మీద ఎంతో ఉల్లాసంగా విహరిస్తున్న వారు ఒకచోట విశ్రమించారు. వారి ప్రణయాన్ని చూసి ఆ సమీపంలోనే వున్న ఒక హంస నీటిలో వున్న చక్రవాక పక్షితో ఇలా అన్నది" ఈ యువకుడు తన ఇచ్ఛానుసారం ఈ యువతులతో భోగాలను భవిస్తున్నాడు. ఇతడి భార్యలు కూడా ఎంతో ధన్యులు. వీరందరూ పరస్పరం అనురాగం కలిగి వున్నారు. ఇలాంటి భార్యాభర్తల్ని ఎక్కడా చూడలేం" అన్నది.

ఆ మాటలు విన్న చక్రవాక పక్షి 'ఓ సఖీ'! ఈ స్వరోచి ధన్యుడు కాదు. ఒక భార్య సమీపంలోనే మరో భార్యతో రమిస్తున్నాడు. అతడికి ఏమాత్రం మానాభిమానాలు లేవు. అతడికి భార్యల మీద పూర్తిగా అనురాగం లేదు. అందర్నీ సమానంగా ప్రేమించటం లేదు. ఒక భార్య ఇతన్ని కౌగిలించుకోవాలనుకుంటే అతడు వేరే భార్యతో రమిస్తుంటాడు. కనుక ఇతడికి భార్యలందరి మీదా సమభావం లేదు. వారికి ఇతడు భృత్యుడు మాత్రమే. ఓ సఖీ! నేను ధన్యురాలిని నా భర్త ధన్యుడు ఎందుకంటే నేనే అతడికి ఏకైక భార్యని. నామీదే అతడి మనసుల లగ్నమై వుంది" అని అన్నది.

అన్ని జీవుల భాషలు తెలిసిన స్వరోచి ఆ చక్రవాక పక్షి అన్న మాటలు విన్నాడు. అతడు తను చేస్తున్న పనికి ఎంతో సిగ్గుపడ్డాడు. అయ్యో! నేనేం చేస్తున్నాను ఆ పక్షులమాటలు నిజమేకదా! ఇందులో ఏమాత్రం అసత్యం లేదు అని చింతించాడు. తిరిగి యథాప్రకారంగా తన భార్యలతో కలిసి కాలం గడపటం ప్రారంభించాడు. అలా వంద సంవత్సరాలు గడిచిపోయాయి. ఒకనాడు స్వరోచి భార్యలతో విహరిస్తుండగా అతడికి సమీపంలో మంచి శరీరపుష్టితో వున్న జింకల గుంపుతో విహరిస్తున్న ఒక మృగాన్ని చూసాడు. అది తనతో సమానంగా ఆడజింకల గుంపులో పడుకుంది. అప్పుడు ఆడజింకలన్నీ ఆ మగజింక దగ్గరకి వచ్చి కామభావంతో వాసన చూడసాగాయి. అదిచూసి ఆ మృగం ఆడజింకలతో ఇలా అంది.

ఓ కామినులారా! అవతలకి పొండి నేనేం స్వరోచిని కాను. నా స్వభావం స్వరోచిలా వుండదు. ఆ సిగ్గులేనివాడు ఎంతమందితోనైనా రమిస్తాడు.

అతడి దగ్గరకి పొండి. ఎలాగైతే ఒక స్త్రీ ఎంతోమంది పురుషుల మీద మక్కువ పెంచుకుంటే అసహ్యంగా వుంటుందో ఒక పురుషుడు కూడా ఎంతోమంది స్త్రీల మీద మక్కువ పెంచుకుంటే అలాగే వుంటుంది. కనుక మీరు స్వరోచిలాంటివాడి వెంట పడండి" అన్నది. ఆ జింకల సంభాషణ విన్న స్వరోచికి చాలా అవమానం అనిపించింది. తను చేస్తున్న పని సరికాదనిపించింది. వెంటనే భార్యల్ని వదిలేయాలనుకున్నాడు. అయితే వారి దగ్గరకి వెళ్ళగానే అన్నీ మరిచిపోయి వారితో సుఖించటం ప్రారంభించాడు. అలా తిరిగి ఆరువందల సంవత్సరాలు గడిచిపోయాయి.

స్వరోచి నిరంతరం తన భార్యలతో సుఖభోగాలు అనుభవిస్తున్నప్పటికీ, ధర్మపరమైన కార్యక్రమాల్ని విడవకుండా ఆచరించేవాడు. కొంతకాలానికి స్వరోచి ముగ్గురు పుత్రుల్ని కన్నాడు. మనోరమ ద్వారా 'విజయుడు' అనేవాడినిని, విభావరి ద్వారా 'మేరునందనుణ్ణి' కళావతి ద్వారా 'ప్రభావుడనే' వాడిని పొందాడు. తరువాత తన భార్య కళావతి ద్వారా సంపాదించిన పద్మినీవిద్యతో మూడు మహాపట్టణాలని నిర్మించాడు. తూర్పుదిక్కున కామరూప పర్వతం మీద నిర్మించిన నగరాన్ని విజయుడికి, ఉత్తరదిశలో ఎత్తైన ప్రాకారాలతో నిర్మించిన పట్టణాన్ని మేరునందనుడికి, దక్షిణదిక్కులో నిర్మించిన తాళము అనే మహానగరాన్ని ప్రభావుడికి ఇచ్చాడు. ఆవిధంగా స్వరోచి తన ముగ్గురు కుమారులకీ మూడు నగరాలని ఇచ్చి తాను యథాప్రకారంగా భార్యలతో కలిసి అందమైన వనాల్లో విహరించటం ప్రారంభించాడు.

ఒకనాడు స్వరోచి ధనుస్సు ధరించి అడవిలో సంచరిస్తూ దూరంగా కనిపించిన ఒక అడవిపందికి బాణాన్ని ఎక్కుపెట్టాడు. ఆదే సమయంలో ఒక లేడి అక్కడికి వచ్చి "ఓ రాజా! ఆగు నీవు సంధించిన బాణాన్ని నామీద ప్రయోగించు. ఆ పంది మరణించినందువల్ల ఏ ప్రయోజనం లేదు. నీ బాణాన్ని నామీద వేసి నన్ను దుఃఖం నుంచి కాపాడు" అని అడిగింది. స్వరోచి ఆ లేడి మాటలు విని "నీ శరీరం రోగంతో వున్నట్టులేదే ఎందుకు నీవు మరణించాలనుకుంటున్నావు?" అని ప్రశ్నించాడు. దానికా లేడి "స్వామీ!

నేను మిమ్మల్ని వరించాను. మీరే నా భర్త కావాలి. మీతో సంభోగించాలని నా కోరిక. అది తీరుతుందో లేదో! మీరు నన్ను అనుగ్రహిస్తారో లేదో అన్న భయంతో మరణమే నాకు శరణమని భావించాను” అన్నది.

లేడి మాటలు విని ఆశ్చర్యపోయిన స్వరోచి ఓ మృగమా నీకు నాకు సంయోగం ఎలా కుదురుతుంది? నీవు లేడివి నేను మనిషిని కదా! అని తన సందేహాన్ని వెలిబుచ్చాడు. “స్వామీ! మీకు నామీద ప్రేమ వుంటే ఒక్కసారి నన్ను ఆలింగనం చేసుకోండి చాలు. నేను మీకు దాసురాలినై వుంటాను” అన్నది. సరే ఏం జరుగుతుందో చూద్దామనుకున్న స్వరోచి వెంటనే ఆ లేడిని కౌగిలించుకున్నాడు. తక్షణమే ఆశ్యర్యకరంగా ఆ లేడి ఒక అందమైన యువతిగా మారిపోయింది. ఆమెని చూసిన స్వరోచి సుందరీ ఎవరు నీవు? అని ప్రశ్నించాడు. స్వామీ! నేను ఈ వనానికి అధిదేవతని. దేవతల కోరిక మేరకు నేను మీ దగ్గరకి వచ్చాను. మనిద్దరి సంగమం ద్వారా ఒక మహాపురుషుడు జన్మిస్తాడని దేవతలు చెప్పారు. కనుక నన్ను స్వీకరించండి అని కోరింది. ఆమె మాటని మన్నించిన స్వరోచి ఆమెతో ఆనందంగా సంగమించాడు.

**మనువు జననం :** వనదేవతకి స్వరోచికి సర్వ శుభలక్షణ సంపన్నుడు, మహాతేజస్వి అయిన కుమారుడు జన్మించాడు. ఆ పుత్రుడు జన్మించగానే ఆకాశం నుంచి దేవ దుందుభులు మ్రోగాయి. నింగి నుంచి దేవతలు పూలవాన కురిపించారు. దిగ్గజాలు మేఘాలలోని నీటిని పీల్చి ఆ బాలుణ్ణి అభిషేకించాయి. ఆ పిల్లవాడి దివ్యతేజస్సు అన్ని దిక్కులకీ వ్యాపించింది. అద్భుతంగా ప్రకాశిస్తున్న తన కుమారుడికి ‘ద్యుతిమానుడు’ అని పేరుపెట్టాడు. క్రమంగా క్షత్రియోచితమైన విద్యలన్నీ నేర్చుకుని మహావీరుడుగా తయారయ్యాడు ద్యుతిమానుడు. అతడు స్వరోచి కుమారుడు కనుక ‘స్వారోచిషుడు’ అనే పేరుతో కూడా ప్రసిద్ధి చెందాడు.

స్వరోచి యథాప్రకారం తన భార్యతో ఒక అందమైన పర్వతం మీద సంచరిస్తూ అక్కడ తన భార్యతో కలిసి విహరిస్తున్న ఒక హంసని చూసాడు.

ఆ హంస తన భార్యతో “ఓ సుందరీ నీవు నీ మనసుని స్థిరం చేసుకో. నీతో నేను ఎంతోకాలం ఆనందంగా విహరించాను. రోజూ నిన్ను భోగించటం వల్ల ఏమి లాభం కలుగుతుంది? ఇప్పుడు మనకి వృద్ధాప్యం వచ్చింది. ఇక నీవు నేను విహరించటం మానేసి విషయవాసనల మీద వ్యామోహాన్ని వదులుకోవాలి” అని అన్నది. దానికి ఆ ఆడహంస స్వామీ! ఈ జీవితమంతా భోగం కోసమే కదా! బ్రాహ్మణులు యజ్ఞయాగాలు చేసేది వివిధరకాల భోగాలు అనుభవించటం కోసమే కదా! ప్రజలంతా విరివిగా దానధర్మాలు చేసేది కూడా స్వర్గసుఖాల కోసమే కదా! అలాంటి భోగాల్ని నీవెందుకు ఇష్టపడటం లేదు” అని ప్రశ్నించింది.

“ఓ భార్యామణీ! ఎవరి మనసు భోగాలమీద ఆసక్తి లేకుండా వుంటుందో, వారి బుద్ధి పరమాత్మ మీద లగ్నమౌతుంది. పుత్రులు, మిత్రులు, భార్యలు ఇలా వీరందరి మీద ఆసక్తి వున్న మనుషులు చెరువులోని బురదలో కూరుకుపోయిన ఏనుగులాగా దుఃఖాన్ని పొందుతారు. ఇదిగో చూడు ఈ స్వరోచి చిన్నతనం నుంచి కామాతురుడై తన భార్యలతో నిరంతరం సంగమిస్తూ విషయసుఖాలలో మునిగి తేలుతున్నాడు. ఇలా ఈ స్వరోచి నిత్యం తన భార్యలమీద, పుత్రులమీద మమకారం అనే బురదలో మునిగిపోతే ఎప్పుడు ఉద్ధరించబడతాడు. ఓ భామా! నేను ఈ స్వరోచిలా స్త్రీ గణాలకి వశమైపోను. నేను జ్ఞానం కలిగినవాణ్ణి. భోగాల మీద నాకిప్పుడు ఎలాంటి ఆసక్తిలేదు” అన్నాడు మగహంస.

ఆ హంస అన్న మాటలు విని వైరాగ్యం తెచ్చుకున్న స్వరోచి, భోగాల మీద ఆసక్తి వదిలి తన ముగ్గురు భార్యలతో కలిసి తపస్సు చేయటానికి అడవికి వెళ్ళాడు. అక్కడ కఠోరమైన తపస్సు ఆచరించి అన్ని పాపాల నుంచీ విముక్తుడై భార్యలతో సహా ముక్తి పొందాడు.

స్వరోచి ముక్తి పొందగానే దేవతలు అతడి కుమారుడైన ద్యుతిమానుడిని (స్వారోచిషుడు) మనువుగా చేసారు. నాటి నుంచి ఆ మన్వంతరం స్వారోచిష

మన్వంతరం అని ప్రసిద్ధి గాంచింది. ఈ మన్వంతరంలో దేవగణాలన్నీ పారావతులు, యతుషితులు అనే పేర్లతో వుంటారు. ఇంద్రుడు విపశ్చితుడు అనే పేరుతో వుంటాడు. ఇక సప్తర్షులుగా– ఊర్జస్తంభ, ప్రాణ, దత్త, అలి, ఋషభ, నిశ్చర, అర్వవీర అనే పేర్లతో వుంటారు. మహావీరుడైన ఆ స్వారోచిష మనువుకి చైత్ర, కింపురుషాది ఏడుగురు వీర్యవంతులైన పుత్రులు జన్మించి భూమిని పాలించారు. స్వారోచిషుడి మన్వంతరం ఉన్నంత కాలం అతడి వంశంలో జన్మించిన రాజులంతా భూమండలాన్ని పాలించారు. మన్వంతరాలలో స్వారోచిష మన్వంతరం రెండోది. ఈ మన్వంతరం గురించి మనువు జననం గురించిన విశేషాలని విన్నవారు సకల పాపాల నుంచీ విముక్తులవుతారు.

## ఔత్తమ మన్వంతరం

**మా**ర్కండేయ మహర్షి క్రౌష్టుకి మునికి ఔత్తర మన్వంతర చరిత్ర గురించి ఇలా చెబుతున్నాడు – పూర్వం సురుచికి ఉత్తానపాదుడికి 'ఉత్తముడు' అనే కుమారుడు జన్మించాడు. ఉత్తముడు క్రమంగా పెరిగి పెద్దవాడై మహావీరుడుగా, ధర్మప్రభువుగా ప్రసిద్ధి గాంచాడు. వయసు రాగానే ఉత్తముడు బభ్రు చక్రవర్తి కుమార్తె 'బహుళ' అనే కన్యని వివాహం చేసుకున్నాడు. ఉత్తముడు నిజంగానే ఉత్తముడు. తన భార్యని అమితంగా ప్రేమించేవాడు. ఆమెని తప్ప పరస్త్రీని కలలో కూడా చూసేవాడు కాదు. నిత్యం ఆమెకి ఇష్టమైన పనులే చేస్తూ ఆమె గురించే ఆలోచిస్తుండేవాడు. అయితే అతడి భార్యకి ఉత్తముడంటే ఇష్టం ఉండేదికాదు. ఉత్తముడు ఎంతగా ఆమెకి దగ్గరవ్వాలని చూసినా ఆమె అతన్ని ఏదో వంకతో దూరం పెట్టేది. అయినా అతడు ఆమెను ప్రేమిస్తూనే వుండేవాడు. ఒకనాడు తన స్నేహితులందరినీ భార్యలతో సహా విందుకి ఆహ్వానించాడు ఉత్తముడు. అందరూ ఆనందంగా భుజిస్తూ సురాపానాన్ని స్వీకరించసాగారు. ఉత్తముడు తన భార్యని కూడా పిలిచి మధువుతో నింపిన పాత్రని ఆమెకిచ్చాడు. అయితే ఆమె 'వాళ్ళందరి ఎదుటా ఉత్తముణ్ణి తిరస్కరించి మధుపాత్రని స్వీకరించలేదు.

దానితో ఒక్కసారిగా ఉత్తముడిలో కోపం బుసలు కొట్టింది. ఆగ్రహంగా పైకిలేచి తన పరివారాన్ని పిలిచి "మీరు వెంటనే ఈ ధూర్తురాలిని అడవిలో వదిలిరండి" ఇది నా ఆజ్ఞ అని చెప్పి పంపాడు.

రాజభటులు అతడి ఆజ్ఞని మన్నించి ఆమెని తీసుకెళ్ళి అడవిలో వదిలేసి వచ్చారు. ఆమె మాత్రం అది శిక్షగా భావించక హమ్మయ్యా రాజు చెర నాకు వదిలింది అని ఆనందించింది. అయితే భార్యని కోపంతో విడిచిపెట్టినప్పటికీ ఉత్తముడు ఆమె మీద ప్రేమని ఏమాత్రం తగ్గించుకోలేదు. నిత్యం భార్యనే స్మరిస్తూ తన బాధని లోపలే వుంచుకుని ధర్మబద్ధంగా రాజ్యపాలన చేస్తున్నాడు.

ఒకనాడు ఒక బ్రాహ్మణుడు అతడి దగ్గరకి వచ్చి ఎంతో బాధగా "మహారాజా నేను ఎన్నో బాధలు పడుతున్నాను. నిన్న అర్ధరాత్రి నేను నిద్రిస్తున్న సమయంలో ఎవరో నా భార్యని అపహరించారు. దయచేసి నా భార్యని నాకు ఇప్పించండి" అని కోరాడు. ఓ బ్రాహ్మణుడా! నీ భార్య ఎలా వుంటుంది? తలుపులు వేసి వుండగా ఆమెని ఎవరు అపహరించారు? అని ప్రశ్నించాడు మహారాజు. ప్రభూ నా భార్య అందవిహీనంగా కురూపిగా వుంటుంది. ఎంతో గయ్యాళి. అయినా ఆమె నాకు కావాలి. భార్యను రక్షించుకోవటం భర్త ధర్మం. భర్త ఎలాంటివాడైనా భార్య సేవించటం ఎలా ధర్మమో! అలాగే భార్య ఎలాంటిదైనా భరించటం భర్త ధర్మం. కనుక నా భార్యను నాకు వెదికి తెచ్చివ్వండి ప్రభూ అది మీ ధర్మం, కర్తవ్యం అన్నాడు.

బ్రాహ్మణుడి ప్రార్థన విన్న ఉత్తముడు వెంటనే రథాన్ని ఎక్కి విప్రుడి భార్యని వెతుకుతూ బయలుదేరాడు. అలా వెళ్ళిన రాజు ఒక వనంలోకి ప్రవేశించి అక్కడ ఒకముని ఆశ్రమాన్ని చూసాడు. లోపలికి వెళ్ళగానే ముని రాజుని ఆదరించి శిష్యుడితో అర్ఘ్యాన్ని తెమ్మన్నాడు. అయితే త్రికాలజ్ఞుడైన ఆ శిష్యుడు అర్ఘ్యాన్ని తేకుండా "గురుదేవా ఇతడు అర్ఘ్యానికి యోగ్యుడో కాదో విచారించి చెప్పండి" అని అన్నాడు. వెంటనే ఆ ముని రాజు వృత్తాంతమంతా తెలుసుకుని అతడికి అర్ఘ్యం ఇవ్వకుండా కేవలం ఆసనం సమర్పించి సంభాషణ ప్రారంభించాడు.

"ఓ రాజా తమరు 'ఉత్తముడనే' ప్రభువని నాకు తెలుసు. ఎందుకోసం ఇలా వచ్చారు అని అడిగాడు. స్వామీ! ఒక విప్రుడి భార్యని వెదుకుతూ నేను ఇలా వచ్చాను. అదిసరే స్వామీ! నేను వచ్చిన వెంటనే మీ శిష్యుడు అర్ఘ్యం తేబోయి, తిరిగి వెనక్కి ఎందుకు వెళ్ళాడో నాకర్థం కాలేదు. దయచేసి చెప్పండి అని కోరాడు.

ఆ ముని రాజుతో "రాజా నా శిష్యుడు త్రికాలజ్ఞుడు. అతడు నిన్ను చూసిన వెంటనే గతంలో నీవు చేసిన తప్పుని గ్రహించాడు అందుకే అర్ఘ్యాన్ని నీకు ఇవ్వలేదన్నాడు. స్వామీ! ఏమిటి నేను చేసిన తప్పు? అని అడిగాడు ఉత్తముడు. రాజా మర్చిపోయావా నీ భార్యని అడవిలో ఒంటరిగా వదిలేశావు అది తప్పుకాదా! అందుకే నీవు అర్ఘ్యం స్వీకరించటానికి అయోగ్యుడివయ్యావు" అన్నాడు ముని. అంతే కాకుండా రాజుతో – రాజా! భార్యని విడిస్తే అన్ని ధర్మాల్నీ విడిచినట్టేనని తెలుసుకో, భార్య ఎలాంటిదైనా ఆమెని పోషించటం భర్త ధర్మం. ధర్మం తప్పిన వారిని గాడిన పెట్టటం రాజుల కర్తవ్యం అయితే రాజే నీతి తప్పితే ఎలా? వారిని ఎవరు శిక్షిస్తారు? ఈవిధంగా ముని పలకటంతో ఉత్తముడు తన తప్పు తెలుసుకున్నాడు. ఎంతో పశ్చాత్తాపపడ్డాడు. మునితో "స్వామీ! నా తప్పుని సరిదిద్దుకుంటాను. దయచేసి విప్రుడి భార్యని ఎవరు తీసుకెళ్ళారో చెప్పండి అని అడగగా, త్రికాలజ్ఞుడైన ఆ ముని, రాజా! విప్రుడి భార్యని 'బలాకుడు' అనే రాక్షసుడు అపహరించాడు. అతడు ఉత్పలావతంలో వున్నాడు. వెళ్ళి ఆమెని రక్షించు అని చెప్పి పంపాడు.

ఉత్తముడు వెంటనే ఉత్పలావతం అనే అడవికి చేరుకుని అక్కడ రాక్షసుడి చెరలో వున్న విప్రుడి భార్యని చూసాడు. ఆమె రాజుని చూసి సంతోషంతో ప్రభూ! ఈ రాక్షసుడెవరో నన్ను బలాత్కారంగా అపహరించాడు. అయితే ఇతడు నన్ను భక్షించకుండా ఇలా బంధించి వుంచాడు. అడుగో ఆ చివర తన అనుచరులతో సంచరిస్తున్నాడు అని చెప్పింది. ఉత్తముడు అక్కడికి వెళ్ళి రాక్షసుణ్ణి చూసాడు. రాజుని చూడగానే భయపడిపోయిన

బలాకుడు ఆయన పాదాలమీద పడి శరణు వేడుకున్నాడు. ఉత్తముడు అతడితో ఓయీ! నీవు ఆ విప్రుడి భార్యని ఎందుకు అపహరించి తెచ్చావు అని గద్దించాడు. బలాకుడు వినయంగా ఆయనతో ఇలా చెప్పటం ప్రారంభించాడు.

రాజా! ఆ విప్రుడు మహాయజ్ఞాలు చేసే గొప్ప పండితుడు, మంత్రవేత్త. అతడు రాజ్యంలో జరిగే అన్ని యజ్ఞాల్లో పాల్గొని రక్షోఘ్న మంత్రాలు పఠిస్తూ నేనెక్కడా సంచరించకుండా వుండేలా చేస్తున్నాడు. నేను అతడి భార్యని అపహరించి తెస్తే అతడు యజ్ఞం చేయటానికి అనర్హుడవుతాడు. అందుకే ఆమెని అపహరించాను గానీ ఆమెపై నాకు ఎలాంటి దురుద్దేశం లేదు. ప్రభూ నేను నీ అనుచరుణ్ణి నీవేది ఆజ్ఞాపిస్తే దాన్ని చేస్తాను" అని వినయంగా పలికాడు బలాకుడు.

అసురుడి మాటలు విన్న ఉత్తముడు రాక్షసా! అయితే నీవు వెంటనే విప్రుడి పత్నిలో వున్న దుష్టస్వభావాన్ని భక్షించి, తిరిగి ఆమెని వారి ఇంటిదగ్గర విడిచిరా అన్నాడు. బలాకుడు సరేనని రాజు చెప్పిన ప్రకారమే చేసి విప్రుడి భార్యని ఆమె ఇంటి దగ్గర దింపి రావటానికి సంసిద్ధుడై రాజుతో ప్రభూ! ఇంకా ఏం చేయమంటారో చెప్పండి అని అడిగాడు. ఉత్తముడు రాక్షసా! నేను అవసరం కలిగినప్పుడు నిన్ను స్మరిస్తాను వెంటనే నీవు రావాలి అని చెప్పి అతన్ని పంపేశాడు.

ఉత్తముడు విప్రుడి భార్యని అతడి ఇంటికి చేర్చిన తరువాత తన భార్యని తలుచుకుని "అయ్యో! నేనెంత అపరాధం చేసాను. నా భార్య ఎక్కడుందో?" అని విచారిస్తూ తిరిగి ముని ఆశ్రమానికి వెళ్ళాడు. రాజు ప్రార్థన విని త్రికాలజ్ఞుడైన ఆ ముని రాజా! నీ భార్య క్షేమంగానే వుంది. భయపడకు ప్రస్తుతం ఆమె రసాతలంలో నివసిస్తోంది. పాతాళంలో కపోతుడనే నాగరాజు వనంలో తిరుగుతున్న నీ భార్యమీద వ్యామోహపడి ఆమెని పాతాళానికి తీసుకుపోయాడు. ఆ నాగరాజు కుమార్తె 'నంద' నీ భార్యని తన అంతఃపురంలోకి తీసుకెళ్ళి రహస్యంగా దాచి వుంచింది.

నాగరాజు కొన్నాళ్ళ తరువాత కుమార్తె నంద దగ్గరకి వచ్చి తను తెచ్చిన వనిత ఎక్కడ? అని అడిగాడు. దానికి ఆమె ఏ సమాధానం చెప్పకపోవటంతో 'మూగదానివికా'! అని ఆమెని శపించాడు. అలా నాగరాజు ద్వారా పాతాళానికి చేరుకున్న నీభార్య అతడి కుమార్తె సంరక్షణలో క్షేమంగా వుంది" అని చెప్పాడు.

ఉత్తముడు తిరిగి ఆ మునితో "స్వామీ! నాకు చాలా సంతోషంగా వుంది. నా భార్య జీవించి వున్నందుకు. అయితే నాదొక సందేహం. నేనెంత ప్రేమని ఆమెమీద కురిపిస్తున్న ఆమె నన్నెందుకు తిరస్కరిస్తోంది. ఎందుకు నన్ను ప్రేమించటం లేదు అని ప్రశ్నించాడు. రాజా! మీ వివాహలగ్నం సరిగాలేదు. లగ్నం సమయంలో రవి, కుజ, శనుల దృష్టి వుంది. నీ భార్యని బృహస్పతి, శుక్రుడు చూస్తున్నారు. ఆ సమయంలో నీ భార్యకి చంద్రుడు, నీకు బుధుడు పరస్పరం విరుద్ధంగా వున్నారు. అందుకే ఆమె నిన్ను ప్రేమించటంలేదు. ఇకపై నీకా బాధ వుండదు. నీ భార్యను స్వీకరించి ధర్మబద్ధంగా పరిపాలన కొనసాగించు" అని ఆశీర్వదించాడు. ఉత్తముడు ముని దగ్గర శలవు తీసుకుని తన రాజ్యానికి తిరిగి వచ్చాడు.

ఉత్తముడు రాజ్యానికి తిరిగివచ్చి సరాసరి తనని శరణువేడిన విప్రుడి ఇంటికి వెళ్ళాడు. ఆయనతో జరిగిన విషయమంతా చెప్పాడు. తన భార్యని తాను తిరిగి తెచ్చుకున్నప్పటికీ ఆమెకి తనమీద ప్రేమ లేదుకదా! ఎలా ఆమెని స్వీకరించాలి అని సందేహంగా వుందని అతడికి విన్నవించాడు. విప్రుడు రాజుని సముదాయించి, ప్రభూ! అన్ని సమస్యలకీ తగిన ఉపాయాలున్నాయి. నాకు ఎన్నో మంత్రాలు తెలుసు ముందు మీ భార్యని తెచ్చుకోండి. మీ ఇద్దరూ అన్యోన్యంగా ఉండటంకోసం 'మిత్రవింద' అనే పేరుగల యజ్ఞాన్ని ఇప్పుడే చేస్తున్నాను. తద్వారా నీభార్య నీకు సంపూర్ణంగా అనుకూలవతి అవుతుంది" అని చెప్పాడు.

విప్రుడి మాటలు విన్న ఉత్తముడికి ఎంతో ధైర్యం వచ్చింది. ఆనందం కలిగింది. వెంటనే తనకి పూర్వం మాటిచ్చిన రాక్షసుణ్ణి స్మరించాడు.

తక్షణమే బలాకుడు ప్రత్యక్షమయ్యాడు. ఉత్తముడి ఆజ్ఞననుసరించి పాతాళానికి వెళ్ళి అతడి భార్యని తిరిగి తీసుకువచ్చాడు. ఉత్తముడి భార్య ఎంతో ఆదరంగా పతిని కౌగిలించుకుంది. స్వామీ నా తప్పులు మన్నించి నన్ను స్వీకరించండి అని కోరింది. విప్రుడు చేసిన యాగప్రభావం బాగా ఫలించిందని సంతోషించిన ఉత్తముడు తన భార్యని అక్కున చేర్చుకున్నాడు. రాజు భార్య "స్వామీ నావల్ల నాగరాజు కుమార్తె మూగదైపోయింది. దయచేసి ఆమె మూగతనాన్ని పోగొట్టండి అని కోరింది. వెంటనే రాజు ఓ విప్రవరా! నా భార్య కోరిన ప్రకారం నాగరాజు కుమార్తెకి మీరే మూగతనాన్ని పోగొట్టాలి అని ప్రార్థించాడు.

రాజు ప్రార్థన విన్న విప్రుడు రాజా! నేను సరస్వతీ ఇష్టి అనే కార్యక్రమాన్ని చేస్తాను తద్వారా నాగరాజు కుమార్తె మూగతనం పోయి, నీభార్య ఋణ విముక్తురాలవుతుంది అని చెప్పి ఆ ఇష్టిని దిగ్విజయంగా పూర్తిచేసాడు. నాగరాజు కుమార్తెకి మూగతనం పోయింది. ఈ వృత్తాంతమంతా గర్గమహర్షి పాతాళానికి వెళ్ళి నాగరాజు కుమార్తెతో చెప్పాడు. తనకి మాటలు తెప్పించినది తన సఖి అయిన భూలోకరాణి అని తెలుసుకుని ఎంతో ఆనందించిన ఆ 'నంద' వెంటనే భూలోకానికి వచ్చి రాణి దగ్గరకి వెళ్ళి ఆమెని ఆదరంగా కౌగిలించుకుంది. ఆమె చేసిన పనికి కృతజ్ఞతలు తెలిపి ఉత్తముడితో ఇలా అంది.

ఓ నరాధిపా! మీకు ఉత్తముడు మహావీరుడైన కుమారుడు జన్మిస్తాడు. ఈ భూమండలాన్నంతా అతడు పాలిస్తాడు. అంతేకాదు నీ కుమారుడు మన్వంతరానికి అధిపతి అవుతాడు అని చెప్పి తన లోకానికి వెళ్ళిపోయింది. కాలక్రమంలో ఆమె చెప్పినట్టే రాణికి షోడశ కళాప్రపూర్ణుడైన చంద్రుడులాంటి కాంతితో ఒక బాలుడు జన్మించాడు. అతడు పుట్టిన వెంటనే దేవదుందుభులు మ్రోగాయి. పూలవాన కురిసింది. రాజ్యంలో ప్రజలందరూ సంబరాలు చేసుకున్నారు. ఎంతోమంది మహర్షులు ఆ బాలుణ్ణి ఆశీర్వదించటానికి వచ్చారు. వారంతా ఆ బాలుడు శుభలక్షణాలు చూసి 'ఔత్తముడు' అని నామకరణం చేసారు.

ఈ బాలుడు ఉత్తమ వంశంలో, ఉత్తమ కాలంలో, ఉత్తమఅవయవాలతో జన్మించాడు. కాబట్టి ఔత్తముడనే పేరుతోనే విఖ్యాతి పొందుతాడు. అంతేకాదు ఈ బాలుడు మహావీరుడై మనువుగా ప్రసిద్ధి చెందుతాడు" అని రాజుతో చెప్పారు.

ఈ ఔత్తమ మన్వంతరం గురించిన కథనాన్ని ఎవరు వింటారో వారికి ఎప్పుడూ తన భార్యాపుత్రులతో, మిత్రులతో వియోగం కలుగదు. ఈ ఔత్తమ మన్వంతరంలో 'స్వధామ' అనే పేరుతో దేవతలు, నామానురూపులు అనే పేరుతో ప్రమథగణాలు తేజస్సుతో ప్రకాశిస్తారు. దేవతలందరి రెండోగణాలు 'సత్యులు' అని పిలువబడతారు. దేవతల మూడోగణాలు 'శివులు' అని చెప్పబడతారు. 'శివ' అన్నపేరు స్మరించటంతోనే అన్ని పాపాలూ నశించిపోతాయి.

ఓ క్రౌష్టుకీ! ఈ ఔత్తమ మన్వంతరంలో దేవతలకి సంబంధించిన నాలుగో గణాలు 'ప్రదర్ధనులు' అనే పేరుతో ప్రసిద్ధి చెందుతారు. ఐదోగణాలు 'వశవర్తులని' కీర్తించబడతారు. మొత్తంగా ఈ మన్వంతరంలో పన్నెండు దేవతా గణాలున్నాయి. ఈ దేవతలందరికీ 'సుశాంతుడు' అనేవాడు వంద అశ్వమేధయాగాలు చేసి ఇంద్రపదవి పొంది వారికి ప్రభువయ్యాడు. ఈ సుశాంతుడు అన్నిలోకాలకీ శాంతిని ప్రసాదించి గొప్ప కీర్తి పొందాడు. ఔత్తమ మనువుకి కాలక్రమంలో 'అజ' 'పరశుచి' 'దివ్య' అనే పేర్లతో ముగ్గురు పుత్రులు జన్మించారు. వారు కూడా మహాబలవంతులుగా, ధర్మప్రభువులుగా ప్రసిద్ధి చెందారు. ఈ ఔత్తమ మన్వంతరం ఎంతకాలం వుంటుందో అంతకాలం వారి వంశంలోని వారంతా ఈ భూమండలాన్ని పాలిస్తారు.

యుగాల గణనలో సత్యయుగం, త్రేతాయుగం, ద్వాపరయుగం, కలియుగం అని నాలుగు యుగాలు చెప్పబడ్డాయి. ఈ నాలుగుయుగాల్లో కొంచెం ఎక్కువగా మన్వంతరకాలం నిర్దిష్టంగా వుంది. ఈ మన్వంతరంలో తపుడు అనే మహర్షికి జన్మించిన ఏడుగురు కుమారులు సప్తర్షులుగా వున్నారు.

## తామస మన్వంతరం

**పూ**ర్వం 'స్వరాష్ట్రుడు' అనే పేరుతో ఒక మహారాజుండేవాడు. అతడు మహావీరుడు, ఎన్నో యజ్ఞయాగాలు చేసినవాడు. జ్ఞానసంపన్నుడు కూడా.

ఆ మహారాజుకి సూర్యభగవానుడు దీర్ఘాయువుని ప్రసాదించాడు. అతడికి మొత్తం వందమంది భార్యలున్నారు. అయితే వారెవరూ స్వరాష్ట్రుడంత దీర్ఘాయువు వున్నవాళ్ళు కాదు. అందుకే అతడికన్నా ముందే ఆయువుతీరి మరణించారు. అదేవిధంగా అతడి మిత్రులు, భృత్యులు, మంత్రులు, బంధువులు కూడా కాలానుగుణంగా మృతి చెందారు. ఇలా తన కళ్ళముందే తన అనుకున్న వారంతా మరణించటంతో స్వరాష్ట్రుడు ఎంతో చింతాక్రాంతుడయ్యాడు. దానివల్ల అతడు క్రమంగా బలాన్ని కోల్పోయాడు. ఈ విషయం గ్రహించిన శత్రురాజులు అదే అదునుగా భావించి అతడి రాజ్యంమీద దాడిచేసి రాజుని పదవీచ్యుతుణ్ణి చేసారు.

రాజ్యాన్ని కోల్పోయిన స్వరాష్ట్రుడు ఎంతో బాధపడుతూ శత్రువులకి చిక్కకుండా తప్పించుకుని, వితస్తా నదీతీరానికి చేరి తపస్సు చేయసాగాడు. ఆ రాజు ఎంతో కఠోరంగా నిరాహారుడై తన తపస్సుని కొనసాగిస్తున్నాడు. ఒకనాడు వర్షాకాలం కారణంగా అన్నివైపుల నుంచీ ఆకాశంలో మేఘాలు క్రమ్ముకుని ధారాపాతంగా వర్షం కురిసింది. చుట్టూ అంధకారం వ్యాపించింది. కురిసిన వాన మహాప్రవాహంగా మారి స్వరాష్ట్రుడు తపస్సు చేస్తున్న ప్రాంతాన్ని ముంచెత్తింది. ఆ ప్రవాహంలో పడి స్వరాష్ట్రుడు కొట్టుకుపోతున్నాడు. అతడికి కొంతదూరం వెళ్ళిన తరువాత అదే ప్రవాహంలో ఒక ఆడలేడి కనిపించింది. దాన్ని పట్టుకుని నెమ్మదిగా ఒడ్డుకి చేరుకున్నాడు.

స్వరాష్ట్రుడు ప్రవాహం నుంచి ఒడ్డుకి చేరే సమయంలో ఆ ఆడమృగం వీపుని గట్టిగా కౌగిలించుకున్నాడు. ఆ సమయంలో అతనికి ఏదో తెలియని ఆనందం కలిగింది. ఒక స్త్రీని కౌగిలించుకున్న భావన కలిగి, కామంతో కూడిన ఆనందాన్ని పొందాడు. ఆ మృగం రాజుతో సహా ఒడ్డున వున్న అడవిలోకి చేరాక రాజు మనసులో తన మీద అనురాగం కలిగిందని తెలుసుకుని “రాజా! మీకు నామీద శృంగార భావం కలిగిందని నేను గ్రహించాను. నేను మీకు తగినదాన్ని కాను. మన సమాగమానికి లోలుడు అనేవాడు విఘ్నాలు కలిగిస్తాడు” అన్నది.

స్వరాష్ట్రుడు ఆ మృగం మాటలు విని నీవెవరు? మృగానివై వుండే మనిషిలా ఎలా మాట్లాడగలుగుతున్నావు? లోలుడనేవాడు ఎవరు? అని ప్రశ్నించాడు.

రాజా! నేను దృఢధన్వుడనే రాజు కుమార్తెను. నాపేరు ఉత్పలావతి. నేను పూర్వజన్మలో మీకు భార్యగా వున్నాను. నా చిన్నతనంలో చెలికత్తెలతో ఆడుకుంటూ ఒక వనానికి వెళ్ళాను. అక్కడ ఒక మృగాన్ని చూసి బాల్య చాపల్యంతో దాన్ని దండించాను. అప్పుడు అక్కడే మగమృగంతో వున్న ఆడమృగం బెదిరిపోయింది. అది చూసిన మగమృగం నాతో "ఓసీ మూర్ఖురాలా! నీవల్ల నా ఆడమృగం బెదిరిపోయింది. నేను ఆమెతో సంగమిస్తున్న సమయంలో దండించి మా సమాగమాన్ని చెడగొట్టావు" అని నిష్ఠుర వాక్యాలు పలికాడు.

మనిషిలా మాట్లాడుతున్న ఆ మృగం మాటలు విని భయంగా మీరు ఎలా ఈ మృగరూపాన్ని పొందారు? అని ప్రశ్నించాను. ఆ మృగం నాకిలా చెప్పింది "నాపేరు సంతపుడు. నేనొక ఆడమృగాన్ని అనుభవించాలని కోరుకుని మృగరూపాన్ని ధరించాను. ఈ వనంలో సంచరిస్తున్న ఒక ఆడమృగాన్ని చూసి పరవశించి దాన్ని అనుసరించి దానితో సంగమిస్తున్న సమయంలో నీవొచ్చి మాకు ఆటంకాన్ని కలిగించావు. ఈ దోషానికి నిన్ను శపిస్తాను" అని ఆగ్రహంగా అన్నాడు. నేను క్షమించమని ప్రార్థించినా అతడు వినలేదు. పైగా నన్ను కోరుకున్నాడు. నేను తిరస్కరించేసరికి కోపంగా నన్ను మృగానివి కమ్మని శపించాడు.

నేను తిరిగి మృగాన్ని ప్రాధేయపడగా మృగరూపంలో వున్న సుతపుడు కరుణించి "తరుణీ! నా శాపం వ్యర్థం కాదు. నీవు మరణించిన తరువాత రెండోజన్మలో మృగరూపాన్ని ధరిస్తావు. నీవలా మృగరూపంలో ఈ అడవిలో సంచరిస్తుండగా ఒక మహావీరుడి స్పర్శద్వారా గర్భాన్ని పొందుతావు. సిద్ధవీర్యుడనే మునికుమారుడు మహా బాహులోలుడనేవాడు నీ గర్భం నుంచి

జన్మిస్తాడు. వీర్యవంతుడైన ఆ లోలుడు తండ్రి కోల్పోయిన రాజ్యాన్ని తిరిగి సాధిస్తాడు. అంతేకాదు శత్రువులందరినీ చంపి మనువు అవుతాడు” అని చెప్పాడు.

మహారాజా ఆవిధంగా నేను శపించబడి మృగంగా రెండోజన్మ ఎత్తాను. తమరి స్పర్శ కారణంగా నా గర్భంలో శిశువు ఉదయించింది. ప్రస్తుతం నేను గర్భవతిని. అందుకే తమరితో సంభోగం కుదరదని చెప్పాను. ఎందుకంటే మనకి గర్భంలో వున్న లోలుడు ఆటంకాలు కలిగిస్తాడు” అని పలికింది.

మృగం మాటలు విన్న స్వరాష్ట్రుడికి ఎంతో ఆనందం కలిగింది. తన కుమారుడు శత్రురాజుల్ని జయించి ఈ భూమండలానికి ‘మనువు’ అవుతాడన్న విషయం ఆయనకి సంతోషాన్ని కలిగించింది. కొద్దికాలం తరువాత ఆ మృగం సకలశుభ లక్షణాలతో ప్రకాశిస్తున్న అందమైన బాలుణ్ణి ప్రసవించింది.

బాలుడు జన్మించగానే అన్ని ప్రాణులూ ఆనందించాయి. రాజు కూడా సంతోషించాడు. అదే సమయంలో మృగం కూడా శాప విముక్తురాలయ్యింది. తరువాత ఋషులు, మునులు అక్కడికి వచ్చి ఆ బాలుడి గుణగణాలు రూపురేఖలు పరిశీలించి “ఈ బాలకుడు జగత్తు అంధకారం ద్వారా ఆవరించబడి తామస యోనిని పొందిన తల్లి గర్భం నుంచి పుట్టాడు కనుక ఇతడికి ‘తామస’ అనే పేరు సమంజసంగా వుంటుందని రాజుకి చెప్పారు. రాజు అనుమతితో అతడికి ‘తామస’ అని నామకరణం చేసి వెళ్ళిపోయారు.

స్వరాష్ట్రుడికి జన్మించిన తామసుడు క్రమంగా పెరిగి పెద్దవాడయ్యాక ఒకనాడు తండ్రి దగ్గరకి వచ్చి తండ్రీ! మీకు నేను పుత్రుణ్ణి ఎలా అయ్యాను? నా తల్లి ఎవరు? అని ప్రశ్నించాడు. రాజు జరిగిన పూర్వ వృత్తాంతాన్నంతా తామసుడికి తెలియచేసాడు.

అంతావిన్న తామసుడు శత్రువుల్ని జయించాలన్న లక్ష్యంతో సూర్యుణ్ణి ఆరాధించి ఎన్నో దివ్యాస్త్రాలు సంపాదించాడు. వెంటనే తన రాజ్యాన్ని ఆక్రమించిన శత్రురాజుల మీద దండెత్తి వారిని ఓడించి తండ్రి పాదాల దగ్గర

పదేశాడు. తండ్రి ఆజ్ఞని అనుసరించి తిరిగి వారిని క్షమించి చంపకుండా వదిలిపెట్టాడు. కొంతకాలం గడిచాక స్వరాష్ట్రుడు మహావీరుడైన తన కుమారుడికి రాజ్యాభిషేకం చేసి స్వర్గానికి చేరుకున్నాడు. తామసుడు సంపూర్ణంగా భూమండలాన్నంతా జయించి పృధివీపతిగా తామస మనువుగా కీర్తి పొందాడు.

ఈ తామస మన్వంతరంలో 1.సత్యగుణ 2.సుధీగణ 3.సురూపగణ 4.హరిగణ అనే నాలుగు రకాల దేవతలుంటారు. వీటిలో ఒక్కో గణంలో ప్రత్యేకంగా ఇరవై ఏడుమంది దేవతలుంటారు. ఈ మన్వంతరంలో 'మహావీర్యశిఖ' అనేవాడు వంద యజ్ఞాలు చేసి ఇంద్ర పదవిని అధిష్టించి దేవతలకి ప్రభువయ్యాడు. ఈ మన్వంతరంలో 1.జ్యోతిర్ధర్మా 2.పృధు 3.కావ్య 4.చైత్ర 5.అగ్ని 6.బలక 7.పీవర అనే పేర్లతో సప్తర్షులుంటారు. తామస మనుచక్రవర్తికి క్రమంగా నర, క్షాంతి, శాంత, దాంత, జాను, జంఘా అనే మహావీరులైన కుమారులు జన్మించారు.

ఈ తామస మన్వంతరగాధని మార్కండేయ మహర్షి క్రౌష్టుకుడికి వినిపించాడు. ఈ దివ్యగాథ విన్నవారికి, పఠించిన వారికి అజ్ఞానరూపమైన అంధకారం ఎప్పటికీ దరిచేరదు.

## రైవత మన్వంతరం

**పూ**ర్వం ఋతవకుడు అనే మహర్షి ఉండేవాడు. అతడికి ఎంత కాలానికీ సంతానం కలుగలేదు. చాలాకాలం తరువాత రేవతీ నక్షత్రంనాడు ఒక కుమారుడు జన్మించాడు. ఋతవకుడు లేకలేక కలిగిన పుత్రుణ్ణి ఎంతో గారాబంగా పెంచి పెద్దచేసాడు. ఉపనయనాది కర్మలు జరిపించాడు. అయితే ఆ ఋషి కుమారుడు శీలం లేనివాడయ్యాడు. అతడు పుట్టిన దగ్గర నుంచి ఋతవకుడు దీర్ఘవ్యాధి పీడితుడయ్యాడు. అతడి తల్లి కూడా కుష్ఠు వ్యాధిగ్రస్తురాలయ్యింది. వారిద్దరూ ఇలా ఎన్నో బాధలు పడసాగారు.

ఒకనాడు దుర్మార్గుడైన ఋతవకుడి పుత్రుడు వేరొక మునికుమారుడి భార్యని అపహరించాడు. ఆ విషయం తెలుసుకున్న ఋతవకుడు దుఃఖిస్తూ "అయ్యో! ఎందుకు నాకిలా జరుగుతోంది? దుర్మార్గుడైన పుత్రుడు వుండేకన్నా అసలు సంతానం లేకపోవటం ఎంతో మంచిది. నా పుత్రుడి వల్ల నాకిన్ని కష్టాలు వచ్చాయి" అని చింతించాడు. కొన్నాళ్ళకి గర్గముని అతడి దగ్గరకి వచ్చాడు. ఋతవకుడు తన కుమారుడి విషయమంతా ఆయనకి విన్నవించి "స్వామీ! ఎందుకు నాకీ దురవస్థ కలిగింది. దుర్మార్గుడైన పుత్రుడు నాకెందుకు జన్మించాడు? నేను చేసిన దోషం ఏమిటి? అని వినయంగా ప్రశ్నించాడు.

గర్గముని అతడితో "మహర్షీ! నీ కుమారుడు రేవతీ నక్షత్రం చివరి ఘడియల్లో జన్మించాడు. అది దుష్టకాలం. అందుకే నీ కుమారుడు నీకు దుఃఖాన్ని కలుగచేస్తున్నాడు. నీది, నీ భార్యది తప్పేంలేదు" అని కారణాన్ని వివరించాడు. తన దుఃఖానికి కారణం రేవతీ నక్షత్రం మీద ఆగ్రహం కలిగింది వెంటనే రేవతీ నక్షత్రాన్ని పతిరాలు అగుగాక! అని శపించాడు.

ఋతవకుడి శాపంతో నింగిలో వున్న రేవతీ నక్షత్రం అందరూ చూస్తుండగా కుముదపర్వతం మీద పడిపోయింది. అది పడటంతోనే ఆ పర్వతం నాలుగుదిక్కులా వున్న గుహల్ని సెలయేర్లని ప్రకాశింపచేసింది. రేవతీ నక్షత్రం పడిన నాటి నుంచి ఆ కుముద పర్వతం 'రైవతక పర్వతం' అనే పేరుతో ప్రసిద్ధి గాంచింది. ఆ పర్వతం మీదున్న సరోవరం నుంచి రేవతీనక్షత్ర కాంతి ప్రసారం వల్ల ఒక అందమైన కన్య ఆవిర్భవించింది. రేవతీనక్షత్ర కాంతితో జన్మించిన ఆ కన్య 'రేవతి' అనే పేరుతో ప్రసిద్ధురాలయ్యింది. ఆ పర్వతం మీదే నివాసముంటున్న ప్రముచుడనే ముని రేవతిని తన ఆశ్రమానికి తీసుకువెళ్ళి పెంచసాగాడు. కొంతకాలానికి రేవతి యుక్తవయస్కురాలయ్యింది. ప్రముచ ముని ఆమెకి తగిన భర్త ఎవరు? అని ఆలోచించాడు. ఎవరూ ఆయనకి స్ఫురించలేదు. వెంటనే యాగశాలకి వెళ్ళి అగ్నిదేవుణ్ణి ఆవాహనచేసి ఆయన్ని అడిగాడు. అగ్ని మునితో "మహా పరాక్రమవంతుడు, సౌందర్యవంతుడు అయిన 'దుర్గముడు' అనే మహారాజు రేవతికి భర్త అవుతాడు" అని చెప్పాడు.

కొంతకాలం గడిచాక అగ్ని చెప్పిన విధంగా, స్వాయంభువ మనువు వంశంలో జన్మించిన దుర్గమ మహారాజు వేటాడుతూ ప్రముచుడి ఆశ్రమానికి వచ్చాడు. అక్కడ ఎవరూ కనిపించలేదు. లోపలికి వెళ్ళగా దివ్యసౌందర్యంతో ప్రకాశిస్తున్న రేవతి ఆయనకి కనిపించింది. ఆమెని చూసి "ప్రియా ఆశ్రమంలో ఎవరూ లేరా? మునీశ్వరుడు ఎక్కడికి వెళ్ళారు? అని ప్రశ్నించాడు. ఈ మాటలు హోమశాలలో వున్న ప్రముచమునికి వినిపించాయి. ఆయన వెంటనే హోమశాల నుంచి బైటకివచ్చి ఆశ్రమంలో వున్న దుర్గముణ్ణి చూసాడు. అతడే అగ్నిదేవుడు చెప్పిన రాజని గ్రహించాడు. ఆయన దుర్గముడితో "రాజా ఇదిగో ఈ రేవతీ నా కుమార్తె. ఈమెని వివాహం చేసుకో" అని కోరాడు.

ముని మాటలు విన్న దుర్గముడికి ఏమీ అర్ధంకాలేదు. "స్వామీ! రేవతి ఎవరు? ఈమెని నేను వివాహం చేసుకోవటమేమిటి? నాకేం బోధపడటంలేదు. వివరంగా చెప్పండి" అన్నాడు దుర్గముడు. "రాజా! ఇది నా నిర్ణయంకాదు. నా కుమార్తెకి తగిన వరుడెవడు?అని అగ్నిదేవుణ్ణి ప్రశ్నించగా, ఆయన నీవే ఈమెకి తగిన వరుడవని ఆయన చెప్పాడు" ఇది దైవనిర్ణయం. అందుకే నీవామెని వివాహం చేసుకో నీకు శుభం జరుగుతుంది" అన్నాడు.

ప్రముచుడి మాటలు విన్న రేవతి మధ్యలో కల్పించుకుని తండ్రీ! మీకు నామీద ప్రేమ ఉంటే రేవతీనక్షత్ర ఘడియల్లో నా వివాహం చేయండి అని ప్రార్ధించింది.

అమ్మా! రేవతీనక్షత్రం ఇప్పుడు చంద్రమార్గంలో లేదు. పూర్వం ఋతవాకుడనే ఋషి ఆ నక్షత్రాన్ని భూమిమీదకి పడిపోయేలా చేశాడు అని చెప్పాడు ప్రముచముని. తండ్రీ! అయితే మీరు మీ తపశ్శక్తితో ఆ నక్షత్రాన్ని నింగిలో నిలపండి అని కోరింది. కుమార్తె మాటని కాదనలేక, ఆమె కోరిన విధంగానే రేవతీనక్షత్రాన్ని తిరిగి చంద్రమార్గంలో నిలిపాడు ప్రముచముని.

తరువాత రేవతికి దుర్గముడికి ఘనంగా వివాహం జరిపించి తన అల్లుడైన దుర్గముడితో "రాజా! నా కుమార్తెని మీరు వివాహం చేసుకున్నారు.

చాలా సంతోషం. మీకేదైనా వరం ఇవ్వాలనుకుంటున్నాను కోరుకోండి" అని అడిగాడు ముని. దుర్గముడు మునితో "మహర్షీ నేను స్వాయంభువ మనువు వంశంలో జన్మించినవాడిని. మీ అనుగ్రహంతో 'మనువు' అయ్యే లక్షణాలున్న కుమారుణ్ణి పొందాలని కోరుతున్నానన్నాడు. తథాస్తు నీ కోరిక ఫలిస్తుంది. నీ పుత్రుడు మనుచక్రవర్తి అవుతాడు అని ఆశీర్వదించాడు ప్రముచుడు.

దుర్గముడు తన భార్య రేవతిని తీసుకుని తన రాజ్యానికి బయలుదేరాడు. కొంతకాలానికి రేవతి గర్భం ధరించి ఒక కుమారుణ్ణి కన్నది. మహావీరుడుగా పెరిగి పెద్దయిన ఆ రాకుమారుడు తన భుజపరాక్రమంతో భూమండలాన్నంతా జయించి 'రైవత మనువు' అనే పేరుతో విశ్వవిఖ్యాతి చెందాడు.

ఈ రైవత మన్వంతరంలో 1.సుమేధా 2.భూపతి 3.వైకుంఠ 4.అమితాభ అనే నాలుగు దేవతాగణాలు ప్రధానంగా వుంటాయి. ఇవిగాక ఇతర గణాలలో పద్నాలుగుమంది దేవతలు ఒక్కో దానిలో వుంటారు. ఈ దేవగణాలన్నింటికీ వందయజ్ఞాలు చేసిన 'విభుడు' అనేవాడు ఇంద్రుడుగా వుంటాడు. ఈ రైవత మన్వంతరంలో 1.హిరణ్యరోముడు 2.వేదశ్రీ 3.ఊర్ధ్వబాహు 4.వేదబాహు 5.సుధామ 6.పర్జన్యుడు 7.వశిష్ఠుడు అనేవారు సప్తర్షులుగా వుంటారు. రైవత మనువుకి బలబంధు, మహావీర్య, సుయష్టవ్య, సత్యక అనే కుమారులు జన్మించారు.

పవిత్రమైన ఈ రైవత మన్వంతరగాథని విన్నవారు, చదివినవారు పాపాల నుంచి విముక్తులవుతారు. ఈ చరిత్రని మార్కండేయమహర్షి క్రౌష్టుకి మునికి వివరించి చెప్పాడు.

## చాక్షుష మన్వంతరం

**పూ**ర్వం అనమిత్రుడు, గంభద్ర అనే క్షత్రియ దంపతులకి ఆనందుడు అనే కుమారుడు జన్మించాడు. కాలక్రమంలో ఆనందుడు మోక్షాన్ని పొందాలని అడవికి వెళ్ళి తపస్సు చేయటం ప్రారంభించాడు. కొంతకాలం తరువాత బ్రహ్మదేవుడు అతడికి ప్రత్యక్షమై వత్సా! ఎందుకు నీవు తపస్సు చేస్తున్నావు?

అని ప్రశ్నించాడు. అందుకు ఆనందుడు "బ్రహ్మన్! నాకు ఈ ప్రపంచంలో అన్ని పనులు సంసారబంధానికి హేతువులుగానే కనిపిస్తున్నాయి. కనుక సంసార బంధంలో చిక్కుకోకుండా మోక్షాన్ని పొందాలని తపస్సు చేస్తున్నా" అని బదులిచ్చాడు. అదివిని బ్రహ్మ, "కుమారా! కర్మవంతులే ముక్తికి అర్హులు, నీవు కర్మవంతుడివి కాకపోతే ఎలా ముక్తిని పొందగలవు? నీవు కారణజన్ముడివి. నీకు నిర్దేశించిన కార్యాలు చేయకుండా ఇలా అన్నీ త్యజించి వైరాగ్యంతో తపస్సు చేయటం ధర్మంకాదు. నీవు ఆరో మను చక్రవర్తివి అవుతావు. నీకు నిర్దేశించిన కార్యాలు చేసిన తరువాత నీకు ముక్తి తపస్సు చేయకుండానే లభిస్తుంది. కనుక ఇప్పుడీ తపస్సును చాలించు" అని పలికాడు.

బ్రహ్మదేవుడి ఆదేశం విని తపస్సు చాలించాడు ఆనందుడు. వెంటనే బ్రహ్మ అతన్ని 'చాక్షుష' అనే పేరుతో పిలిచాడు. ఆనాటి నుంచి ఆనందుడు 'చాక్షుష మనువు' అనే పేరుతో విశ్వవిఖ్యాతి చెందాడు. కొంతకాలానికి చాక్షుషుడు ఉగ్రుడనే రాజు కుమార్తె విదర్భ అనే కన్యని వివాహం చేసుకుని ఆమె ద్వారా వీరాధివీరులైన పుత్రుల్ని కన్నాడు.

ఈ చాక్షుష మన్వంతరంలో దేవతల ప్రథమగణాలు 'ఆప్య' అనే పేరుతో వుంటాయి. ఆ దేవగణాలలో ఎనిమిదిమంది ప్రధాన దేవతలుంటారు. రెండవ దేవతగణాలు 'ప్రసూత' అనే పేరుతో వ్యవహరించబడతాయి. వీటిలో కూడా ఎనిమిదిమంది ప్రధాన దేవతలుంటారు. మూడో ప్రధానగణం 'భవాఖ్య' అనే పేరుతో వుంటుంది. ఇందులో ఎనిమిది మంది దేవతలుంటారు. అలాగే 'యూథం' అనే నాలుగో గణంలో 'అమృతాశులు' అనే ఐదోగణంలో ఎనిమిదిమంది ప్రధాన దేవతలుంటారు.

ఈ అయిదురకాల దేవగణాలన్నిటికీ వెయ్యి యజ్ఞాలుచే ఇంద్రుడైన 'మనోజవ' అనేవాడు అధిపతిగా వుంటాడు. ఈ చాక్షుష మన్వంతరంలో 1.సుమేధా 2.విరజా 3.హవిష్యాన 4.ఉన్నత 5.మధు 6.అతి 7.సహిష్ణుడు అనే ఏడుగురు సప్తర్షులుగా వుంటారు. చాక్షుష మనువుకి ఉరు, పురు, శతద్యుమ్న అనే కుమారులు జన్మించి వారంతా భూమండలానికి అధిపతులయ్యారు.

ఈ చాక్షుష మన్వంతరగాథని మార్కండేయమహర్షి క్రౌష్టుకిమునికి చెప్పాడు. ఎవరైతే ఈ గాథని వింటారో, లేక పఠిస్తారో వారు ఆయురారోగ్య సుఖసంపదల్ని పొందుతారు.

## వైవస్వత మన్వంతరం

**పూ**ర్వం విశ్వకర్మ తన కుమార్తె అయిన సంజ్ఞాదేవిని సూర్యుడికిచ్చి వివాహం చేసాడు. సూర్యుడినే వివస్వానుడు అంటారు. కొంతకాలానికి సూర్యుడికి సంజ్ఞాదేవి వల్ల మహాజ్ఞాన తేజోబల సంపన్నుడైన కుమారుడు జన్మించాడు. వివస్వుడి కుమారుడు కాబట్టి ఆ బాలకుడు వైవస్వతుడని వ్యవహరించబడి మనువుగా విశ్వవిఖ్యాతి పొందాడు. సూర్యుడి ప్రచండమైన వెలుగుని సంజ్ఞాదేవి భరించలేకపోయేది. అందుకే సంయోగ సమయంలో భయంతో ఆయన్ని చంచలమైన దృష్టితో చూసేది. అది గమనించి సూర్యుడామెని చంచలంగా చూస్తున్న నీకు చంచలచిత్తం గల కుమార్తె జన్మించుగాక! అని అన్నాడు.

కాలక్రమంలో సూర్యుడి వచనం ప్రకారం సంజ్ఞాదేవికి యమున అనే కన్య, యముడు అనే కుమారుడు జన్మించారు. యమున యమునానదిగా మారింది.

సూర్యుడి తాపాన్ని భరించలేని సంజ్ఞాదేవి తన రూపంతోనే ఒక ఛాయారూపాన్ని సృష్టించి ఆమెని తన భర్త దగ్గర వుంచి పుట్టింటికి వెళ్ళిపోయింది. అక్కడ తన తండ్రి విశ్వకర్మ ఆదేశం మేరకు ఆడగుర్రం రూపాన్ని ధరించి ఉత్తరకురు దేశంలో తపస్సు చేసుకో సాగింది.

సూర్యుడికి తన దగ్గర వున్నది ఛాయా సంజ్ఞాదేవి అని తెలియదు. ఆమెనే తన నిజమైన భార్యగా భావించి తిరిగి ఆమె ద్వారా ఇద్దరు కుమారుల్ని ఒక కుమార్తెని కన్నాడు. అయితే ఛాయా సంజ్ఞాదేవి తన సంతానం మీద ఉన్న ప్రేమని అసలు సంజ్ఞాదేవి సంతానం మీద చూపటం లేదు. ఈ విషయాన్ని గ్రహించి ఆవేశం ఆపుకోలేక తన సవితి తల్లిని తన్నటానికి కాలు పైకెత్తాడు. అదిచూసి ఆగ్రహించిన ఛాయా సంజ్ఞాదేవి నీపాదం తెగి పడిపోవుగాక!" అని యముణ్ణి శపించింది.

తల్లి శాపం విని ఆశ్చర్యపోయిన యముడు వెంటనే తండ్రి సూర్యుడి దగ్గరకి వెళ్ళి జరిగిన విషయమంతా చెప్పాడు. దానితో అనుమానం వచ్చిన సూర్యుడు ఛాయా సంజ్ఞాదేవిని పిలిచి నిజం చెప్పమని గట్టిగా గద్దించటంతో ఆమె జరిగిందంతా ఆయనకి విన్నవించింది. సూర్యుడు తన తేజస్సుని భరించలేక సంజ్ఞాదేవి వెళ్ళిపోయిందని తెలుసుకుని ఎంతో బాధపడి వెంటనే మామగారైన విశ్వకర్మ దగ్గరకి వెళ్ళి తన తేజస్సుని తగ్గించమని కోరాడు. అల్లుడి కోరిక మేరకు విశ్వకర్మ తన దివ్యశక్తితో సూర్యుడి తేజస్సులో వున్న పదిహేను భాగాల్ని వేరుచేసాడు.

సూర్యుడిలో వున్న ఋఙ్మయ తేజస్సుతో భూమి, యజుర్మయ తేజస్సుతో ఆకాశం, సామతేజస్సుతో స్వర్గం ప్రకాశించాయి. మిగిలిన తేజోభాగాలతో విశ్వకర్మ పరమేశ్వరుడి త్రిశూలాన్ని, మహావిష్ణువు సుదర్శన చక్రాన్ని, వసుగణాలకి శంఖాలని, అగ్నిదేవుడి దారుణశక్తిని నిర్మించాడు. అలాగే సూర్యుడి తేజస్సుతో కుబేరుడికి పల్లకిని, మిగిలిన యక్షకిన్నెర, కిం పురుష, గంధర్వాది గణాలన్నిటికీ బలమైన ఆయుధాల్ని తయారుచేసి ఇచ్చాడు. ఈవిధంగా పదిహేను భాగాలు తగ్గించుకుని కేవలం పదహారో భాగమే తన తేజస్సుని ధరించాడు సూర్యుడు. ఈ విధంగా సూర్యుడు తన తేజస్సుని తగ్గించుకుని మరింత అందంగా అందరిలా చూడటానికి యోగ్యంగా ప్రకాశించటంతో దేవతలంతా ఆయన్నిలా స్తుతించారు.

నమస్తే ఋక్స్వరూపాయ సామరూపాయతే నమః ।
యజుః స్వరూప రూపాయ సామ్నాంధామవతే నమః ॥ 1

జ్ఞానైకధామభూతాయ నిర్ధూత తమసే నమః ।
శుద్ధజ్యోతి స్వరూపాయ విశుద్ధాయాఽమలాత్మనే ॥ 2

వరిష్ఠాయ వరేణ్యాయ పరస్మై పరమాత్మనే ।
నమోఽఖిల జగద్వ్యాఽపి స్వరూపాయాఽత్మ మూర్తయే ॥ 3

నమః సూర్య స్వరూపాయ ప్రకాశాఽత్మ స్వరూపిణే ।
భాస్కరాయ నమస్తుభ్యం తథా దినకృతే నమః ॥ 4

శర్వరీహేతవేచైవ సంధ్యా జ్యోత్స్నా కృతే నమః ।
త్వం సర్వమేతద్భగవాన్ జగదుద్భ్రమకా త్వయా ॥ 5

**(శ్లో॥1-5 అధ్యాయం-75)**

ఓ సూర్యభగవానుడా ఋక్, యజు, సామ స్వరూపుడవైన నీకు నమస్కారం. జ్ఞానానికి నీవే ఆధారం. అంధకారాన్ని పోగొట్టేది నీవే. నీవు శుద్ధజ్యోతి స్వరూపుడివి. పరిశుద్ధుడివి. పవిత్రాత్మ కలవాడివి. నీకు నమస్కారం. వరిష్ఠుడివి, వరేణ్యుడివి, పరమాత్మవి, జగద్వ్యాపివి, ఆత్మమూర్తివి అయిన నీకు నమస్కారం. ప్రకాశించే ఆత్మస్వరూపుడివి, సూర్యుడివి, భాస్కరుడివి, దినకరుడివి అయిన నీకు నమస్కారం. ఈ జగత్తు భ్రమించటానికి కారణమైనవాడివి, రాత్రికి సంధ్యా జ్యోత్స్నా కాలాలకి కారకుడివి అయిన నీకు నమస్కారం.

తరువాత సూర్యుడు ఎంతో ఉత్సాహంగా తాను కూడా ఒక మగగుర్రం రూపాన్ని ధరించి ఉత్తరకురు దేశంలో వున్న తన భార్య దగ్గరకి వెళ్ళాడు. ఆమె అతన్ని ముందు గుర్తించలేదు. కొద్దిసేపటికి ఆ గుర్రం రూపంలో వచ్చింది తన భర్తేనని తెలుసుకుంది సంజ్ఞాదేవి. తరువాత వారిద్దరి నాసికలు కలుసుకున్నాయి. వెంటనే వాటినుంచి 'నాసత్య' 'దస్రు' అనే కుమారులు జన్మించారు. కొద్దిసేపట్లో వారి సంయోగం వల్ల 'రేవంతుడనే మరో కుమారుడు జన్మించాడు. అప్పుడు సూర్యుడు తేజస్సుని తగ్గించుకొని తన యదార్థ రూపాన్ని చూపించాడు. అదిచూసి సంతోషించిన సంజ్ఞాదేవి తన నిజరూపాన్ని ధరించింది. ఇద్దరూ కలిసి తమ గృహానికి చేరుకున్నారు.

సంజ్ఞాదేవి ద్వారా జన్మించిన సూర్యుడి జ్యేష్ఠ కుమారుడు వైవస్వతుడనే పేరుతో మనువుకాగా, రెండో కుమారుడైన యముడు తండ్రి ద్వారా యమధర్మరాజ పదవిని పొందాడు. కుమార్తె యమున నదిగామారి భూలోకంలో ప్రవహించ సాగింది. తరువాత జన్మించిన అశ్వినీ కుమారులిద్దరూ దేవవైద్యులుగా నియమించబడ్డారు. గుర్రం రూపంలో వుండగా పుట్టిన రేవంతుడు గుహ్యకులకి అధిపతి అయ్యాడు.

ఛాయాసంజ్ఞ ద్వారా పుట్టిన సూర్యుడి కుమారుల్లో పెద్దవాడు 'సావర్ణి' అనే పేరుతో ప్రసిద్ధి చెందాడు. ఇతడు రాబోయేకాలంలో బలిచక్రవర్తి ఇంద్ర పదవిని అధిష్టించే సమయంలో మనుచక్రవర్తి అవుతాడు. ఇక రెండో కుమారుడైన శనిగ్రహ మండలంలో ఒకడుగా నియమించబడ్డాడు. సూర్యుడి చిన్నకుమార్తె 'తపతి' అనే కన్య సంవరణుడనే రాజుని వివాహం చేసుకుని 'కురు' అనే పుత్రుణ్ణి పొందింది.

ఈ వైవస్వత మన్వంతరంలో ఆదిత్య, వసు, రుద్ర, సాధ్య, విశ్వ, మరుత, భృగు, అంగిరస అనే ఎనిమిదిమందీ దేవతలుగా వుంటారు. వీరిలో ఆదిత్యులు, వసురుద్ర గణాలు కశ్యపుడి సంతానంకాగా, భృగుగణ దేవతలు, భృగుమహర్షి పుత్రులు. అలాగే అంగిరోగణాలు అంగీరసుడి పుత్రులు. ఈ సర్గాన్ని మారీచసర్గం అంటారు.

ఈ మన్వంతరంలో 'ఊర్జస్వి' అనే మహాత్ముడు వంద అశ్వమేధయాగాలు చేసి ఇంద్రుడైనాడు. పూర్వం ఇంద్ర పదవిని పొందినవారు ప్రస్తుతం ఇంద్రపదవిని పొందినవారు దేవేంద్రుడితో సమానంగా సహసాక్షులుగా, వజ్రాయుధధారులుగా, పురంధరులుగా విఖ్యాతి పొందుతారు.

మనం ఉన్న ఈ లోకాన్ని భూలోకమనీ, అంతరిక్షాన్ని దివ్యలోకమని, స్వర్గాన్ని దివ్యాఖ్యమని అంటారు. ఇవే ముల్లోకాలు. ఈ వైవస్వత మన్వంతరంలో 1.అత్రి 2.వశిష్ఠ 3.కశ్యప 4.గౌతమ 5.భరద్వాజ 6.విశ్వామిత్ర 7.జమదగ్ని సప్తర్షులుగా వుంటారు. వైవశ్వత మనువుకి నాభాగ, ధృష్ట, శర్యాతి, నరిష్యంత, దిష్ట, కరూష, పృషధ్రుడు అనే తొమ్మిదిమంది కుమారులు జన్మించారు. వీరు భూమండలమంతా జయించి మహావీరులుగా ప్రసిద్ధి చెందారు.

ఈ వైవస్వత మన్వంతరగాథని మార్కండేయమహర్షి క్రౌష్టుకిమునికి చెప్పాడు. పవిత్రమైన ఈ దివ్యగాథని పఠించినా, విన్నా పాపాలు నశించి పుణ్యలోకాలు ప్రాప్తిస్తాయి.

## సావర్ణి మన్వంతరం

**వై**వస్వత మన్వంతరం తరువాత, సూర్యుడికి ఛాయాసంజ్ఞాదేవికి జన్మించిన 'సావర్ణి' మనుచక్రవర్తి పదవిని పొందాడు. ఇతడు ఎనిమిదో మనువు. ఈ మన్వంతరంలో 1.రామ 2.వ్యాస 3.గాలవ 4.దీప్తిమాన్ 5.కృప 6.ఋష్యశృంగ 7.ద్రౌణి (అశ్వద్ధామ) సప్తర్షులుగా వుంటారు. ఇందులో 1.సుతప 2.అమితాభ 3.ముఖ్య అనే ప్రధాన దేవతలుంటారు. వీరికి ప్రత్యేకంగా ఇరవై చొప్పున మూడు ప్రత్యేకగణాలుంటాయి. ఈ ముగ్గురు దేవతలకీ కలిపి మొత్తం అరవై గణదేవతలుంటారు.

ఈ గణాలలో 1.సుతపుడి గణంలో – తపస్తవ, శుక్ర, ద్యుతి, జ్యోతి, ప్రభాకర, ప్రభాస, దయిత, ధర్మ, తేజ, రశ్మి, వక్రతుడు వంటి దేవతలు ఉంటారు. 2.అమితాభుడి గణంలో–ప్రభు, విభు, విభాస వంటి గణాలుంటాయి. అలాగే దమ, దాంత, ఋత, సోమ, వింత, ఇత్యాది దేవతలు మూడోదైన 'ముఖ్య' అనే గణంలో వుంటారు. ఈ మన్వంతరంలో వుండే వారంతా కశ్యప ప్రజాపతి సంతానం. వీరంతా ఈ సావర్ణి మన్వంతరంలో దేవతలుగా వుంటారు. విరోచనుడి కుమారుడైన బలిచక్రవర్తి ఈ మన్వంతరంలో ఇంద్రపదవిని అధిష్టిస్తాడు. సావర్ణి మనువుకి విరజా, ఆర్వ, వీర, నిర్మోహ, సత్యవాక, కృతి, విష్ణు అనే కుమారులు ఉదయించారు. వారంతా మహావీరులుగా ప్రసిద్ధిచెంది తదనంతరకాలంలో భూమండలాన్ని పాలించారు.

## శ్రీ దుర్గా సప్తశతి

**సృ**ష్టి స్థితి లయకారిణైన దుర్గాదేవి చరిత్రను, ఆమె ధరించిన వివిధ రూపాలలోని ఆంతర్యాన్ని తెలియచేసే పురాణాల్లో మార్కండేయ పురాణం ఒకటి. ఈ పురాణంలో అంతర్భాగంగా 700 శ్లోకాలలో దేవీ మహాత్మ్యం గురించి ఆమె ప్రభావం గురించి సవివరంగా చెప్పబడింది. ఈ 700 శ్లోకాల్నే సప్తశతి అని అంటారు. దేవీ మహిమను తెలిపేది కాబట్టి దీనిని, దేవీ సప్తశతి అని,

దుర్గా సప్తశతి అని వ్యవహరిస్తారు. పేర్లు వేరైనా విషయం ఒక్కటే. ఈ సప్తశతిలో మహామాయ అయిన ఆది ప్రకృతి–మహాకాళీ, మహాలక్ష్మీ, మహాసరస్వతీ స్వరూపాల్ని ధరించి, తామస, రాజస, సాత్త్విక ప్రవృత్తులతో, ప్రవర్తిస్తుంది. ఇందులోని ప్రథమ చరిత్రలో మహాకాళీ స్వరూపంతో మధుకైటభుల సంహారానికి తోడ్పడటం, మధ్యమ చరిత్రలో మహాలక్ష్మీ స్వరూపంతో మహిషాసురుణ్ణి తానే వధించటం, అలాగే ఉత్తర చరిత్రలో శుంభ నిశుంభుల్ని మహాసరస్వతిగా పరిమార్చటం గురించి వివరంగా వర్ణించబడింది.

**శ్లో॥ బన్ధూక కుసుమాభాసాం పంచముండాధి వాసినీమ్ ।**
**స్ఫురచ్చంద్ర కలారత్న మకుటాం ముండమాలినీం ॥**
**త్రినేత్రాం రక్తవసనాం పీనోన్నత ఘటస్తనీమ్**
**పుస్తకంచాక్ష మాలాం చ వరం చా భయం క్రమాత్**
**దధతీం సంస్మరేన్నిత్యముత్తరామ్నాయ మానితామ్ ॥**

**శ్లో॥ యా చణ్డీ మధుకైటభాది దలనీ, యా మాహిషోన్మూలినీ**
**యా ధూమ్రేక్షణ చణ్డముణ్డ మథనీ యా రక్త బీజాశనీ**
**శక్తిః శుంభ నిశుంభ దైత్య దలనీ యా సిద్ధిధాత్రీ పరా**
**సా దేవీ నవకోటి మూర్తి సహితా మాం పాతు విశ్వేశరీ ॥**

అనే శ్రీ చండీ ధ్యానంతో ఈ సప్తశతి ప్రారంభం అవుతుంది. ఇక చండీ సప్తశతి అన్నా దుర్గా సప్తశతి అన్నా ఒక్కటే అని ఈ పురాణంలో మార్కండేయ మహర్షి చేత చెప్పబడిన దేవీ కవచస్తోత్రం మనకి తెలియజేస్తుంది. ఈ కవచం....

**శ్లో॥ అస్తి గుహ్యా తమమం విప్ర సర్వభూతోపకారకమ్ ।**
**దేవ్యాస్తు కవచం పుణ్యం తచ్ఛృణుష్వ మహామునే ॥**

శ్లో॥ ప్రథమం శైలపుత్రీతి ద్వితీయం బ్రహ్మచారిణీ ।
తృతీయం చంద్రఘంటేతి కూష్మాండేతి చతుర్థకమ్ ॥

శ్లో॥ పంచమం స్కంధ మాతేతి షష్ఠం కాత్యాయనీతథా ।
సప్తమః కాలరాత్రిశ్చ మహాగౌరీతిచాష్టమమ్ ॥

శ్లో॥ నవమం సిద్ధిదాత్రీ చ నవదుర్గాః ప్రకీర్తితాః ।
ఉక్తాన్యేతాని నామాని బ్రహ్మణైవ మహాత్మనా ॥

శ్లో॥ అగ్నినా దహ్య మానాస్తు శత్రుమధ్యగతా రణే ।
విషమే దుర్గమేచైవ భయార్తాః శరణాం గతాః ॥

అని నవదుర్గలు గురించి ఆ దేవతల ప్రభావం గురించి తెలియజేస్తూ ప్రారంభమవుతుంది. ఈ కవచస్తోత్రంలో సకల శక్తి స్వరూపిణి. బహురూపా అయిన దుర్గాదేవి చాముండా, వారాహీ, ఐన్ద్రీ, వైష్ణవీ, మహావీర్యా, శివదూతీ, మాహేశ్వరీ, వారుణీ, మృగవాహినీ, కౌబేరీ, శూలధారిణీ, బ్రహ్మీణీ, జయా, విజయా, అజితా, అపరాజితా, ద్యోతినీ, ఉమా, మాలధారీ, యశస్వినీ, త్రినేత్రా, యమఘంటా, చండికా, శంఖినీ, ద్వారవాసినీ, కాళికా, శంకరీ, సుగంధా, చర్చికా, అమృతబాలా, సరస్వతీ, చిత్రఘంటా, మహామాయా, కామాక్షీ, సర్వమంగళా, భద్రకాళీ, ధనుర్ధరీ, నీలగ్రీవా, నలకూబరీ, ఖడ్గినీ, వజ్రధారిణీ, దండినీ, అంబికా, శూలేశ్వరీ, నరేశ్వరీ, మహాదేవీ, లలితా, శూలధారిణీ, కామినీ, గుహ్యేశ్వరీ, దుర్గా, గుహ్యావాహినీ, భగవతీ, మేఘవాహనా, మహాబలా, మాధవనాయికా, నారసింహీ, కౌశికీ, శ్రీధరీ, పాతాళవాసినీ, దంష్ట్రకరాళీ, ఊర్ధ్వకేశినీ, యోగీశ్వరీ, పార్వతీ, కాళరాత్రి, ముకుటేశ్వరీ, పద్మావతీ, చూడామణీ, జ్వాలాముఖి, అభేద్యా, బ్రహ్మీణీ, ఛత్రేశ్వరీ, ధర్మధారిణీ, వజ్రహస్తా, కళ్యాణశోభనా, యోగినీ, నారాయణీ, మహాలక్ష్మీ, భైరవీ, ధనేశ్వరీ, క్షేమంకరీ, జయంతీ... అని వివిధ నామాలతో కీర్తించబడింది.

మహామహిమోపేతమైన ఈ సప్తశతిలో దుర్గాదేవి మహాకాళి, మహాలక్ష్మి, మహాసరస్వతీ అనే త్రిశక్తి స్వరూపిణిగా మనకి కనిపిస్తుంది. ఈ మూడు శక్తులైన కాళి, లక్ష్మి, సరస్వతులు, త్రిమూర్తులైన బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుల భార్యలు కారు. ఆది ప్రకృతి దుర్గాదేవి అంశావతారాలు.

**శ్రీ మహాకాళీ చరిత్ర :**

దుర్గా సప్తశతిలోని ప్రథమచరిత్రలో దుర్గాదేవి మహాకాళీ స్వరూపంతో మధు కైటభులనే రాక్షసుల్ని సంహరించడటంలో యోగమాయరూపంలో, విష్ణుమూర్తికి సహాయం చేసినట్టు చెప్పబడింది.

## మహాకాళీ స్తుతి

**శ్లో॥ ఖడ్గం చక్రగదేషు చాపపరిఘా శూలం భుశుణ్డీం శిరః ।**
**శఙ్ఖం సన్దధతీం కరైస్త్రినయనాం సర్వాఙ్గ భూషావృతామ్ ।**
**యా హన్తుం మధుకైటభౌ జలజ భూస్తుష్టావ సుప్తే హరౌ ।**
**నీలాశ్మ ద్యుతిమాస్య పాద దశకాం సేవే మహాకాళికాం ॥**

ఖడ్గం, చక్రం, గదా, బాణం, ధనుస్సు, పరిఘ, శూలం, భుశుండీ, మనిషి తల, శంఖం అనే పది ఆయుధాల్ని పది చేతుల్లో ధరించి, మూడుకళ్ళతో, స్వర్ణాభరణాలతో నిండివున్న శరీరంతో, శోభిస్తున్న మహాకాళీదేవి, విష్ణుమూర్తి యోగనిద్రలో వున్నప్పుడు మధుకైటభ రాక్షసుల్ని వధించటానికి బ్రహ్మదేవుడి చేత స్తుతించబడింది.

ఈ విధంగా ఇంద్రనీలమణి వంటి శరీరకాంతి కలిగింది, పదిముఖాలు, పదిపాదాలు కలిగింది అయిన మహాకాళీదేవికి నమస్కారాలు సమర్పిస్తూ ఈ చరిత్ర ప్రారంభం అవుతుంది.

పూర్వం కల్పాంతంలో ప్రళయం వచ్చి ఈ జగత్తంతా ఏకమైపోయి జలమయంగా తయారైంది. ఆ జలంలో స్థితికారకుడైన శ్రీ మహావిష్ణువు శేషపాన్పు మీద యోగనిద్రలో వుండగా, ఆ సమయంలో ఒక సంఘటన జరిగింది.

నిద్రలో వున్న ఆ విష్ణుమూర్తి చెవిలోని గుబిలి నుంచి ఘోరమైన రూపం కలిగిన మధు-కైటభుడు అనే ఇద్దరు రాక్షసులు పుట్టారు. వాళ్ళు పుట్టిన వెంటనే, అక్కడ కనిపించిన బ్రహ్మదేవుణ్ణి చంపటానికి ప్రయత్నించారు.

వారిని చూసి భయపడిన బ్రహ్మదేవుడు, విష్ణువు నాభి నుంచి పుట్టిన కమలంలోకి వెళ్ళి కూర్చున్నాడు. ఇక ఆ రాక్షసుల బారి నుంచి తనని కాపాడేది ఆ విష్ణుమూర్తే అని భావించిన బ్రహ్మ ఆయన యోగనిద్రలో వున్నాడని గ్రహించాడు. వెంటనే ఆయన్ని నిద్ర లేపటానికి ఆయన కళ్ళలో నిద్రా రూపంలో వున్న యోగమాయని ఏకాగ్రచిత్తంతో

**శ్లో॥ విశ్వేశ్వరీం జగద్ధాత్రీం స్థితి సంహారకారిణీమ్**
**నిద్రాం భగవతీం విష్ణోరతులాం తేజసః ప్రభుః ॥**

అని ప్రార్థించాడు. అంతేకాక "ఓ తల్లీ సకలలోకపాలకురాలవైన నీ ప్రభావం వల్ల, ఈ జగత్తుని సృష్టించి నిర్వహించి, లయం చేయగలిగిన విష్ణుమూర్తి కూడా నిద్రావశమైనాడు. త్రిమూర్తులమైన మమ్మల్ని సృష్టించిన నీకు నమస్కరిస్తున్నాను. మహా భయంకరులైన ఈ మధుకైటభుల్ని నీ శక్తితో సమ్మోహితుల్ని చెయ్యి, ఈ విష్ణుమూర్తిని త్వరగా మేల్కొలిపి ఆ రాక్షసుల్ని సంహరించేలా అనుగ్రహించు," అని వేడుకున్నాడు.

ఆ విధంగా బ్రహ్మ చేత స్తుతించబడిన తామసశక్తి స్వరూపిణైన మహాకాళీదేవి, వెంటనే నిద్రలో వున్న మహావిష్ణువు నేత్రాల నుంచి, నాసిక నుంచి, బాహువుల నుంచి, హృదయం నుంచి, వక్షఃస్థలం నుంచి బైటకి వచ్చి బ్రహ్మదేవుడికి దర్శనమిచ్చింది.

అలా యోగమాయ ప్రభావం వదలటంతో నిద్ర నుంచి మేల్కొన్న విష్ణువు; తన నాభి కమలంలో వున్న బ్రహ్మదేవుణ్ణి, మధుకైటభులు మింగివేయటానికి ప్రయత్నించే దృశ్యాన్ని చూసాడు, అంతే కోపంతో ఆయన కళ్ళు ఎర్రబడ్డాయి;

పైకి లేచి మహావేగంతో ఆ రాక్షసులిద్దరితో బాహుయుద్ధాన్ని ప్రారంభించాడు. అలా ఐదువేల సంవత్సరాలు గడిచాయి. వారి మధ్య యుద్ధం జరుగుతూనే వుంది.

అప్పుడొక విచిత్రం జరిగింది. యోగమాయా ప్రభావంతో మదగర్వితులైన ఆ మధుకైటభులిద్దరూ, ఒకసారి యుద్ధాన్ని ఆపి "ఓ విష్ణూ! మేం నీ పరిస్థితికి జాలి పడుతున్నాం, మమ్మల్ని ఎలాగూ నీవు గెలవలేవు, నీకొక వరాన్ని అనుగ్రహిస్తున్నాం, ఏం కావాలో కోరుకో!" అని అవివేకంగా పలికారు. ఇదే తగిన సమయం అని భావించిన విష్ణుమూర్తి "ఓ రాక్షసులారా నేను మిమ్మల్ని కోరే వరం ఒక్కటే. నా చేతిలో మీరిద్దరూ మరణించాలి. ఇదే నా కోరిక" అని చెప్పాడు.

అలా మహామాయ చేత వచించబడ్డ ఆ మధుకైటభులు ఇక తమ చావు తప్పదని గ్రహించి ఇచ్చిన మాట నిలబెట్టుకోవటం కోసం ప్రాణత్యాగానికి సిద్ధపడి విష్ణుమూర్తితో ఇలా అన్నారు. "ఓ విష్ణూ నీ కోరికను మన్నిస్తున్నాం. ఈ జగత్తంతా జలమయంగా కనిపిస్తోంది. ఇందులో భూమి ఎక్కడ నీళ్ళలో మునిగివుండదో ఆ స్థలంలో మమ్మల్ని చంపు" అని మెలిక పెట్టారు. అప్పుడు జగన్నాటక సూత్రధారైన విష్ణుమూర్తి అలాగే అని వారిద్దర్నీ తన కటిప్రదేశం (తొడల మీద)కూర్చోబెట్టుకొని వారి తలల్ని తన సుదర్శన చక్రంతో నరికేశాడు.

ఈ విధంగా మహామాయా స్వరూపిణైన మహాకాళీదేవి బ్రహ్మదేవుణ్ణి రక్షించి మధుకైటభ విధ్వంసినిగా ప్రసిద్ధి పొందింది.

## శ్రీ మహాలక్ష్మీ చరిత్ర :

ఇక మధ్యమ చరిత్రలో దుర్గాదేవి మహాలక్ష్మీ స్వరూపంతో మహిషాసురుడనే రాక్షసుణ్ణి స్వయంగా సంహరించిన వృత్తాంతం చెప్పబడింది.

### మహాలక్ష్మీ స్తుతి

**శ్లో॥ అక్షస్రక్పరశుం గదేషు కులిశం పద్మంధనుః కుణ్డికాం**
**దణ్డంశక్తి మసిం చ చర్మ జలజం ఘణ్టాం సురాభాజనమ్**
**శూలం పాశ సుదర్శనే చ దధతీం హస్తైః ప్రవాళప్రభామ్**
**సేవే సైరిభ మర్దినీమిహ మహాలక్ష్మీం సరోజస్థితామ్ ॥**

1.అక్షమాల 2.గంఢ్రగొడ్డలి 3.గద 4.బాణం 5.వజ్రాయుధం 6.కమలం 7.ధనస్సు 8.కలశం 9.దండం 10.శక్తి 11.ఖడ్గం 12.డాలు 13.శంఖం 14.ఘంట 15.మద్యపాత్ర 16.శూలం 17.పాశం 18.సుదర్శన చక్రం అనే పద్దెనిమిది ఆయుధాల్ని పద్దెనిమిది చేతుల్లో ధరించినది, పగడపు వర్ణం కలిగింది, తామరపువ్వు మీద ఆసీనురాలైనది, మహిషాసుర సంహారిణీ అయిన మహాలక్ష్మీదేవికి నమస్కరిస్తూ ఈ చరిత్ర ప్రారంభమౌతుంది.

పూర్వం దేవతలకి దానవులకి ఘోరమైన యుద్ధం జరిగింది. వంద సంవత్సరాల పాటు జరిగిన ఆ యుద్ధంలో దేవతలంతా ఓడిపోగా అసురులు జయించారు. ఆ అసురుల నాయకుడైన మహిషాసురుడు ఇంద్రుణ్ణి తొలగించి అతని సింహాసనాన్ని ఆక్రమించాడు.

అలా ఓడిపోయిన దేవతలంతా దైన్యంతో బ్రహ్మదేవుణ్ణి తీసుకొని శివకేశవుల దగ్గరకెళ్ళి వారికి జరిగిందంతా చెప్పారు. అది విన్న శివకేశవులకి తీవ్రమైన కోపం వచ్చింది. వెంటనే వారి ముఖం నుంచి ఒక దివ్యతేజస్సు ఉద్భవించింది. వెంటనే బ్రహ్మ ఇంద్రాది దేవతల శరీరాల నుంచి కూడా వారి దివ్యతేజస్సులు బైటకివచ్చాయి. అలా అందరి తేజస్సులన్నీ కలిసిన ఆ మహాతేజస్సు ముల్లోకాలు వ్యాపించిన ప్రకాశంతో ఒక స్త్రీ రూపాన్ని ధరించింది. ఈ విధంగా సకల దేవతల తేజస్సుల నుంచి ఉద్భవించిన ఆ దేవికి, దేవతలంతా తమ తమ ఆయుధాల్ని ప్రసాదించగా, హిమవంతుడు ఆమెకి సింహ వాహనాన్ని ఇచ్చాడు.

ఆ విధంగా బహు ఆయుధ, బహు ఆభరణ సంశోభిత అయిన ఆ దేవి మహోత్సాహంతో ఉచ్చ స్వరంతో సింహనాదం చేసింది. ఆ నాదాన్ని విని చలించిపోయిన అసురులంతా భయంతో మహిషాసురుణ్ణి చేరారు. "ఏమిటీ భయంకర ధ్వని! ఇది ఎక్కడినించి వచ్చింది? ఎవరు చేశారు" అని తన అనుచరుల్ని తీసుకొని ఆ శబ్దం వచ్చిన వైపుకి వెళ్ళాడు మహిషాసురుడు.

అంతే ఒక్కసారి అతని కళ్ళు ఆశ్చర్యంతో పెద్దవయ్యాయి. దివ్యమైన కాంతితో ముల్లోకాలు వ్యాపించిన శరీరంతో, **"దశ భుజసహస్రేణ సమన్తాద్వ్యాప్య సంస్థితామ్"** వేయి చేతులతో దిక్కులంతా ఆక్రమించిన, సింహవాహినైన ఒక మహాశక్తి స్వరూపం అతనికి దర్శనమిచ్చింది.

కొంతసేపటికి ఆ దేవీ ప్రభావం నుంచి తేరుకున్న మహిషాసురుడు, దేవితో యుద్ధాన్ని ప్రకటించాడు. దేవికి దైత్యులకు మధ్య ఘోరమైన సంగ్రామం ప్రారంభమైంది. చిక్షురుడు, చామరుడు, ఉదగ్రుడు, మహాహనుడు, అసిలోముడు, బాష్కలుడు, పరివారితుడు, బిడాలుడు అనే మహిషాసురుడి మిత్ర రాక్షసులంతా మహిషుడికి అండగా తమ తమ సైన్యాలతో దేవి మీద యుద్ధానికి వచ్చారు. యుద్ధం భయంకరంగా సాగుతోంది. సకల శత్రుభయంకరి అయిన ఆ దేవి మహాక్రోధంతో, ఆ రాక్షస సైన్యాన్నంతా నాశనం చేసింది. అది చూసి ఆ సైన్యాధిపతులంతా కోపంతో దేవిని చంపబోగా, సకలదేవతా స్వరూపిణి దుర్గాదేవి ఆ సైన్యాధిపతులందర్నీ ఘోరంగా వధించింది. ఇలా తన సైన్యం అంతా నాశనమవుతుంటే చూడలేక మహిషాసురుడు చివరికి తనే స్వయంగా యుద్ధరంగంలోకి ప్రవేశించాడు. తన భీకరమైన మహిషరూపంతో దేవీ సైన్యాన్నంతా చెల్లాచెదురు చేశాడు. ఇంతలో తన మీదకి వస్తున్న దేవీ వాహనమైన సింహాన్ని చంపటానికి పరుగెత్తాడు. ఆ తరువాత కోపంతో మహిషాసురుడు భూమిని గిట్టలతో రాసి, తన కొమ్ముల్తో పర్వతాలన్నిట్నీ ఎగరేశాడు. భయంకరంగా గుండెలు అవిసేలా రంకెలు వేస్తూ దేవి చండికను వధించటానికి ముందుకువచ్చాడు.

అది చూసిన దుర్గాదేవి వెంటనే తన పాశంతో మహిషుణ్ణి బంధించింది. ఇంతలో మహిషుడు సింహ రూపాన్ని ధరించాడు. దేవి తన ఖడ్గంతో ఆ సింహం తలని నరికింది. ఆ తరువాత మహిషుడు ఒక మనిషి రూపాన్ని ధరించాడు. దుర్గ అతన్ని తన బాణంతో పడగొట్టింది. వెంటనే ఒక పెద్ద

ఏనుగు రూపాన్ని ధరించిన మహిషుడు తన తొండంతో దేవీ వాహనమైన సింహాన్ని పట్టుకోబోగా, దేవి ఆ ఏనుగు తొండాన్ని కూడా నరికేసింది.

చివరికి మహిషుడు తన నిజరూపాన్ని ధరించి దేవిని చంపటానికి ప్రయత్నించగా ఆ దుర్గాదేవి ఎగిరి ఆ రాక్షసుడి మీద వాలి, పాదాలతో అతన్ని తొక్కిపట్టి, శూలంతో ఒక పోటు పొడిచింది. అప్పుడు దేవీ పాదాలకింద ఇరుక్కున్న మహిషుడు, మహిష ముఖాన్ని ధరించి నిజస్వరూపంతో, శక్తినంతా కూడదీసుకొని దేవిని ఎదిరించసాగాడు. అంత మహాలక్ష్మి స్వరూపిణైన ఆ చండీదేవి తన మహాఖడ్గంతో అతని శిరస్సుని ఖండించింది.

అలా దేవిచేతిలో మహిషాసురుడు వధించబడటం చూసి దేవతాగణాలన్నీ ఆనందంతో ఎగురుతూ, చిందులు వేస్తూ ఆ దేవిని పలువిధాలుగా కీర్తించారు. అలాగే ఇంద్రాది దేవతలంతా ఆర్తత్రాణ పరాయణైన ఆ దుర్గాదేవిని...

**శ్లో॥ మేధా ఉ సి దేవి విదితాఖిలశాస్త్ర సారా ।**
**దుర్గాసి భవసాగర నౌకసంజ్ఞా ।**
**శ్రీః కైటభారి హృదయైక కృతాధివాసా ।**
**గౌరీత్వమేవ శశిమౌళి కృతప్రతిష్ఠా ॥**

"ఓ జననీ నీవు సర్వశాస్త్రాల్నీ గ్రహించగలిగే మేధా (బుద్ధి) స్వరూపిణివి. దాటటానికి వీలులేని సంసార సాగరాన్ని దాటించి, అవతలి ఒడ్డుకు చేర్చే నావవైన దుర్గాదేవివి, అంతేకాదు. విష్ణువు హృదయంలో నిత్యం కొలువుండే లక్ష్మీదేవివి, పరమేశ్వరుడిలో అర్ధనారీశ్వరీ రూపంతో నిలిచిన గౌరీదేవివి కూడా నీవే తల్లీ," అని సవినయంగా సభక్తికంగా ప్రార్థించారు.

వారి ప్రార్థన విని సంతోషించిన దేవి "మీరు ఎప్పుడు కోరితే అప్పుడు ప్రత్యక్షమై మీ కష్టాల్ని తీరుస్తానని" చెప్పి అంతర్ధానమైంది. ఆ విధంగా దుష్టుడైన మహిషాసురుణ్ణి వధించి లోకాలన్నిటికీ మేలు చేసిన సకలదేవతా తేజోద్భవి అయిన ఆ మహాలక్ష్మీస్వరూపిణి, మహిషాసురమర్ధినిగా లోకంలో ప్రసిద్ధి చెందింది.

## శ్రీ మహాసరస్వతీ చరిత్ర :

దుర్గాసప్తశతిలో ఉత్తరచరిత్ర చివరిది. ఇందులో శుంభ నిశుంభులనే రాక్షసుల్ని అతని పరివారాన్ని దుర్గాదేవి సాత్త్విక శక్తి అయిన మహాసరస్వతి రూపాన్ని ధరించి, వధించటం అనే వృత్తాంతం చెప్పబడింది.

### మహాసరస్వతీ స్తుతి

**శ్లో॥ ఘణ్టాశూలహలాని శఙ్ఖ ముసలే చక్రం ధనుః సాయకం**
**హస్తాబ్జైర్దధతీం ఘనాన్త విలసచ్ఛీతాంశుతుల్యప్రభామ్ ।**
**గౌరీదేహ సముద్భవాం త్రిజగతామాధారభూతాం మహా**
**పూర్వామత్ర సరస్వతీమనుభజే శుమ్భాది దైత్యార్ధినీమ్ ॥**

తన ఎనిమిది చేతుల్లో ఘంట, శూలం, నాగలి, శంఖం, రోకలి, చక్రం, ధనుస్సు, బాణం ధరించేది. మబ్బుల అంచున ప్రకాశించే చంద్రుడితో సమానమైన కాంతి కలిగింది. గౌరీదేవి శరీరంనుంచి పుట్టింది. మూడులోకాలకీ ఆధారభూతమైంది. శుంభనిశుంభాది దానవుల్ని వధించినది, అయిన మహాసరస్వతీ దేవిని స్తుతిస్తూ ఈ ఉత్తరచరిత్ర ప్రారంభమౌతుంది.

పూర్వకాలంలో శుంభ నిశుంభులనే రాక్షసులు వరగర్వంతో ఇంద్రుడి ఇంద్రపదవిని, దేవతల హవిర్భాగాల్ని హరించారు. అలాగే దిక్పాలకులందర్నీ ఓడించి వారి అధికారాలన్నీ కూడా హస్తగతం చేసుకున్నారు. ఇలా ఆ అసురులచేత తమ రాజ్యాధికారాలన్నీ కోల్పోయిన దేవతలంతా, గతంలో మహిషాసుర వధానంతరం "మహాలక్ష్మి స్వరూపిణి తమకి పిలిచినప్పుడు వస్తాను" అని వరం ఇచ్చిన సంగతి గుర్తుతెచ్చుకుని, హిమవత్పర్వతానికి వెళ్ళి ఆ అపరాజితాదేవిని స్మరించారు. విష్ణుమాయారూపిణైన ఆ మహాసరస్వతీ రూపిణిని...

"కష్టాల్ని దాటించే సారస్వతరూపిణీ, సర్వకార్యాల్ని నెరవేర్చే శక్తిరూపిణీ, వివేకజ్ఞానం కలిగినది, కృష్ణ(నల్లని) వర్ణం; ధూమ(పొగ) వర్ణం వంటి శరీరం

కలిగినది అయిన దుర్గాదేవికి ఎల్లప్పుడు మేము నమస్కరిస్తాం” అని ఆ దేవిని పరిపరివిధాలుగా ప్రార్థించసాగారు. ఇంతలో పార్వతీదేవి గంగాజలంలో స్నానం చెయ్యటానికి అక్కడికి వచ్చి, ఈ దేవతలంతా స్తుతించేది ఎవర్ని? అని మనసులో అనుకుంది. ఇంతలో ఆ గౌరీదేవి శరీరకోశం నుంచి ఒక దేవత ఉద్భవించి, ఆమెతో “అమ్మా శుంభ నిశుంభులచేత యుద్ధంలో పరాజయాన్ని పొందిన దేవతలంతా నీ శరీరంలో వున్న నన్ను గురించే ప్రార్ధన చేస్తున్నారని” చెప్పింది.

అలా పార్వతి శరీరం నుంచి ఉద్భవించిన కౌశికీశక్తి నల్లని వర్ణంతో ప్రకాశిస్తూ, కాళికా అనే పేరుతో హిమాలయంలో నివసించసాగింది.

ఇదిలావుండగా ఒకరోజు అపురూప లావణ్యంతో ప్రకాశిస్తూ ఆ హిమాలయాల్లో సంచరిస్తున్న ఆ కౌశికీశక్తిని శుంభనిశుంభుల భృత్యులైన చండ ప్రచండులు చూశారు. వెంటనే తమ ప్రభువైన శుంభుడి దగ్గరకెళ్ళి “ఓరాజా, హిమాలయాల్లో ఒక అపురూప సౌందర్య రాశి సంచరిస్తోంది. జగదేకమోహినైన ఆదేవి నీకు తగినది” అని చెప్పారు. అలావారి మాటలు విన్న శుంభుడు ఉత్సాహంతో సుగ్రీవుడనే వాడిని దేవి వద్దకి దూతగా పంపించగా, ఆ సుగ్రీవుడు దేవి దగ్గరకొచ్చి, ఆమెతో “త్రిలోకసుందరీ నీవెవరో నాకు తెలీదు, మా రాక్షస ప్రభువులైన శుంభుల వారు మహాపరాక్రమ వంతులు. ఈ ముల్లోకాల్ని జయించి ఇంద్ర పదవిని చేపట్టారు. అటువంటి మా సార్వభౌముడు నీతో ఇలా చెప్పమన్నారు.

“ఓ దేవీ మేము నిన్ను స్త్రీలందరిలోకీ వున్నతమైన స్త్రీగా భావిస్తున్నాం, అమితమైన నా ఐశ్వర్యాన్నంతా నీవే అనుభవించు, నీవు నన్నుగానీ, నాతమ్ముడైన నిశుంభుణ్ణిగానీ సేవించు. నన్ను నీవు పెళ్ళాడితే మహాసంపదలు నీకు లభిస్తాయి. అందుకే నీవు నా భార్యవి అవ్వాలని కోరుతున్నా”నని చెప్పాడు. అలా ఆ సుగ్రీవుడి మాటలు విని,

ఈ జగత్తునంతా భరించే శరణాగత పరాయణి, శుభంకరి అయిన దుర్గాదేవి మనసులో ఆ దూత మాటలకి నవ్వుకొని, గంభీరంగా అతడితో ఇలా బదులు చెప్పటం ప్రారంభించింది.

"ఓ సుగ్రీవా నువ్వు నిజమే చెప్పావు. శుంభనిశుంభులిద్దరూ పరాక్రమవంతులే కానీ నాకొక నియమం వుంది. యుద్ధంలో నన్ను ఎవరైతే ఓడిస్తారో, నా బలానికి సమానమైన బలంతో ఎవరుంటారో, అతడే నాకు భర్త అవటానికి అర్హుడౌతాడు" అని చెప్పింది. అలా దేవిమాటలు విన్న సుగ్రీవుడు, ఆమె చెప్పిన మాటల్ని, నియమాన్ని, తిరిగివచ్చి శుంభ నిశుంభులకి వినిపించాడు. అది విని తీవ్రంగా కోపంగా వచ్చిన శుంభుడు, ధ్రూమలోచనుడనే రాక్షసుణ్ణి పిలిచి, దేవిని తీసుకురమ్మని హిమాలయాలకి పంపించాడు.

ఎంతో ఉత్సాహంతో దేవిని బలాత్కారంగా తీసుకెళ్దామని సైన్యంతో వచ్చిన ధూమ్రలోచనుణ్ణి, దుర్గాదేవి 'హుం' అని గర్జించి భస్మం చేసింది. ఆ తరువాత దేవీ వాహనమైన సింహం తనుకూడా గర్జిస్తూ మిగిలిన అసురసైన్యం మీదపడి వారిని వధించింది. వారి మరణవార్త విని చలించిపోయిన శుంభుడు, చండముండులనే రాక్షసుల్ని ఆ అంబికని పట్టుకోవటానికి నియమించాడు. మహావేగంతో ఆ చండముండులిద్దరూ దేవితో యుద్ధానికి తరలివచ్చారు.

వచ్చిన అసుర సైన్యాన్ని చూసిన అంబిక మిక్కిలికోపంతో వారివైపు చూసింది. అంతలో "ఆమెనొసటి నుంచి ఘోరమైన ముఖంతో పెద్దనాలుకతో, ఖడ్గం పాశం వంటి ఆయుధాలు ధరించి, విచిత్రమైన పుర్రెల బెత్తాన్ని ధరించి, పుర్రెల్ని ఆభరణాలుగా ధరించిన కాళికాశక్తి వెలువడింది." ఆ కాళికాశక్తి పెద్దగా నోరుతెరిచి భయంకరమైన నాలుకని చాచి ఆ రాక్షసులందర్నీ మింగేసింది. అది చూచిన చండముండు లిద్దరూ ఆ కాళిని చంపటానికి ముందుకి రాగా, ఆశక్తి వాళ్ళిద్దర్నీ సంహరించి వారితలల్ని తీసుకెళ్ళి

ఆ దుర్గాదేవికి సమర్పించింది. అది చూసి సంతోషించిన దేవి, “ఓ కాళీ నువ్వు చండ ముండుల్ని సంహరించిన కారణంగా నేటి నుంచి చాముండా అనే పేరుతో లోకంలో ప్రసిద్ధి చెందుతావని వరం ఇచ్చింది.”

ఈవిధంగా చండ ముండులు కూడా యుద్ధంలో మరణించటంతో ఆవేశం తెచ్చుకున్న అసురనాథుడైన శుంభుడు, మహాసైన్యంతో యుద్ధానికి వచ్చాడు. శుంభుణ్ణి చూసిన ఆ దేవి తన ధనస్సు అల్లెత్రాడుని ఒక్కసారి మీటింది. భయంకరమైన ఆ ధ్వనికి ముల్లోకాలూ గడగడలాడాయి. అదే సమయంలో కాళికాదేవి కూడా (చాముండా) తన నోటిని తెరిచి హుంకారాన్ని మహాధ్వనితో చేసింది. అది విని రోషావేశపరులైన అసురసైన్యమంతా దేవిని, సింహాన్ని, కాళిని, నాలుగుదిక్కులనుంచీ చుట్టుముట్టారు.

ఆ దృశ్యాన్ని చూసిన బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుడు, కుమారస్వామి, ఇంద్రుల శరీరాలనుంచి, బ్రాహ్మీ, మహేశ్వరీ, కౌమారీ, వైష్ణవి, వారాహి, నారసింహీ, ఐంద్రీ అనే సప్తమాతృకలు వెలువడ్డారు. ఈ శక్తులన్నీ తమతమ వాహనాలు అధిరోహించి దేవికి యుద్ధంలో సాయంగా వచ్చారు. వారిని చూసిన దుర్గా (చండీ) దేవి అతిభయంకరమైన నాదాన్ని చేసింది. ఓటమెరుగని ఆ పార్వతీదేవి తన భర్త అయిన శివుడిని పిలిచి, “ప్రభూ! శుంభనిశుంభుల దగ్గరికి నా దూతగా వెళ్ళి వారితో దేవతలందరికీ వారి స్థానాల్ని వారికిచ్చి, పాతాళానికి పారిపోయి మీ ప్రాణాలు కాపాడుకోండి” అని నా మాటగా చెప్పు అని పంపించింది. శివుణ్ణే దూతగా చేసుకొంది కాబట్టి నాటినుంచి ఆమె శివదూతి అని పిలువబడింది.

అలా శివుడి ద్వారా మహాసరస్వతి మాటల్ని విన్న ఆ దైత్యులు మరింత కోపంతో దేవిని, దేవతాసైన్యాన్ని నాశనం చేయాలని, మరింత తీవ్రంగా యుద్ధం చేయసాగారు. ఇంతలో దేవతల శరీరాలనుంచి పుట్టిన సప్తమాతృకలంతా కలసి కదన రంగంలో అనేక వేలమంది రాక్షసుల్ని పరిమార్చారు.

అది చూసిన రక్త బీజుడనే రాక్షసుడు మహాక్రోధంతో ఆ సప్తమాతృకల్ని తన గదతో తాడించాడు. అప్పుడా శక్తులన్నీ ఒక్కటై రక్తబీజుణ్ణి గాయపరిచాయి. అప్పుడు అతని శరీరం నుంచి కారిన ప్రతిరక్తపు బొట్టునుంచి ఒక్కో రక్తబీజుడు పుట్టుకురాసాగాడు. ఇది చూసి కంగారుపడిన దేవతలంతా మహాసరస్వతికి ఈ విషయాన్ని తెలుపగా, ఆమె వారిని భయపడద్దని చెప్పి కాళీ (చాముండా) దేవిని పిలిచి "ఓకాళీ, నువ్వు నీ విశాలమైన నోరు తెరుచుకొని నీ నాలుకతో నేలమీద పడబోయే రక్తపుచుక్కల్నీ నాకేసేయ్, అప్పుడు రక్తబీజులు పుట్టే అవకాశం వుండదు. చివరికి రక్త క్షయంతో ఆ అసురుడు మరణిస్తాడని చెప్పి, దేవి ఒకేసారి తన శూలంతో, వజ్రాయుధంతో, ఖడ్గంతో, ఈటెల్తో ఆరక్తబీజుణ్ణి గాయపరచగా, అతని గాయాలనుంచి కారే రక్తాన్ని వెంటనే కాళికా (చాముండా) దేవి తాగేయటంతో, క్షీణించిన రక్తబీజుడు చివరికి తన ప్రాణాలు కోల్పోయాడు.

రక్తబీజుడి మరణవార్త విన్న శుంభనిశుంభులిద్దరూ, తీవ్రమైన కోపంతో, ఆవేశంతో, ఆ సప్తమాతృకల్ని, చాముండాని, మహాసరస్వతిని నాశనం చేయాలని పెద్దసైన్యాన్ని తీసుకొని యుద్ధరంగానికి స్వయంగా వచ్చారు. కదనరంగంలో దేవీ – శుంభనిశుంభుల మధ్య ఘోరమైన సంగ్రామం ఆరంభమైంది. శుంభుడి తమ్ముడైన నిశుంభుడు అనేక రకాల ఆయుధాలు ప్రయోగించగా, దేవి వాటన్నిట్నీ ముక్కలు చేసింది. వెంటనే ఆ రాక్షసుడు పదివేల చేతులతో, చక్రాయుధాలతో మహాసరస్వతి శరీరాన్ని కప్పేశాడు. అప్పుడేం జరిగిందంటే...

దుస్సహమైన దుఃఖాల్ని తొలగించే ఆ దుర్గాభగవతీదేవి కోపంతో ఆ చక్రాల్ని తన బాణాలతో ఛేదించింది. చివరికి నిశుంభుడు శూలాన్ని ధరించి దేవిని వధించటానికి రాగా, అంతకన్నా వేగంతో ఆదేవి తనశూలంతో ఆ నిశుంభుణ్ణి పొడిచింది. అంత ఆ నిశుంభుడి శరీరం నుంచి మరోపురుషుడు

బైటికి రాగా అతన్ని కూడా తన కత్తితో నరికివేసింది. అలా నిశుంభుడు ఘోరంగా దేవిచేతిలో మరణించాడు. ప్రాణసమానుడైన తన తమ్ముడు దేవిచేతిలో దుర్మరణం పొందాడన్న వార్తవిన్న శుంభుడు కోపంతో ఓదుర్గా..

శ్లో॥ బలావలేపదుష్టే త్వం మా దుర్గే గర్వమావహ ।
అన్యాసాం బలమాశ్రిత్య యుద్ధ్యసే యాతి మానినీ ॥

బలగర్వంతో నీవు విర్రవీగకు, నువ్వు ఎంతో గొప్పదానివనుకున్నాను. కానీ నువ్వు ఇతరుల బలంమీద ఆధారపడి యుద్ధం చేస్తున్నావు ఇది అన్యాయం అని పలికాడు. ఆ దైత్యుడి మాటలువిన్న దేవి "ఓ దైత్యుడా నేను ఎప్పుడూ ఒంటరిదాన్నే ఈ శక్తులన్నీ నాలోంచే వచ్చాయి. కావాలంటే చూడు వీటన్నిటినీ నాలోనే కలిపేసుకుంటాను" అని చెప్పగా, వెంటనే సప్తమాతృకలు, కాళికాదేవి అందరూ దేవిలో లీనమైపోయారు.

దేవీ శుంభుల మధ్య మరల యుద్ధం ప్రారంభమైంది. ఎన్నో శస్త్రాస్త్రాలు పరస్పరం ప్రయోగించుకున్నారు. ద్వంద్వయుద్ధం కూడా చేశారు. ఆ శుంభుడు దేవిని పట్టుకొని ఆకాశంలోకి ఎగరగా, దుర్గాదేవి ఆకాశంలో ఆ దైత్యుడితో బాహుయుద్ధం చేసింది. అలా వారిమధ్య చాలాకాలం బాహుయుద్ధం కొనసాగింది. చివరికి దేవి శుంభుణ్ణి ఎత్తి భూమిమీదకి విసిరేసింది. భూమ్మీద పడ్డ శుంభుడు తేరుకొని తన పిడికిలి ఎత్తి దుర్గను చంపటానికి పైకి లేవబోగా, దేవి వెంటనే ఒక శూలంతో అతడి వక్షఃస్థలంలో ఒక్కపోటు బలంగా పొడిచింది. ఆ శూలం చేసిన గాయంవల్ల కొంతసేపటికి శుంభుడు గిలగిలలాడుతూ మరణించాడు. ఆ దృశ్యాన్ని చూసిన దేవతలంతా ఆనందతాండవం చేశారు. గంధర్వులు గీతాల్ని పాడారు. అప్సరసలు నాట్యాన్ని చేశారు.

ఈవిధంగా శుంభ నిశుంభ నిషూదినిగా ఖ్యాతిపొందిన దుర్గా (చండీ) దేవి అక్కడున్న దేవతలతో ఇలా పలికింది. "ఓ దేవతలారా.... వైవస్వత మన్వంతరంలో ఇరవై ఎనిమిదో యుగంలో మరో ఇద్దరు శుంభ నిశుంభులనే

రాక్షసులు పుడతారు. అప్పుడు నేను గోపకులంలో యశోదాదేవి గర్భాన జన్మించి వింధ్యాద్రిమీద కొలువుండి ఆ రాక్షసుల్ని పరిమారుస్తాను" అప్పుడు నన్ను వింధ్యవాసినీ అని అంటారు. ఆ తరువాత విప్రచిత్తి వంశానికి చెందిన రాక్షసుల్ని నా దంతాలతో భక్షిస్తాను. అప్పుడు నా పళ్ళు రక్తంతో ఎర్రనిరంగుని పొందుతాయి. ఆ నారూపాన్ని చూసి అందరూ నన్ను రక్తదంతికా అని కీర్తిస్తారు.

మరికొంత కాలానికి భూమ్మీద నూరు సంవత్సరాలు వర్షాలు పడక తీవ్ర దుర్భిక్షం సంభవిస్తుంది. అప్పుడు మునులచేత, బ్రాహ్మణులచేత నేను ప్రార్థించబడి వారిని నా నూరుకళ్ళతో చూసి అను గ్రహిస్తాను. అప్పుడు నన్ను వారంతా శతాక్షీ అని కీర్తిస్తారు. ఓ దేవతలారా ఆ సమయంలో నేను నా శరీరం మీద అనేక రకాల కాయగూరల్ని, ధరించి మనుషుల ఆకలిని తీరుస్తాను, అప్పుడు నన్ను శాకంభరి అని పిలుస్తారు. అదే కాలంలో దుర్గముడనే రాక్షసుణ్ణి నేను వధించి లోకాలన్నిటినీ కాపాడుతాను.

**శ్లో॥ తత్రైవచ వధిష్యామి దుర్గమాఖ్యం మహాసురమ్ ।**
**దుర్గాదేవీతి విఖ్యాతం తన్మే నామభవిష్యతి ॥**

అందుచేత నాకు దుర్గాదేవి అనే ప్రసిద్ధమైన పేరు లోకంలో కలుగుతుంది.

ఆ తరువాత హిమాలయాల్లో తపస్సు చేసుకొనే మునుల్ని బాధించే రాక్షసుల్ని నేను వధిస్తాను. అప్పుడు నన్ను 'భీమాదేవి' అని వ్యవహరిస్తారు. మరికొంతకాలం తరువాత అరుణుడు అనే రాక్షసుడు వర గర్వంతో ముల్లోకవాసులందర్నీ బాధపెడుతుండగా నేను భ్రమర (తుమ్మెద) రూపాన్ని ధరించి వాడిని వధిస్తాను. అప్పుడు నన్నంతా 'భ్రామరీ' అని కీర్తిస్తారు. "ఓ దేవతలారా మీకు ఎప్పుడు కష్టం కలిగినా నన్ను స్మరించండి మిమ్మల్ని నేను ఆదుకుంటాను." అలాగే ఎవరైతే నిశ్చలమైన మనస్సుతో ఈ నా స్తోత్రాన్ని (సప్తశతీ స్తోత్రాన్ని) పారాయణచేస్తారో వారి కోరికలన్నీ నేను నిస్సంశయంగా

తీరుస్తాను. అష్టమీ, చతుర్దశీ, నవమీ తిథుల్లో భక్తితో నా మహాత్మ్యం గురించిన కథను ఎవరు వింటారో వారికి కొంచెం కూడా పాపంగానీ, దారిద్ర్యంగానీ, వియోగంగానీ సంభవించవు.

**శ్లో॥ "శరత్కాలే మహాపూజా క్రియతే యాచవార్షికీ ।**
**తస్యాం మమైతన్మాహాత్మ్యం శృత్వా భక్తి సమన్వితః ॥**

ప్రతి సంవత్సరం శరన్నవరాత్రుల్లో (దసరా నవరాత్రులు) నా మహాపూజ జరిగేటప్పుడు నా మహత్యాన్ని భక్తితో వినేవాళ్ళు, పారాయణ చేసేవాళ్ళు, నాఅనుగ్రహం వల్ల సర్వవిపత్తులనుంచి, వేదనలనుంచి విముక్తి పొంది ధనధాన్యాది సకల సంపదలు పొందుతారు." అని దుర్గాదేవి (చండీ) వారందరికీ చెప్పి అంతర్ధానమైంది.

ఇది మార్కండేయ మహాపురాణాంతర్గతమై దేవీ సప్తశతి అనే 700 శ్లోకాల సారాంశం. ఈ సప్తశతిలో ఆది ప్రకృతి స్వరూపిణైన దుర్గాదేవి, తన దుర్గానామంతోనే కాక ఇంకా వివిధ నామాలతో వ్యవహరించబడింది. దీనివల్ల మనకి చండి అన్నా, దుర్గా అన్నా ఒక్కటే అని, రెండింటికీ భేదం లేనే లేదని స్పష్టంగా తెలుస్తుంది.

## శ్రీ దుర్గాసప్తశతిలోని మహిమాన్విత శ్లోకాలు

ఓం జ్ఞానినామపి చేతాంసి దేవీ భగవతీ హి సా ।
బలాదాకృష్య మోహాయ మహామాయా ప్రయచ్ఛతి ॥

దుర్గేస్మృతా హరసి భీతి మశేషజంతోః ।
స్వస్థైః స్మృతా మతిమతీవ శుభాం దదాసి ।
దారిద్ర్య దుఃఖభయహారిణి కాత్వదన్యా ।
సర్వోపకారకరణాయ సదార్ద్ర చిత్తా ॥

సర్వమంగళ మాంగళ్యే శివే సర్వార్థ సాధికే ।
శరణ్యే త్ర్యంబకే గౌరి నారాయణి నమో஽స్తుతే ॥

శరణాగత దీనార్త పరిత్రాణ పరాయణే ।
సర్వస్యార్తి హరే దేవి నారాయణి నమోऽస్తుతే ॥
సర్వస్వరూపే సర్వేశే సర్వశక్తి సమన్వితే ।
భయేభ్యస్త్రాహి నో దేవి దుర్గే దేవి నమోऽస్తుతే ॥
రోగా నశేషా నపహంసి తుష్టా రుష్టాతు కామాన్ సకలానభీష్టాన్ ।
త్వామాశ్రితానాం న విపన్నరాణాం త్వామాశ్రితాహ్యాశ్రయతాం ప్రయాంతి ॥
సర్వాబాధా ప్రశమనం త్రైలోక్యస్యాఖిలేశ్వరి ।
ఏవమేవ త్వయాకార్యమస్మద్వైరివినాశనం ॥

## దక్షసావర్ణి మన్వంతరం

**ద**క్షుడి కుమారుడైన 'సావర్ణి' తొమ్మిదో మనువుగా భూమండలాన్ని పరిపాలించాడు. ఇతన్నే దక్షసావర్ణి అంటారు. ఆ పేరు మీదగానే ఈ మన్వంతరం దక్షసావర్ణి మన్వంతరం అని ప్రసిద్ధి చెందింది. ఇది తొమ్మిదో మన్వంతరం.

ఈ మన్వంతరంలో 1.పారా 2.మరీచిభర్గ 3.సుధర్మ అనే ప్రధాన దేవతలుంటారు. ఈ ముగ్గురు దేవతలకీ ప్రత్యేకంగా ఒక్కొక్కరికీ పన్నెండు మంది దేవతా గణాలుంటాయి. ఈ మన్వంతరంలో షడాననుడైన కార్తికేయుడు ఇంద్రపదవిని అధిష్టిస్తాడు. 1.మేధాతిథి 2.వసు 3.సత్య 4.జ్యోతిష్మాన్ 5.ద్యుతిమాన్ 6.సుబల 7.హవ్యవాహన అనేవారు సప్తర్షులుగా వుంటారు. దక్షసావర్ణి మనువుకి వరుసగా ధృష్టకేతు, బర్హకేతు, హస్త, నిరామయ, పృథుశ్రవ, అర్చిష్మాన్, భూరిద్యుమ్న, బృహద్భయ వంటి కుమారులు జన్మించారు. వారంతా తదనంతరం భూమండలాన్ని ధర్మబద్ధంగా పాలించారు.

## బ్రహ్మసావర్ణి మన్వంతరం

**ప**దవ మన్వంతరాన్ని బ్రహ్మసావర్ణి మనువు పాలించాడు. ఈయన బ్రహ్మదేవుడి కుమారుడు. ఈ మన్వంతరంలో 1.సుఖాసీన 2.అనిరుద్ధ అనే

ఇద్దరు ప్రధాన దేవతలుంటారు. వారితో పాటు భవిష్యత్తులో కూడా వుండే వందమంది ఇతర దేవతలు కూడా వుంటారు. ఈ మన్వంతరంతో వందరకాల ప్రాణులుంటాయి. 'శాంతి' అనేవాడు ఇంద్ర పదవిని అధిష్టించి దేవతాగణాలకి ప్రభువవుతాడు. 1.ఆపోమూర్తి 2.హవిష్మాన్ 3.సుపిత 4.సత్య 5.నాభాగ 6.అప్రతిమ 7.వశిష్ఠ అనేవారు సప్తర్షులుగా వుంటారు. ఈ బ్రహ్మసావర్ణి మను మహారాజుకి సుక్షేత్ర, ఉత్తమౌజస, భూరిషేణ, వీర్యవాన్, శతానీక, వృషభ, అనమిత్ర, జయద్రధ, భూరిద్యుమ్న, సంపర్వ అనే కుమారులు జన్మిస్తారు. వారు తదనంతరం భూమండలాన్ని పాలించి ఉత్తములుగా ప్రసిద్ధి చెందుతారు.

## ధర్మసావర్ణి మన్వంతరం

**ప**దకొండో మన్వంతరానికి అధిపతి ధర్మసావర్ణి. ఇతడు ధర్ముడి పుత్రుడు. ఈ మన్వంతరంలో 1.విహంగమ 2.కామగ 3.నిర్మాణపతి అనే ముగ్గురు దేవతలు ప్రధాన దేవతగణాలుగా వుంటారు. వీరిలో ఒక్కో గణంతో మరల ముప్ఫైమంది దేవతలు వుంటారు. మాసాలు, ఋతువులు, రోజులకి నిర్మాణపతి గణాలు కారకులుకాగా, రాత్రులకి విహంగమణాలు, సమస్త ముహూర్తజాతక విశేషాలకి కామగ దేవతాగణాలు కారణభూతులవుతున్నారు. ఈ దేవత గణాలన్నిటినీ 'వృషాఖ్యుడు' అనేవాడు ఇంద్రుడుగా పరిపాలిస్తాడు. ఈ మన్వంతరంలో 1.హవిష్మాన్ 2.వరిష్టులు 3.ఋష్టి 4.నిశ్చర 5.అనఘులు 6.విష్టిముని 7.అగ్ని సప్తర్షులుగా వుంటారు. ధర్మసావర్ణి మనుచక్రవర్తికి వరుసగా సర్వత్రగ, సుశర్మ, దేవానీక, పురూద్వహ, హేమధన్వా, దృఢాయువు అనే పుత్రులు జన్మిస్తారు. వారు తదనంతరం భూమండలాన్ని పాలించి ధర్మప్రభువులుగా కీర్తిగాంచుతారు.

## రుద్రసావర్ణి మన్వంతరం

**రు**ద్రుడి పుత్రుడైన సావర్ణి పన్నెండో మన్వంతరానికి అధిపతయ్యాడు. ఈ మన్వంతరంలో 1.సుధర్మ 2.సుమన 3.హరిత 4.రోహిత 5.సంపర్ణ అనే

అయిదు దేవతాగణాలుంటాయి. ఈ గణాలన్నిటిలో ప్రత్యేకంగా ఒక్కొక్క దానిలో పదిమంది దేవతలుంటారు. ఋతుధాముడనేవాడు యజ్ఞాలు చేసి ఇంద్రుడైన ఈ దేవతా గణాలన్నిటినీ పాలిస్తాడు. ఈ మన్వంతరంలో 1.ద్యుతి 2.తపస్వి 3.సుతప 4.తపోమూర్తి 5.తపోనిధి 6.తపోరతి 7.తపోధృతి అనేవారు సప్తర్షులుగా వుంటారు. రుద్రసావర్ణి మనుచక్రవర్తికి వరుసగా దేవ, ఉపదేవ, దేవశ్రేష్ఠ, విదూరథ, మిత్రవాన్, మిత్రవింద అనే కుమారులు జన్మిస్తారు. వారు తదనంతర కాలంలో భూమండలాన్నంతా పాలించే ఉత్తమ ప్రభువులుగా ప్రసిద్ధి చెందుతారు.

## రౌచ్యసావర్ణి మన్వంతరం

**ప**దమూడో మన్వంతరానికి రుచి కుమారుడైన సావర్ణి అధిపతిగా వున్నాడు. అందుకే ఈ మన్వంతరానికి రౌచ్య మన్వంతరం అనేపేరు వచ్చింది. ఈ మన్వంతరంలో 1.సుధర్మ 2.సుకర్మ 3.సుశర్మ అనే ముగ్గురు దేవతలు ప్రధానంగా వుంటారు. వీరికి మహాబలుడుగా ప్రసిద్ధిగాంచిన 'దివస్పతి' అనేవాడు ఇంద్రుడుగా వుంటాడు. ఈ మన్వంతరంలో 1.ధృతిమాన్ 2.అవ్యయ 3.తత్త్వదర్శి 4.నిరుత్సుక 5.నిర్మోహ 6.సుతప 7.నిష్ప్రకంపు అనేవారు సప్తర్షులుగా వుంటారు. రౌచ్యసావర్ణి మనుచక్రవర్తికి వరుసగా చిత్రసేన, విచిత్ర, నియతి, నిర్భయ, దృఢ, సునేత్ర, క్షత్రబుద్ధి, సువ్రత అనేవారు కుమారులుగా జన్మిస్తారు. వారంతా తదనంతరకాలంలో ఉత్తమ పాలకులుగా, జనప్రియులౌతారు.

## రుచి చేసిన పితృస్తవం

**పూ**ర్వం ప్రజాపతి అయిన 'రుచి' లౌకిక విషయాల మీద నిరాసక్తుడై విరాగిగా లోకమంతా సంచరిస్తుండేవాడు. ఆవిధంగా నిస్సంగుడై తిరుగుతున్న 'రుచి'ని చూసి పితృదేవతలు "కుమారా ఎందుకు నీవు విరాగిగా తిరుగుతున్నావు. గృహస్థ ధర్మాన్ని ఆచరించి దేవ, మనుష్య, భూత, పితృగణాల్ని సంతృప్తిపరుచు. అలా చేయకపోతే నీకు ఉత్తమగతులు ప్రాప్తించవు అని బోధించారు.

పితృదేవతల బోధన విన్న రుచికి జ్ఞానోదయమైంది. ముందు సంసారాన్ని నిరాకరించినప్పటికీ చివరికి వివాహం చేసుకోవాలని నిర్ణయించుకున్నాడు. ఉత్తమ కన్యకోసం ఎంతో వెతికాడు. అతడి ప్రయత్నం ఫలించలేదు. తిరిగి తిరిగీ విసిగిపోయి బ్రహ్మదేవుడి గురించి వంద సంవత్సరాలు కఠోరంగా తపస్సు చేసాడు. బ్రహ్మ అతడికి ప్రత్యక్షమై వరం కోరుకోమనగా, రుచి తన కోరికని వెల్లడించాడు. అది విని బ్రహ్మ, "నాయనా! నీకు మంచికన్య లభిస్తుంది. నీకు పుట్టబోయే కుమారుడు మనువు అవుతాడు. నీవు వెంటనే పితృదేవతల్ని స్తుతించువారు సంతోషించి నీకు తగిన భార్యని పుత్రుల్ని అనుగ్రహిస్తారు"అని చెప్పి అదృశ్యమయ్యాడు. బ్రహ్మదేవుడి మాటని అనుసరించి 'రుచి' పితృదేవతల్ని భక్తిగా స్తుతించటం ప్రారంభించాడు.

నమస్యేఽహం పితౄన్ శ్రాద్ధే తయేవనస్త్యధి దేవతా ।
దేవైరపి హితర్ప్యంతే యేచ శ్రాద్ధే స్వధోత్తరైః ॥ 1

నమస్యేఽహం పితౄన్స్వర్గే తర్ప్యన్తే మహర్షిభిః ।
శ్రాద్ధే మనోర్మయైర్భక్త్యా భుక్తిముక్తి మభీప్సుభిః ॥ 2

నమస్యేఽహం పితౄన్స్వర్గే సిద్ధాః సంతర్పయంతియాన్ ।
శ్రాద్ధేషు దివ్యైః సకలైరుపహారై రనుత్తమైః ॥ 3

నమస్యేఽహం పితౄన్నృక్త్యాయేఽర్చ్యన్తే గుహ్యకైరపి ।
తన్మయత్వేన వాంఛద్భిః రుద్ధి మాత్యన్తికీంపరా ॥ 4

నమస్యేఽహం పితృన్మర్త్యైః అర్చ్యంతే భువియేసదా ।
శ్రాద్ధేషు శ్రద్ధయాఽభీష్ట లోకప్రాప్తి ప్రదాయినః ॥ 5

*(అధ్యా-93, శ్లో॥13-17)*

శ్రాద్ధకర్మలలో అధిదేవతలుగా నివసిస్తున్నవారు, దేవతలచేత కూడా శ్రాద్ధకర్మలలో స్వాహాకారాన్ని పలికించి సంతృప్తి చెందుతున్నవారు అయిన పితృదేవతలకి నమస్కరిస్తున్నాను. స్వర్గంలో భక్తి ముక్తి వీటిమీద అభిలాషతో

మనోమయ శ్రాద్ధకర్మల్ని ఆచరించి భక్తిపూర్వకంగా తృప్తిపరుస్తున్న పితృదేవతలకి నమస్కరిస్తున్నాను. స్వర్గంలో వున్న సిద్ధగణాలు శ్రాద్ధ సమయంలో దివ్యమైన, ఉత్తమమైన ఎన్నో ఉపాహారాలతో ఏ పితృదేవతల్ని సంతృప్తి పరుస్తున్నారో వారికి నమస్కరిస్తున్నాను. తమ సమృద్ధికోసం గుహ్యకగణాలు తన్మయభావంతో ఎవరిని పూజిస్తారో ఆ పితృదేవతలకి నమస్కారం. భూలోకంలో శ్రద్ధతో శ్రాద్ధకర్మ చేసిన ప్రజలకి వారివారి కోరికల్ని తీర్చే పితృదేవతలకి నమస్కరిస్తున్నాను.

ఈవిధంగా 'రుచి' చేసిన పితృదేవతా ప్రార్థన విని వారంతా ఎంతో సంతోషించారు. వెంటనే దేదీప్యమానమైన దివ్యతేజస్సుతో అతనిముందు ప్రత్యక్షమయ్యారు. రుచి కోరిన విధంగా ఉత్తమభార్య లభిస్తుంది అనే వరాన్ని ప్రసాదించి అదృశ్యమయ్యారు. పితృదేవతల వరప్రభావ కారణంగా రుచికి ఆ ప్రాంతంలో వున్న ఒక సరోవరం నుంచి 'ప్రమ్లోచ' అనే అప్సరస బైటకి వచ్చి తన కుమార్తె అయిన 'మాలిని' అనే కన్యని 'రుచి'కి ఇచ్చి వివాహం చేసింది. కొంతకాలానికి మాలిని ద్వారా రుచికి మహావీర్యంతుడైన కుమారుడు జన్మించాడు. అతడే రౌచ్యుడనే పేరుతో విశ్వవిఖ్యాతుడై 'మనువు'గా కీర్తి పొందాడు.

## భౌమ్య మన్వంతరం

**పూ**ర్వం 'అంగిరా' అనే మహర్షికి భూతి అనే శిష్యుడు వుండేవాడు. అతడికి కోపం ముక్కు మీద వుంటుంది. మహా తపస్సంపన్నుడైన భూతి కోపానికి అందరూ అన్నీ భయపడేవి. ప్రకృతి కూడా ఆయన కోపానికి భయపడి సక్రమంగా ప్రవర్తించేది. ఆ 'భూతి' మునికి 'సువర్చుడు' అనే సోదరుడున్నాడు. అతడు ఒకనాడు గొప్పయాగాన్ని చేయాలని సంకల్పించి దానికి అన్నగారిని ఆహ్వానించాడు.

సోదరుడి యాగానికి వెళ్ళాలని నిశ్చయించుకున్న భూతి తన శిష్యుడైన శాంతుణ్ణి పిలిచి నిత్యం తన ఆశ్రమంలో తాను తిరిగి వచ్చేవరకూ అగ్నిహోత్రం చల్లారకుండా నిత్యహోమాలు ఆచరించమని చెప్పాడు. శిష్యుణ్ణి ఆవిధంగా

ఆజ్ఞాపించి తాను నిశ్చింతగా సోదరుడు చేస్తున్న యాగం దగ్గరకి బయలుదేరి వెళ్ళాడు. అయితే ఇక్కడ 'భూతి' ఆశ్రమంలో శిష్యుడు వేరే ఇతరమైన పనులు చేస్తున్న సమయంలో విధివశాత్తు అగ్నిహోత్రం చల్లారిపోయింది. అదిచూసి శిష్యుడు ఎంతో దుఃఖించాడు. "అయ్యో ఎంత అనర్థం జరిగిపోయింది. నేను తిరిగి అగ్నిని వెలగించినా నా గురువు దివ్యదృష్టితో చూసి తప్పుని గ్రహిస్తాడు. నన్ను భస్మం చేసేస్తాడు. ఇప్పుడెలా? ఏంచేయాలి?" అని పరిపరివిధాలుగా ఆలోచించాడు. చివరికి అగ్నిదేవుణ్ణే శరణు వేడుకుంటూ ఆయన్నిలా భక్తిగా స్తుతించాడు.

## అగ్నిస్తుతి

నమః సర్వభూతానాం సాధనాయ మహాత్మనే ।
ఏక ద్విపంచధిష్ణ్యాయ తాజసూయేషడాత్మనే ॥ 1

నమః సమస్త దేవానాం వృత్తిదాయ సువర్చసే ।
శుక్రరూపాయ జగతామ శేషాణాం స్థితిప్రదః ॥ 2

త్వం ముఖం సర్వదేవానాం త్వయాஉత్తం భగవన్ హవిః ।
ప్రియణస్యఖిలాన్ దేవాన్ త్వత్ప్రాణాః సర్వదేవతాః ॥ 3

హుతం హవిస్త్వయ్య నలమేధత్వ ముపగచ్ఛతి ।
తతశ్చ జలరూపేణ పరిణామ ముపైతియత్ ॥ 4

తేనాஉఖిలేషధీ జన్మఛవత్య నిలసారథే ।
ఔషదీభిరశేషాభిః సుఖం జీవంతి జంతవః ॥ 5

ప్రాణులందరికీ సాధకుడై వున్నవాడు మహాత్ముడు, ఒకటి, రెండు, ఐదు స్వరూపాలతో వున్నవాడు, రాజసూయ యాగంలో ఆరుమూర్తుల్ని ధరించి వున్నవాడు అయిన అగ్నిదేవుడికి నమస్కారం. సకలదేవతలకీ వృత్తిని ప్రసాదించే వాడు, సవర్చస్సు గలవాడు, సృష్టి అంతటకీ స్థితిని కల్పించేవాడు, అయిన శుక్ర స్వరూపుడికి నమస్కారం. ఓ అగ్నిదేవా! దేవతలందరి ముఖానివి నీవే.

నీవు నెయ్యిని పానం చేసి దేవతలందరికీ తృప్తిని కలిగిస్తున్నావు. దేవతలందరికీ ప్రాణస్వరూపుడి నీవే. నీలోనే యజ్ఞసామాగ్రి అంతా భస్మమై పవిత్రత పొంది, తిరిగి ఆ సామాగ్రి జలరూపంలో పరిణతి చెందుతోంది. ఓ అగ్నిదేవా నీవే అన్ని యజ్ఞాలకీ ఆధారం. దేవ, దానవ, యక్ష, గంధర్వ, మానవ, పశు, పక్షి, మృగ, సరీసృప గణాలన్నీ నీవల్లనే సంతృప్తి చెందుతున్నాయి. వృద్ధి చెందుతున్నాయి. ఓ అగ్నీ! నీవే దేవతలలో తేజస్స్వరూపంతో, సిద్ధులలో కాంతిరూపంతో, నాగులలో విషరూపంతో, పక్షులలో వాయురూపంతో వెలుగొందుతున్నావు.

హుతాశనా నీ 'విశ్వ' అనే నాలుక ప్రాణులందరికీ శుభాల్ని ప్రసాదిస్తుంది. ఆ నాలుకతో మహాపాపాల నుంచి, భయాల నుంచి మమ్మల్ని రక్షించు. అగ్నిదేవా నీవు సప్తార్చి, హవ్యవాహన, కృశాను, అగ్ని, పావక, శుక్ర అనే వివిధరకాల పేర్లతో విఖ్యాతి చెందావు. అలాంటి నీవు నన్ను అనుగ్రహించు.

'శాంతి' ఈవిధంగా ప్రార్థించగానే అగ్నిదేవుడు సంతుష్టుడై అతడికి ప్రత్యక్షమయ్యాడు. శాంతి జరిగినదంతా అగ్నికి విన్నవించి. ప్రభూ! నా అలక్ష్యం వల్ల అగ్ని నశించిన ఈ హోమగుండంలో పూర్వనుంచే వున్న విధంగానే అగ్ని నిలిచి వుండాలి. అలాగే పుత్రులులేని నా గురుదేవులకి పుత్రసంతానం కలగాలి. నా గురువుగారు అందరు ప్రాణులమీద స్నేహభావంతోనే వుండాలి. నేను చేసిన స్తోత్రాన్ని ఎవరు చేసినా వారిమీద నీ దివ్యానుగ్రహాన్ని కురిపించాలి. ఇవే నేను కోరే వరాలు స్వామీ!" అన్నాడు.

అగ్నిదేవుడు 'శాంతి' కోరిన వరాలు విని సంతోషించి వాటిని అనుగ్రహించి, అతడితో ఓయీ! నీవు ఉత్తమశిష్యుడివి నీ గురించి ఏ వరం కోరుకుండా నీ గురువు గురించే వరాలు కోరావు. నీ గురువు గారికి జన్మించే పుత్రుడు 'మనువు' అవుతాడు. నీవు కోరిన విధంగానే నీవు చేసిన అగ్నిస్తుతిని ఎవరు చేస్తారో వారికి సమస్త కోరికలూ సిద్ధిస్తాయి. యజ్ఞయాగాది క్రతువుల్లో ఈ దివ్యస్తోత్రాన్ని శ్రద్ధగా పఠిస్తే సకల శుభాలు జరుగుతాయి" అని చెప్పి అదృశ్యమయ్యాడు.

భూతిముని తన సోదరుడి యాగాన్ని దర్శించి తన ఆశ్రమానికి వచ్చాడు. హోమగుండంలో అగ్ని యధావిధిగా మండుతోంది. అదిచూసి ఆయన ఆనందించి శాంతితో "శిష్యా! నాకు ఎన్నడూ లేనివిధంగా నీమీద అందరిమీదా స్నేహభావం కలుగుతోంది. ఏమిటో ఈ వింత? నాకేం అంతుపట్టటం లేదు. నీకు తెలిస్తే చెప్పు" అని అడిగాడు. 'శాంతి' జరిగిన వృత్తాంతమంతా గురువుకి తెలియచేసాడు. అంతావిన్న భూతిముని సంతోషించి శాంతికి సకలవేదాల్ని శాస్త్రాల్ని సంపూర్ణంగా బోధించాడు. కొంతకాలానికి అగ్నిదేవుడి వరప్రభావంతో భూతిమునికి ఒక కుమారుడు జన్మించాడు. అతడే 'భౌత్యుడు' అనే పేరుతో విశ్వవిఖ్యాతి పొంది మనుచక్రవర్తిగా ప్రసిద్ధి చెందాడు. ఇతడే పద్నాలుగో మనువు.

భౌత్య మన్వంతరంలో 1.చాక్షుషులు 2.కనిష్టులు 3.పవిత్రులు 4.భ్రాజిరులు 5.ధారావృకులు అనే అయిదుగురు ప్రధానదేవతా గణాలుంటారు. ఆ సమయంలో మహావీరుడు తపోధనుడు అయిన 'శుచి' అనేవాడు వారికి ఇంద్రుడుగా వుంటాడు. భౌత్యమన్వంతరంలో 1.అగ్నీధ్ర 2.అగ్నిబాహు 3.శుచి 4.ముక్త 5.మాధవ 6.శుక్ర 7.అజిత అనేవారు సప్తర్షులుగా వుంటారు. భౌత్యమను మహారాజుకి వరుసగా గుహ, గంభీర, బ్రధ్న, భరత, అనుగ్రహ, శ్రీమానీ, ప్రతీర, విష్ణు, సంక్రందన, తేజస్వి, సుబల అనేవారు పుత్రులుగా జన్మించారు. వారు తదనంతర కాలంలో భూమండలానికి అధిపతులై జనరంజకంగా పాలించారు.

## మన్వంతరాల శ్రవణ ఫలం

**మా**ర్కండేయమహర్షి క్రౌష్టుకి మునితో ఈ పద్నాలుగు మన్వంతరాల విశేషాల్ని శ్రవణం చేసిన వారికి ఎలాంటి ఫలితం లభిస్తుందో ఇలా వివరిస్తున్నాడు.

మొదటిదైన స్వాయంభువ మన్వంతరాన్ని శ్రవణం చేస్తే ధర్మాన్ని పొందుతారు. రెండోదైన స్వారోచిష మన్వంతరం గురించి వింటే సకల

కోరికలూ సిద్ధిస్తాయి. మూడోదైన ఔత్తర మన్వంతరగాథని వింటే ధనలాభం, నాలుగోదైన తామస మన్వంతర చరిత్రని శ్రవణం చేస్తే జ్ఞానం, ఐదోదైన రైవత మన్వంతర గాథని వింటే బుద్ధి వికాసం కలుగుతాయి.

ఆరో మన్వంతరమైన చాక్షుష మన్వంతరగాథని వింటే ఆరోగ్యాన్ని, ఏడోదైన వైవస్వత మన్వంతర చరిత్రని శ్రవణం చేస్తే బలాన్ని, ఎనిమిదోదైన సూర్యసావర్ణి మన్వంతరాన్ని వింటే గుణవంతులైన కుమారులు జన్మిస్తారు. తొమ్మిదోదైన బ్రహ్మసావర్ణి మన్వంతారన్ని శ్రవణం చేస్తే గొప్ప మహిమల్ని, పదోదైన ధర్మసావర్ణి మన్వంతర గాథని వింటే శుభమంగళాలని, పదకొండో రుద్రసావర్ణి మన్వంతర చరిత్రని శ్రవణం చేస్తే సద్బుద్ధిని, జయాన్ని పొందుతారు. అదేవిధంగా పన్నెండోదైన దక్షసావర్ణి మన్వంతర గాథని వింటే తన వారందరిలోకీ గొప్పవాడౌతాడు. పదమూడోదైన రౌచ్యమన్వంతర గాథని శ్రవణం చేస్తే శత్రువుల్ని నాశనం చేయగలిగిన శక్తి లభిస్తుంది. చివరగా పద్నాలుగోదైన భౌత్యమన్వంతర చరిత్రని వింటే దైవానుగ్రహం, అగ్నిదేవుడి ఆశీస్సులు లభించి సుపుత్రులు జన్మిస్తారు.

స్వాయంభువ మన్వంతరం నుంచి భౌమ్య మన్వంతరం వరకూ వున్న పద్నాలుగు మన్వంతరాల గాథల్ని శ్రవణం చేసిన మానవుడు, ఆయా మన్వంతరాలకి అధిపతులుగా వున్న దేవతాగణాలు, ఉపదేవతలు, సప్తర్షులు, మనువులు వారి వంశం, వారందరి ఆశీస్సుల్ని పొందుతాడు. తద్వారా సకల పాపాల నుంచి అతడికి విముక్తి లభిస్తుంది.

## సూర్యుడి చరిత్ర

**మా**ర్కండేయ మహర్షి క్రౌష్టుని అభ్యర్థించగా మార్తాండుడి (సూర్యుడి) చరిత్రని; ఆయన గొప్పతనాన్ని మహిమని ఈవిధంగా చెప్పటం ప్రారంభించాడు.

విస్పష్టా పరమావిద్యాజ్యోతిర్భా శాశ్వతీస్ఫుటా ।
కైవల్యం జ్ఞానమావిర్భాః ప్రాకామ్యం సందిదేవ చ ॥

బోధశ్చాఽవగతిశ్చైవ స్మృతిర్విజ్ఞానమేవ చ ।
ఇత్యేతానీహ రూపాణి తస్మాఽరూపస్య భాన్వతః ॥

*(అధ్యాయం-98, శ్లోకం:18-19)*

విస్పష్ట, పరమా, విద్యా, జ్యోతి, శాశ్వతి, ప్రకాశితా, దీప్తి, కైవల్య, జ్ఞాన, ఆవిర్భావ, ప్రాకామ్య, సంవిత్, బోధ, అవగతి, స్మృతి, విజ్ఞాన ఇవన్నీ రూపంలేని సూర్యభగవానుడి స్వరూపాలు.

సృష్టికి పూర్వం ఈ జగత్తంతా అంధకారమయంగా వుండేది. అప్పుడు ఏ ప్రాణీ అక్కడ లేదు. ఆ సమయంలో అక్షయంగా జగత్తు ఉత్పత్తి అవటానికి కారణమైన ఒకపెద్ద అండం జన్మించింది. ఆ అండం మధ్యభాగంలో జగత్పతి అయిన బ్రహ్మదేవుడు కొలువున్నాడు. ఆయన ఆ అండాన్ని భేదించుకుని బైటకి వచ్చాడు.

బ్రహ్మముఖం నుంచి మొదటగా ఓం అనే శబ్దం ఆవిర్భవించింది. తరువాత క్రమంగా భూః, భువః, సువః అనే శబ్దాలు ఉత్పన్నమయ్యాయి. ఈ మూడిటినీ వ్యాహృతులంటారు. ఇవి సూర్యుడి స్వరూపాలు. తరువాత ఓంకారం నుంచి సూర్యుడి స్థూల, సూక్ష్మ రూపాలైన 'మహః', 'జనః' 'తపః' 'సత్యః' అనేవి ఉత్పన్నమయ్యాయి. కనుక సూర్యుడు ఓంకార స్వరూపుడు. సాక్షాత్తు ఆ పరబ్రహ్మ మార్తాండుడి శరీరాన్ని ధరించింది.

క్రౌష్టుకీ! సృష్టి మొదట ఆవిర్భవించిన అండం పగిలిన వెంటనే బ్రహ్మదేవుడు బైటకిరాగా ఆయన మొదటిముఖం నుంచి జపాపుష్పాలలాగా ఎర్రగా వున్న ఋగ్వేద ఛందస్సులు ఆవిర్భవించాయి. దక్షిణముఖం నుంచి బంగారు రంగులో ప్రకాశించే యజుర్వేద ఛందస్సులు ఉత్పన్నమయ్యాయి. పశ్చిమముఖం నుంచి సామవేద ఛందస్సులు, ఉత్తరముఖం నుంచి ఉచ్చాటన, అభిచార క్రియలతో కూడుకున్న అధర్వవేద ఛందస్సులు ఆవిర్భవించాయి. ఈ తేజస్సులన్నీ కలిసి తిరిగి పరమతేజస్సుతో వెలిగిపోతున్న ఓంకారంలో లీనమైనాయి. ఆవిధంగా మొదట రూపొందిన ఓంకార తేజస్సే సూర్యుడు అనే పేరుని పొందింది.

సృష్టి స్థితి లయకారకుడు, శాశ్వతుడు అయిన ఈ సూర్యుడు సత్త్వరజస్తమో గుణాల్ని ఆశ్రయించి బ్రహ్మ, విష్ణు, శివ అనే పేర్లతో అవతరించాడు. జ్యోతిస్వరూపుడైన ఆ సూర్యుడు ఆదిపురుషుడు, పరమపూజ్యుడు, వేదమూర్తి, నిరాకారుడు, ఈ సమస్త విశ్వానికి ఆశ్రయ స్వరూపుడు, గొప్పవారందరి కన్నా గొప్పవాడు. దేవతలందరి చేత పూజించబడేవాడు.

సూర్యుడి దివ్యతేజస్సుతో ఊర్ధ్వ అధోలోకాలన్నీ ఎంతో వేడికి గురౌతున్నాయి. ఆ సమయంలో బ్రహ్మదేవుడు సృష్టి చేయాలని భావించి ఇలా చింతించసాగాడు. "అయ్యో! నేను సృష్టి చేసినప్పటికీ ఆ జీవులన్నీ సూర్యుడి దివ్యతేజస్సుని తట్టుకోలేక మరణిస్తాయి కదా! ఇక నీరంతా ఆ వేడికి ఆవిరైపోతుంది. నీరు లేకపోతే అసలు సృష్టి చేయటమే కుదరదు" ఇప్పుడేం చేయాలి? అని ఆలోచించి ధ్యాననిమగ్నుడై సూర్యుణ్ణి ఇలా స్తుతించటం ప్రారంభించాడు.

## బ్రహ్మ చేసిన సూర్యస్తుతి

నమస్తే యన్మయం సర్వమేతత్సర్వ మయశ్చయః ।
విశ్వమూర్తిః పరంజ్యోతిః యత్తద్ధ్యాయంతి యోగినః ॥ 1

యం ఋుఙ్మయో యోయయజుషాం నిధాన ।
సామ్నాంచ యో యోని రచింత్య శక్తిః ॥
త్రయీమయః స్థూలతయాఽర్ధమాత్రాః ।
పరస్వరూపో గుణపారయోగ్యః ॥ 2

త్వాం సర్వహేతు పరమం చ వేద్య ।
మాద్యః పరంజ్యోతి రవేద్య రూపమ్ ॥
స్థూలంచ దేవాత్మ తయా నమస్తే ।
భాస్వంత మాద్యం పరమం పరేభ్యః ॥ 3

సృష్టిం కరోమి యదహం తవశక్తి దార్ఢ్యా ।
ఉత్ప్రేరితో జలమహీ పవనాఽగ్నిరూపామ్ ॥
తద్దేవతాఽదివిషయాం ప్రణవాఽద్య శేషాం ।
నాఽత్మేచ్ఛయా స్థితిం లయాదపి తద్వదేవ ॥ 4

వహ్నిస్త్వమేవ జలశోషణతః పృధివ్యాః ।
సృష్టిం కరోషి జగతాం చ తథాఽద్యపాతమ్ ॥
వ్యాపీత్వమేవభగవన్ గగన స్వరూపం ।
త్వం పంచథా జగదిదం పరిపాసి విశ్వం ॥ 5

యజ్ఞైర్యజంతి పరమాత్మ విదోభవంతం ।
విష్ణుః స్వరూప మఖిలేష్టిమయీా వివస్వన్ ॥
ధ్యాయంతిచాఽపి యతయో వియతాత్మ చిత్తాః ।
సర్వేశ్వరం పరమాత్మ విముక్తి కామాః ॥ 6

నమస్తే దేవరూపాయ యజ్ఞరూపాయతే నమః ।
పరబ్రహ్మ స్వరూపాయ చింత్యమానాయ యోగిభిః ॥
ఉపసంహర తేజోయత్ తేజసః సంహతి స్తవ ।
సృష్టే ర్విధూతాయ విభోః సృష్టౌచాఽహం సముద్యతః ॥ 7

*(అధ్యాయం-100, శ్లోకం:5-13)*

ఎవడు ఈ సమస్త విశ్వానికీ ఆత్మస్వరూపుడగా వున్నాడో, ఎవడు ఈ విశ్వం రూపంలో సంచరిస్తున్నాడో, ఈ విశ్వమే తనమూర్తిగా ఎవడు కలిగివున్నాడో, ఏ యోగిగణాలు ఇంద్రియాలకి గోచరించని పరంజ్యోతి ధ్యానిస్తుంటారో అలాంటి వాడికి (సూర్యుడికే నమస్కరిస్తున్నాను)

ఎవడు అంచిత్యమైన శక్తిగల ఋగ్వేదమయుడై వున్నాడో, యజుర్వేదానికి ఆధారమైవున్నాడో, ఎవడు సామవేదం ఉత్పత్తికి కారణభూతుడో, ఎవడు త్రయీస్వరూపుడో, ఎవడు అర్ధమాత్రరూపుడో, పరమ స్వరూపుడు,

గుణపారయోగ్యుడు, అన్ని హేతువుల స్వరూపుడు, పరంజ్యోతిరూపుడు ఎవడో, స్థూలస్వరూపుడు దేవతాత్మరూపుడు, గొప్పవారిలో గొప్పవాడు అయిన భాస్కరుడికి నమస్కరిస్తున్నాను.

నీవే దేవస్వరూపుడివి, నీవే యజ్ఞరూపానివి, యోగిజనులు నిరంతరం చింతించే పరబ్రహ్మవి. నీకు నమస్కరిస్తున్నాను. ఓ ప్రభూ! సూర్యదేవా! నీ దివ్యతేజస్సుని కాస్త ఉపసంహరించుకో, నేనిప్పుడు సృష్టి చేయటానికి సిద్ధంగా వున్నాను. దానికి నీ తేజస్సు అడ్డంకిగా వుంది" అని ప్రార్థించాడు.

బ్రహ్మదేవుడి ప్రార్థన విన్న సూర్యుడు తన మహాతేజస్సుని ఉపసంహరించి అల్పతేజస్సునే ధరించాడు. అప్పుడు బ్రహ్మదేవుడు సంతోషించి వెంటనే పూర్వకల్పంలాగా ప్రస్తుత కల్పాన్ని కూడా సృష్టించటం ప్రారంభించాడు.

## బ్రహ్మసృష్టి

**పూ**ర్వం సృష్టించిన విధంగానే బ్రహ్మ వర్ణాలనీ, ఆశ్రమాలనీ, పర్వతాలనీ, సముద్రాలనీ, సమస్త ద్వీపాలనీ సృష్టించాడు. తరువాత దేవతల్ని, దానవుల్ని, నాగగణాల్ని తదితర సమూహాలన్నిటినీ సృష్టించి వారివారి స్థానాల్ని పూర్వంలాగానే నిర్దేశించాడు.

బ్రహ్మదేవుడి మనసునుంచి మరీచి అనే పుత్రుడు జన్మించాడు. ఆ మరీచికి కశ్యపుడు అనే కుమారుడు కలిగాడు. ఆయనే కాశ్యపుడు అనే పేరుతో ప్రసిద్ధి చెందాడు. ఆ కాశ్యపుడికి దక్షప్రజాపతి పదమూడు మంది కుమార్తెలు భార్యలయ్యారు. వారి ద్వారా కశ్యపుడికి, దేవతలు, దానవులు, సర్పాలు వంటి ఎంతోమంది సంతానం జన్మించారు. కశ్యపుడి భార్యలలో అదితి దేవతల్ని కనగా, దితి రాక్షసుల్ని కన్నది. దనువు అనే భార్య ఘోరమైన అసురుల్ని ప్రసవించింది.

కశ్యపుడికి వినత ద్వారా గరుడ అరుణులు, ఖన అనే భార్యద్వారా యక్షులు, రాక్షసులు, కద్రువ ద్వారా నాగులు, ముని ద్వారా గంధర్వులు,

క్రోధ అనే భార్య ద్వారా కుల్యగణాలు, లిష్ట ద్వారా అప్సరసలు, ఇరా ద్వారా ఐరావతాది ఏనుగులు, తామ్ర ద్వారా శ్యేని వంటి కన్యలు, ఇల అనే భార్య ద్వారా వృక్షగణాలు, ప్రధ ద్వారా పతంగగణాలు జన్మించారు. కశ్యపుడికి జన్మించిన ఈ సంతానంలోని వారందరూ తిరిగి పరంపరగా తమతమ సంతానాలని వృద్ధి చేసారు. ఆ విధంగా వారందరి సంతానంతో లోకాలన్నీ నిండిపోయాయి.

కశ్యపుడి సంతానంలో దేవతాగణాలు మొదటివి. ఆ దేవతలు సాత్త్విక, రాజస, తామస గుణాలతో మూడురకాలుగా వుంటారు. బ్రహ్మదేవుడు దేవతలందరినీ త్రిభువనాలకి అధిపతులుగా, యజ్ఞ భుక్కులుగా నియమించాడు. అయితే దేవతల సవతితల్లి దితి పుత్రులైన దైత్యులు, రాక్షసులు ఏకమై దేవతలమీద వైరాన్ని పెంచుకుని వారినెంతో బాధించసాగారు. వారిద్దరి మధ్యా ఎన్నోసార్లు యుద్ధాలు జరిగాయి. కొంతకాలం తరువాత దానవులు దేవతలందరినీ ఓడించి వారివారి లోకాలనుంచి తరిమికొట్టి వాటిని ఆక్రమించుకున్నారు. ఆ సమయంలో తన కుమారుల దుఃస్థితి చూసి చలించిపోయిన అదితి ఎంతో దుఃఖంతో సూర్యభగవానుణ్ణి ప్రార్థించింది.

"ఓ జ్యోతిస్వరూపా! నీవు శాశ్వతుడివి. జ్యోతిష్యగణాలలో నీవే ప్రథముడివి. అన్ని జ్యోతులకీ ఆధార స్వరూపుడవైన నీకు నమస్కారం. ఋక్‌యజుస్సామ అనే మూడువేదాలు కలిసిన త్రయీ అనే పేరుతో విఖ్యాతుడవైన నీకు నమస్కారం. గొప్పది, సూక్ష్మమైనది, పవిత్రంగా వుండేది, ఓంకార రూపమైనది అయిన నీ దివ్యరూపానికి నమస్కారం" ఈవిధంగా అదితి నిరాహారంగా రాత్రిపగలు లేకుండా సర్వకాలాలలో శ్రద్ధా భక్తులతో సూర్యుణ్ణి స్తుతించింది.

కొంతకాలం తరువాత సూర్యభగవానుడు ఆకాశంలో అదితికి దర్శనమిచ్చాడు. ఆ దివ్యతేజస్సుని అదితి చూడలేకపోయింది. "ప్రభూ!

సూర్యదేవా! నీ ప్రచండ రూపాన్ని నేను ఏమాత్రం చూడలేకపోతున్నాను. దయచేసి నీవు సాధారణ తేజస్సుతో మానవరూపంలో నాకు కనిపించు అని ప్రార్థించింది. అదితి ప్రార్థన విని సూర్యుడు తన తేజోమండలం నుంచి రాగిరంగు శరీరంతో మానవాకారం ధరించి ఆమె ముందుకొచ్చాడు.

అదితిని చూసి ఆమె స్తుతికి తానెంతో సంతోషించానని చెప్పి వరం కోరుకోమనగా, అదితి ఆయనతో "స్వామీ, దితి కుమారులైన దైత్యులు నా పుత్రులైన దేవతల్ని ఎన్నో హింసలకి గురిచేసి వారివారి స్థానాల నుంచి తరిమేశారు. నామీద దయవుంచి నీవు నీ అంశతో దేవతలకి సోదరుడివై అసురుల్ని నాశనం చేయి. తిరిగి నా పుత్రులు తమతమ లోకాల్ని పొందేలా అనుగ్రహించు" ఇదే నా కోరిక అని పలికింది.

అదితి కోరిక విన్న సూర్యుడు ఆమెతో "ఓ అదితీ! త్వరలోనే నాలోని వెయ్యో అంశతో నీ గర్భం ద్వారా జన్మించి నీ కుమారులైన దేవతల శత్రువులందర్నీ పరిమారుస్తాను. తిరిగి వారిని వారివారి స్థానాలు పొందేలా చేస్తాను" అని చెప్పి అంతర్ధానమయ్యాడు.

కొంతకాలం గడిచిన తరువాత ఒక శుభముహూర్తాన సూర్యుడి తేజస్సులో వెయ్యోవంతు కిరణమైన 'సౌషుమ్న' అనే తేజస్సు దేవతల తల్లి అయిన అదితి గర్భంలోకి ప్రవేశించింది. సూర్యుడు తన గర్భంలో ప్రవేశించిన నాటినుంచి అదితి ఎంతో శ్రద్ధతో తన గర్భం క్షేమంగా నిలవాలని భావించి కృచ్ఛ చాంద్రాయణాది ఉపవాస వ్రతాల్ని ఆచరించ సాగింది. అదిచూసి కశ్యపుడు కోపంతో "దేవీ! నీవిలా నిత్యం ఉపవాసం చేసి కృశిస్తూ నీ గర్భంలో వున్న బిడ్డని చంపేలా వున్నావే! అని పరుషంగా అన్నాడు. "స్వామీ! నేనేమీ పిండాన్ని చంపటంలేదు. దాన్ని చాలా జాగ్రత్తగా సంరక్షిస్తున్నాను. నాలో వున్న పిండం శత్రువినాశ కారకమౌతుంది" అని సమాధానం చెప్పి భర్త తనని నిందించినందుకు ఆవేశం ఆపుకోలేక మహాతేజస్సుతో వెలుగుతున్న తన గర్భాన్ని వదిలేసింది.

గర్భం నుంచి జారిపడ్డ పిండం దివ్యతేజస్సుతో వెలిగిపోతుండటాన్ని చూసి కశ్యపుడు ఆద్యబుుక్ మంత్రాలతో దాన్ని స్తుతించాడు. కశ్యపుడి ద్వారా స్తుతించబడ్డ సూర్యుడు తన దివ్యతేజస్సుని అన్ని దిక్కులకీ వ్యాపింపచేస్తూ పద్మపత్రం లాంటి శరీరంతో ఆ గర్భాండం నుంచి ఆవిర్భవించాడు.

అదే సమయంలో మధురమైన స్వరంతో ఆకాశవాణి కశ్యపుడితో ఇలా చెప్పింది "ఓ మహర్షీ! నీవు నీభార్యలో వున్న అండాన్ని చంపుతావా ఏమిటి? అని అన్నావు. ఆ కారణంగా నీకు జన్మించిన ఈ పుత్రుడు మార్తాండుడు అని పిలువబడతాడు. నీ కుమారుడు సామాన్యుడు కాడు. ప్రపంచానికి సూర్యుడవుతాడు. నీ కుమారులైన దేవతల కష్టాలు పోగొడతాడు. దుష్టులైన అసురుల్ని సంహరిస్తాడు" అని పలికింది.

ఆకాశవాణి మాటలు విని ఆకాశం నుంచి దేవతలంతా తమ కష్టాలు తీరబోతున్నాయని ఆనందించి కిందికి దిగివచ్చారు. క్రమంగా మార్తాండుడు పెరిగి పెద్దవాడయ్యాడు. దివ్యతేజస్సుతో మహా పరాక్రమవంతుడయ్యాడు. ఆ సమయంలో దేవతలు అసురుల మీద యుద్ధం ప్రకటించారు. దేవదానవుల మధ్య పోరు ప్రారంభమయ్యింది. ఆ యుద్ధంలో దానవులందరూ మార్తాండుడి దివ్యతేజస్సుని తాకిన వెంటనే మాడిమసైపోయారు. చివరికి వారందరూ అధికసంఖ్యలో మరణించగా మిగిలిన వారు భయంతో పారిపోయారు.

దేవతలకి తిరిగి విజయం లభించింది. తమ కష్టాలు పోగొట్టిన మార్తాండుణ్ణి దేవతలతో సహా అదితి భక్తిపూర్వకంగా స్తుతించింది. ఆవిధంగా మార్తాండుడి అనుగ్రహంతో దేవతలు తమ స్థానాల్ని తిరిగి స్వాధీనం చేసుకున్నారు. మార్తాండుడు సూర్యుడిలామారి తన దివ్యకిరణాలతో గోళాకారంలా వున్న అగ్నిగుండంలా ప్రకాశిస్తూ లోపలకి వెలుగులు ప్రసాదించసాగాడు.

# మార్కండేయ పురాణంలోని దేవీస్తుతి

నమో దేవ్యై మహాదేవ్యై శివాయై సతతం నమః ।
నమః ప్రకృత్యై భద్రాయై నియతాః ప్రణతాః స్మృతామ్ ॥ 1
రౌద్రాయై నమో నిత్యాయై గౌర్యై ధాత్ర్యై నమో నమః ।
జ్యోత్స్నాయై చేందురూపిణ్యై సుఖాయై సతతం నమః ॥ 2
కళ్యాణ్యై ప్రణతాం వృద్ధ్యై సిద్ధ్యై కుర్మో నమో నమః ।
నైర్ఋత్యై భూభృతాం లక్ష్మ్యై శర్వాణ్యై తే నమో నమః ॥ 3
దుర్గాయై దుర్గపారాయై సారాయై సర్వకారిణ్యై ।
ఖ్యాత్యై తథైవ కృష్ణాయై ధూమ్రాయై సతతం నమః ॥ 4
అతిసౌమ్యాతిరౌద్రాయై నమస్తస్యై నమో నమః ।
నమో జగత్ప్రతిష్ఠాయై దేవ్యై కృత్యై నమో నమః ॥ 5
యా దేవీ సర్వభూతేషు విష్ణుమాయేతి శబ్దితా ।
నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమో నమః ॥ 6
యా దేవీ సర్వభూతేషు చేతనేత్యభిధీయతే ।
నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమో నమః ॥ 7
యా దేవీ సర్వభూతేషు బుద్ధిరూపేణ సంస్థితా ।
నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమో నమః ॥ 8
యా దేవీ సర్వభూతేషు నిద్రారూపేణ సంస్థితా ।
నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమో నమః ॥ 9
యా దేవీ సర్వభూతేషు క్షుధారూపేణ సంస్థితా ।
నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమో నమః ॥ 10
యా దేవీ సర్వభూతేషు చ్ఛాయారూపేణ సంస్థితా ।
నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమో నమః ॥ 11
యా దేవీ సర్వభూతేషు శక్తిరూపేణ సంస్థితా ।
నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమో నమః ॥ 12
యా దేవీ సర్వభూతేషు తృష్ణారూపేణ సంస్థితా ।
నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమో నమః ॥ 13
యా దేవీ సర్వభూతేషు క్షాంతిరూపేణ సంస్థితా ।
నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమో నమః ॥ 14

యా దేవీ సర్వభూతేషు జాతిరూపేణ సంస్థితా ।
నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమో నమః ॥ 15
యా దేవీ సర్వభూతేషు లజ్జారూపేణ సంస్థితా ।
నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమో నమః ॥ 16
యా దేవీ సర్వభూతేషు శాంతిరూపేణ సంస్థితా ।
నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమో నమః ॥ 17
యా దేవీ సర్వభూతేషు శ్రద్ధారూపేణ సంస్థితా ।
నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమో నమః ॥ 18
యా దేవీ సర్వభూతేషు కాంతిరూపేణ సంస్థితా ।
నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమో నమః ॥ 19
యా దేవీ సర్వభూతేషు లక్ష్మీరూపేణ సంస్థితా ।
నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమో నమః ॥ 20
యా దేవీ సర్వభూతేషు వృత్తిరూపేణ సంస్థితా ।
నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమో నమః ॥ 21
యా దేవీ సర్వభూతేషు స్మృతిరూపేణ సంస్థితా ।
నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమో నమః ॥ 22
యా దేవీ సర్వభూతేషు దయారూపేణ సంస్థితా ।
నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమో నమః ॥ 23
యా దేవీ సర్వభూతేషు తుష్టిరూపేణ సంస్థితా ।
నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమో నమః ॥ 24
యా దేవీ సర్వభూతేషు మాతృరూపేణ సంస్థితా ।
నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమో నమః ॥ 25
యా దేవీ సర్వభూతేషు భ్రాంతిరూపేణ సంస్థితా ।
నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమో నమః ॥ 26
ఇంద్రియాణామధిష్ఠాత్రీ భూతానాం చాఖిలేషు యా ।
భూతేషు సతతం తస్యై వ్యాప్తిదేవ్యై నమో నమః ॥ 27
చితిరూపేణ యా కృత్స్నమేతద్వ్యాప్య స్థితా జగత్ ।
నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమో నమః ॥ 28



# మార్కండేయపురాణ శ్రవణ పఠన ఫలం

**ఈ** మార్కండేయ పురాణాన్ని శ్రవణం చేసినవాడు పఠించినవాడు సమస్త పాపాలనుంచి విముక్తులై చివరికి బ్రహ్మసాయుజ్యం పొందుతారు. ఈ పురాణం పూర్వం బ్రహ్మదేవుడి ద్వారా మార్కండేయ మహర్షికి చెప్పబడింది. అష్టాదశ పురాణాలలో ఇది ఏడవది.

మార్కండేయ పురాణంలో సర్గ, ప్రతిసర్గ, వంశం, మన్వంతరం, వంశానుచరితం అనే అయిదు లక్షణాలూ వున్నాయి. ప్రశ్న చతుష్టయంతో ప్రారంభమైన ఈ పురాణం వినటం వల్ల కోటికల్పాలలో చేసిన పాపాలన్నీ నశిస్తాయి. బ్రహ్మహత్యాది మహాపాపాలు కూడా తక్షణమే తొలగిపోతాయి.

**పుష్కరే దానజం పుణ్యం శ్రవణాదస్య జాయతే ।**
**సర్వవేదాఽధికఫలం సమాప్త్యాచాఽధి గచ్ఛతి ॥**
**యః శ్రావయేత్ పూజయేత్తం యథాదేవం పితామహమ్ ।**
**గంధపుష్పై స్తథా వస్త్రై ర్బ్రాహ్మణానాం చ తర్పణైః ॥**

(అధ్యాయం-134, శ్లోకం :16-17)

పుష్కరక్షేత్రంలో దానం చేస్తే ఏ ఫలితం వస్తుందో అదే ఫలితం ఈ పురాణ శ్రవణం వల్ల లభిస్తుంది. ఈ పురాణాన్ని సంపూర్ణంగా వింటే నాలుగు వేదాల్నీ పారాయణ చేసిన దానికంటే అధికమైన పుణ్యం లభిస్తుంది. ఈ పురాణాన్ని వినేవారిని బ్రహ్మదేవుడితో సమానంగా పూజించాలి. గంధ పుష్పాది ఉపచారాలతో అతన్ని పూజించి విప్ర సమారాధన చేయాలి.

ఈ పురాణం సకలవేదాల సారం ధర్మశాస్త్ర నిలయం. దీనిని వినటం వల్ల సర్వార్థాలూ కలుగుతాయి. ఈ పురాణాన్ని విన్నవారికి, చెప్పినవారికి అన్ని మనోరథాలూ సిద్ధిస్తాయి. శత్రువులుండరు. చోర బాధలుండవు. బుద్ధి, వృద్ధి, స్మృతి, శాంతి, లక్ష్మి, పుష్టి, తుష్టి అనేవి నిత్యం ఈ పురాణ శ్రవణం చేసినవాడికి లభిస్తాయి.

**స్వస్తి**

**సర్వేజనాః సుఖినోభవన్తు**